

# విప్రనారాయణ.



గ్రంథకర్త:
రాధాకృష్ణ, పాదుకా పట్టాభిషేకము, విప్రనారాయణ
మొదలగు నాటకములు రచించిన
పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు.




ప్రకాశకులు:
కురుకూరి సుబ్బారావు సన్,
సరస్వతీ బుక్ డిపో,
విజయవాడ-1.

1953

 [వెల రు 1-12-0

కొనేరు కుటుంబరావుగారి రచనలు

# ఆశాజ్యోతి

బానిసత్వం నుండి విముక్తి పొందామన్న
మాటేగాని యేరంగంలోను విజయం సాధించలేక

ఆశయానికి ఈ గ్రంథం ప్రతిబింబం.

వెల 1–8–0

శ్రీరస్తు

# విప్రనారాయణ.

★

ఆఱంకముల ప్రహసనము



పాదుకాపట్టాభిషేకము, రాధాకృష్ణ, కోకిల,
మొదలగు నాటకములు రచించిన



కీర్తిశేషులయిన

## పానుగంటి లక్ష్మీనరసింహారావుగారిచే

రచియింపఁబడినది.

నాల్గవకూర్పు 1000 ప్రతులు

పబ్లిషర్సు :

కురుకూరి సుబ్బారావు సన్

ప్రొప్రయిటరు :

సరస్వతీ బుక్ డిపో, విజయవాడ.

లీలా ప్రెస్, విజయవాడ-2.



 1954 [వెల రు. 1—12—0

# హెచ్చరిక

ఈ శ్రీ విప్రనారాయణ చరిత్ర నాటకము యొక్క సర్వహక్కులు గ్రంథకర్తగారివద్ద మేము కాపీరైటు పొందియున్నాము. ఈ నాటకమునందలి పదములుగాని, భావములుగాని ఏమాత్రము కాపీచేయ కూడదు. ఇందలి పాటలు, పద్యములు, వచనములలో గ్రామఫోను రికార్డు యీయవలయునన్నను, టాకీ స్క్రీనింగు చేయవలయు నన్నను, స్టేజీమీద ప్రదర్శించ వలయునన్నను మా లిఖితపూర్వకమైన పర్మిషన్ పొంది తీరవలయును. ఇందులకు అతిక్రమించిన వారలు మా నష్టములకు బాధ్యులగుటయేగాక మేము తెచ్చు సివిల్ క్రిమినల్ చర్యలకు బద్ధులగుదురని ఇందుమూలముగా తెలియపరచడమైనది.



కీర్తిశేషులైన

కురుకూరి సుబ్బారావు

స్థాపకులు : : సరస్వతీ బుక్ డిపో.

# ఈ నాటకమున వచ్చు పాత్రలు.



## పురుషులు :

విప్రనారాయణుడు—కథానాయకుఁడు.

శ్రీనివాసుఁడు—విప్రనారాయణుని శిష్యుఁడు.

మాధవుఁడు—ఒక విటుఁడు.

రాజు—చోళ భూపాలుఁడు.



## స్త్రీలు :

దేవదేవి—కథానాయిక యగు వేశ్య.

మధురవాణి—దేవదేవి యక్క.

వేశ్యమాత—దేవదేవి తల్లి.





# విప్రనారాయణ చరిత్రము.

## నాంది

రారాజన్మణికుండలస్ఫురిత దీ♦ర్ఘశ్రోత్రసంభావ్యుఁడున్
నీరేజాయతపత్త్రమిత్రవిలస♦న్నేత్రోజ్జ్వలాస్యుండు భ
క్త్యారూఢాత్మకదృష్టి పర్వ సుభగ♦శ్యామాంగుఁడై పోల్చునా
శ్రీరంగేశుఁడు మీ కొసంగుత యశ♦శ్శ్రీలాయురారోగ్యముల్.

[నాంద్యంతమందుఁ దెరఁగో]

ఉ॥ కోకిలపల్కుల న్గులుకు ♦ గుబ్బలతళ్కులఁ జూపుబెళ్కులన్
సోకి సువర్ణ వర్ణమును ♦ జూపెడు సన్నికషంబుపోలికన్
దేఁకువగల్గుభక్తులను ♦ స్త్రీజనసక్తుల వేఱుపుచ్చు బి
బ్బోకవతుల్ చెలంగుదురు ♦ హో! సువయోవిభవాభిరాములై.

సూత్ర—[చెవియొగ్గివిని] ఏ మిది? ప్రతిధ్వనియా? కాదు కాదు! నా యవ్యాజస్తుతికిఁ బ్రత్యధిక్షేపాశీర్వాదము పద్యరూపముగఁ జదువఁబడినది. చదివినవా రెవ్వరని యాలోచింప నేల? ఈ సర్వము నెఱజాణ యగు నటి శ్రావ్యకంఠస్వరము. అది యెప్పుడును బరిహాసప్రియగదా!

[నటి ప్రవేశించును]

నటి—పరిహాసమున కిం దే మున్నది? మీరు పురుషులు. మీ యిష్ట దైవము పరమపురుషుఁడు? సభ్యు లందఱో, పెక్కురో పురు

# ఈ నాటకమున వచ్చు పాత్రలు.



పురుషులు :

విప్రనారాయణుడు—కథానాయకుడు.

శ్రీనివాసుడు—విప్రనారాయణుని శిష్యుడు.

మాధవుడు—ఒక విటుడు.

రాజు—చోళ భూపాలుడు.



స్త్రీలు :

దేవదేవి—కథానాయిక యగు వేశ్య.

మధురవాణి—దేవదేవి యక్క.

వేశ్యమాత—దేవదేవి తల్లి.





# విప్రనారాయణ చరిత్రము.

## నాంది

రారాజన్మణికుండలస్ఫురిత దీ♦ర్ఘశ్రోత్రసంభావ్యుఁడున్
నీరేజాయతపత్త్రమిత్త్రవిలస♦న్నేత్రోజ్జ్వలాస్యుండు భ
క్త్యారూఢాత్మకదృష్టి పర్వ సుభగ♦శ్యామాంగుఁడై పోల్చునా
శ్రీరంగేశుఁడు మీ కొసంగుత యశ♦శ్శ్రీలాయురారోగ్యముల్.

[నాంద్యంతమందుఁ దెరలో]

ఉ॥ కోకిలపల్కుల న్గులుకు ♦ సుబ్బలతళ్కులఁ జూపుబెళ్కులన్
సోకి సువర్ణ వర్ణమును ♦ జూపెడు సన్నికషంబుపోలికన్
దేఁకువగల్గుభక్తులను ♦ స్త్రీజనసక్తుల వేఁచుపుచ్చు బి
బ్బోకవతుల్ చెలంగుదురు ♦ హో! సువయోవిభవాభిరాములై.

సూత్ర—[చెవియొగ్గివిని] ఏ మిది? ప్రతిధ్వనియా? కాదు కాదు! నా యవ్యాజస్తుతికిఁ బ్రత్యధిక్షేపాశీర్వాదము పద్యరూపముగఁ జదువఁబడినది. చదివినవా రెవ్వరని యాలోచింప నేల? ఈ సర్వము నెఱజాణ యగు నటి శ్రావ్యకంఠస్వరము. అది యెప్పుడును బరిహాసప్రియగదా!

[నటి ప్రవేశించును]

నటి—పరిహాసమున కిం దే మున్నది? మీరు పురుషులు. మీ యిష్ట దైవము పరమపురుషుఁడు? సభ్యు లందఱో, పెక్కురో పురు

షులు. వారి కండజ కాయురారోగ్యసంపత్సమృద్ధి మీారు వేడఁగాఁ బాపము! స్త్రీజాతికిమాత్రము శుభ మక్కఱలేదా? యని చింతించి మీావలె గంభీరశార్దూలధ్వనులతో బహిరంగముగఁ గాకపోయినను దెరమాటునుండి సన్నని గొంతుతో మా కలువకంటులపై నొక చిన్న యాశీర్వాదోత్పలమాల వైచితిని. ఇందున కింత యీర్ష్యయేల? శ్రీరంగనాథుఁడు మీా పురుషులకు శుభమిచ్చుచుండ మా యబలలను, వారి సహజ నితావయనములనే శుభపరికరములుగఁ జేసికొం డంటిని. ఇందుఁ దప్పె మున్నదో యీా ముగ్ధ యగు కింకరురాలికిఁ దెలియఁజేయఁ గోరెదను.

సూత్ర—ఏమీా యభినవప్రోషితర్కవాగ్వాహిని! ఈ తళుకుబెళుకులు శుభపరికరములా? కావు. తమకు నితరులకుం గూడ నపార ఘోర పాతకరములు. హరిభక్త్యార్జిత పుణ్యాలేశవిదారణమారణ క్రూరగములు. ఐహికతుచ్ఛసుఖసాధనంబు లైన నగుంగాక! నటీ! కవితల్లజుఁ డైనపానుగంటి లక్ష్మీనరసింహారావు ముద్దులు మూటఁ గట్టునట్టు వ్రాసిన "వైజయంతీవిలాస" మను తొమ్మిదవ నాటక మిది బహుజాగరూకతతోఁ బ్రదర్శింపవలయు నని యెంత బతిమాలిచెప్పినను మొట్టమొదటనే రసాభాస మొనర్చితివి!

గీ॥ విప్రనారాయణుని తీవ్ర ♦ విష్ణుభక్తి
మాపె నా దేవదేవి యె♦మ్మాడ్కి వచ్చి
యాసరణి వచ్చి గంగలోఁ ♦ద్రోసినావు
నా హృదయమందుఁ గల్గు ను♦త్సాహ మంత.

నటి—అట్లనెద రేమి? దేవదేవి ప్రయత్నము తుదకు భక్తిభ్రంశకార ణముసకుమాటు భక్త్యుచ్ఛ్రయహేతువై యతని నాళ్వారుగను

నామెను విరాగినిగను మార్చినది కదా! నా యాదిమశృంగార ప్రశంసయు నట్లే రసశోషణకరమునకు మాఱు రసపోషణకరమగు నేమో యెవ రెఱుంగుదురు? నారాయణతీర్థ, జయదేవ, లీలాశుకభక్తత్రితయమునకు వారిశృంగారవర్ణనము లేమైన కొఱంతదీసికొనివచ్చినవా? అదియుంగాక స్త్రీవ్యామోహపాశ బద్ధులెవరో యథార్థ శ్రీహరిపాదకీలితబుద్ధు లెవరో తెలిసి కొనుటకు విలాసినులు సాధకములు గాన వారి దీవించితిని.

సూత్ర—అలాగునరా?

గీ॥ వీరు యోగ్యు లయోగ్యులు ♦ వీ రటంచుఁ
దెలియఁబఱుతురు నీచెప్ప ♦ కులుకులాఁడు
లవని జనులకు సరియె; యే ♦ మందు వింక
బతితుఁడై నట్టి పురుషుని ♦ బడఁతిఁ గూర్చి?

గీ॥ లలితభక్తాగ్రగణ్యలీ♦లాశుకాది
వరమతులు, పారలౌకిక♦భక్తిపార
వశ్యమున బాలకృష్ణుని ♦ బాడుకొనిరి
కాని చేసిరె పలుగాకి ♦ కార్యములను.

కం॥ శృంగారంపుసంగీతం
బంగీకృత మానె యిట్టి ♦ యవసరములకున్
బంగారంపుభక్త్యర్చల
కంగజమంత్రముల కెట్టు ♦ లదుకును ముదితా?

నటి—సయుక్తికముగ నే మేమో సెల విచ్చితిరి. వాదమునకుఁ బ్రతిఁ వాదము వచ్చు నని కాఁబోలుఁ బుణ్యాంగన నగు నన్ను బణ్యాంగనకుఁ బోల్చి గీతమధ్యమునం దిఱికించి తిట్టని తిట్టు

తిట్టితిరి. పెద్ద లగు పురుషు లేమన్నను సమీచీనవాక్యము లగును. గోల లగు స్త్రీలమనోజ్ఞ వచనములు దుష్టపరిహాసవచనములుగ మాఱును. మాఱు మాటాడక దేవర బోధంబులు శ్రుతిశాసనవాక్యములవలె శిరసావహించెదను. గాని యొక సంశయము నన్నింకను బాధించు చున్నది.

సూత్ర—అది యేది?

నటి—వెనుక నొకసారి యీకవి నాటకమునే యొక్కదాని బ్రదర్శించు తఱిఁ బ్రసంగవశమున మీ యీ పూర్వపక్షమునే నే చేయ, నప్పుడుభక్తిశృంగారముల కైక్యాను సంధానముచేసి వాకట్టు కట్టితిరి. అది మనసునఁ బెట్టుకొని యిటుసేయ నన్ను దూఱ నారంభించితిరి. అత్తలమొత్తుడికంటె స్వవచనవ్యాఘాత ప్రసంగుల ప్రబోధబాధ యెక్కుడుగ నున్నది.

సూత్ర—ఓసి వెఱ్ఱిదానా! విను.

గీ॥ కాముకుఁడు భక్తుఁడనురాగ ♦ కలని నేక
మంటినేకాని, యన్నింట ♦ నట్లె యనఁగ
రాదు సుమి! ప్రేమతావులు ♦ భేద మాట
హస్తిమశకాంతరము వారి ♦ కలసగమన!

సీ॥ కడుపార నన్నంబు ♦ గుడుచు సౌఖ్యముకంటె
నధికంబు ధనభూష♦ణాదు లుంట
దానికంటెను సుఖ♦తరము విస్తృతరాజ్య
భాగ్యముల్ గొని పెద ♦ పదవి నుంట
దానికి నధికంబు ♦ తరుణవయోరూప
గుణయుక్త యగు కాంతఁ ♦ గూడి యుంట

దానికి నెక్కుడు ♦ తతశాస్త్రవైదుష్య
మధికంబు దానికి ♦ నమలకవిత

దానికింగూడ నధికంబు ♦ దైవభక్తి
భక్తిసుఖమున కెనలేదు ♦ వసుధ నెదియు
నిట్టి సుఖతారతమ్యంబు ♦ లెనసియుండ
నతివ! యన్నియు నొక్కటే ♦ యనుట తగునె?

నటి—ఆర్యా! ఇప్పుడు నిస్సంశయముగ సుఖముల కుండు భేదంబులును సద్భక్తిస్వభావంబును దెలియఁబఱిచితిరి కాని మన మాడఁబోవు నాటకమునం దుత్తమభక్తిమంతుఁడైన విప్రనారాయణుఁడంతభక్తియు వదలి యధమవిషయ సౌఖ్యలోలుఁడై దేవదేవి వెంట నేల పఱువెత్తెను? ఇది చాల నాశ్చర్యముగ నున్నదే!

సూత్ర—అది స్థిరభక్తి లేమిని, నింద్రియములబలిమిని, వారస్త్రీజాతి రూపయౌవనలావణ్యకౌశలప్రభావంబును బ్రకటించుచున్నది.

నటి—అట్లయిన భక్తిప్రభావ మంత యల్పమా?

సూత్ర—కాదు.

గీ॥ పూర్వసుకృతంబు చేతను ♦ బుట్టుభక్తి
ప్రాక్తనదుష్కృతముల నద్ది ♦ పోలియుఁ గొంత
యిహపురాకృతకర్మంబు ♦ లేచి నరుని
దిప్పుఁజుమి! జలావర్తస్థ♦తృణముగతిని.

కం॥ పడుచు న్లేచుచు మఱలన్
బడుచు నడక నేర్చునట్టి ♦ బాలునిపగిది
బుడమిని మనుజుఁడు భక్తిని
గడియింపఁగఁ బడును దొట్లఁ ♦ గడగండ్ల సఖీ!

నటి—ఆర్యా! నాసంశయవిచ్ఛేదంబు చేసి భక్తితత్త్వము నుపదేశించినందులకు మీకు కృతజ్ఞురాలను. ఇక నాకు సెలవొసంగిన మా కార్యమునకుం బోయెదను.

సూత్ర—శుభమస్తు.

గీ॥ పూర్వుఁడోంటకు నల దేవ ♦ దేవి మధుర
వాణియును, బోయినప్పుడు ♦ వారిఁ గనక
పోయినట్టువంటి విప్రునా ♦ రాయణుని వి
నిర్మలంపుభక్తి నీ కెప్డు ♦ నిలుచుఁగాత!

[ఇ ది ప్ర స్తా వ న]

[ ఇద్దఱును నిష్క్రమింతురు ]

—o—

శ్రీ

# విప్రనారాయణ చరిత్రము.

## ప్రథమాంకము.

ప్రదేశము—శ్రీరంగమున విప్రనారాయణుని పుష్పారామము.

[ప్రవేశము—దేవదేవి, మధురవాణి అను నిద్దఱు వేశ్యలు.]

దేవ—అక్కా! మధురవాణీ! ఈవన మెవనిదో కాని యెంత శృంగారముగ నున్నది!

మధు—దేవదేవీ! ఇది విప్రనారాయణుఁ డను భాగవతోత్తముని పుష్పవనము.

దేవ—భాగవతోత్తముఁడని బ్రహ్మాండ మంతపేరు చెప్పితివి! మనము మాత్రము భాగవతోత్తమలము కామా?

మధు—ఆ! పణ్యస్త్రీలమగు మనము భాగవతోత్తమల మెట్లగుదుము?

దేవ—ఆతనికవలగ్నబంధము; మన కవలగ్నబంధము. ఆతనికి వెనుక బిగి కచ్చ; మనకు వెనుక బిగికచ్చ; ఆతని కాళ్ళకు గజ్జెలు; మనకాళ్ళకు గజ్జెలు. ఆతని చేతిలోఁ దాళపుఁజిప్పలు; మన చేతిలోఁదాళపుఁజిప్పలు. అతనినోటఁ గావేరిరంగని పదములు; మననోటఁ గావేరిరంగని పదములు. ఆతనికిఁ దెయితక్కలు; మనకుఁ దెయితక్కలు. మనకంటె నాతని విశేష మేమి? భాగవతోత్తముఁడని బారెఁడు బిరుదావళిని బఠించితివి! భాగవతోత్తముఁ డనగఁ బణ్యస్త్రీప్రియుఁడన్నమాట! తెలిసినదా? ఆతఁడు దేవదాసుఁడు; మనము దేవదాసులము. ఆతని యేమపు పరపురుషానుసంధానము కొఱకు; మనయేమపు పరపురుషానుసంధానముకొఱకు.

మధు—కాని యాతనికిఁ బుణ్యము; మనకు బాపము. ఆతనికి స్వర్గము; మనకు నరకము.

దేవ—అదే తెలివితక్కువమాట! స్వవృత్త్యనుసరణ మెన్నఁటికి దోషముకాదు. అన్నివృత్తులు జీవనాధారము కొఱ కేర్పడి నవి. చక్రవర్తి మొదలుకొని చండాలునివఱకు ధనముకై దేవులాడనివాఁ డొకఁడును లేఁడు వేదఘోషము సేయుచు యజ్ఞోపవీతము నొడుచుకొని జీవించు బ్రాహ్మణునకుఁ బరమ పదమును, కల్లు గీచుకుని జీవించు గవలవానికిఁ గుంభీపాక మునా? ఖడ్గపాణియై శత్రువధ మొనర్చి జీవించు శూరాగ్రేసరు నకు వీరస్వర్గమును, గోశఖండన మొనర్చి జీవించు మంగలికి మహానరకమునా? ఒక్కమగని కొడ లమ్ముకొనిన సుందరికి సుగతియు, ననేకుల కొడ లద్దెల కిచ్చు మన కధోగతియునా? ఏమిమాట? మనవృత్తి ననుసరించి—

మధు—మనవృత్తి మనవృత్తి యనెదవేమి? అది వ్యభిచార మను కొంటివా!

దేవ—అనుకొనుటయే కాదు. నేనే కాదు.

మధు—మనజాతి మొదట దేవాలయము లందలి యర్చావిగ్రహ ముల సన్నిధిని నృత్యగానాదు లొనర్చుట కేర్పఱుపఁబడి నది. స్వామికి సహస్రనామోచ్చారణముతోఁ బూజజేయు నర్చకుఁ డెట్టివాఁడో భగవద్గుణకర్ణనపవిత్రప్రబంధ గానశీలుర మగు మన మట్టివారము. మనవృత్తి మొదట పవిత్రమైనదే. మనము గూడ సర్వసంసారిణులవలెఁ బతివ్రతలమై కాల క్షేపముఁ జేసి యుండిన బాగుగ నుండియుండును. కన్ను గానక, యొడలు తెలియక, పొగరెక్కి మనవృత్త్యధికతను మనము మన్నుఁ జేసికొనుటయే కాక లోకమున నెట్టి నీచ జంతువైనఁ జేయని యీ యధమాధమపాపమును గూడ శాశ్వతముగ మెడకుఁ జుట్టుకొనినారము.

దేవ—పాపమని చెప్పకుము. నాకుఁ దలనొప్పి వేయుచున్నది. మన జాతి యీ రీతిగా నుండుటయేలోకోపయోగకరమని నమ్ముము జగదుపకారక కృత్యము సుకృతము కాక దుష్కృత మగునా?

మధు—మన లోకోపకారము మండినట్లే యున్నది.

దేవ—నీవు తత్వమును గనిపెట్టక మాటలాడుచున్నావు. అవనిపతులు ధర్మసత్రము లేల కట్టించుచున్నారు? చలిపందిరు లేల వేయించుచున్నారు? మందబయళ్ళేల నిర్మించుచున్నారు?

మధు—లోకోపకారముకొరకై—

దేవ—అనఁగ—

మధు—గృహాది సాధనములు లేని పాంథుల యుపయోగముకొరకు—

దేవ—అట్లే బ్రహ్మచారులకై—భార్యాదూరులకై - భాగవతోత్తములకై—మనము నిర్మింపఁబడినాము. మనమే లేకుండు నెడల ప్రబలబలాతిరేకులగు వీరి మదపుఁ బిచ్చవిసరులు, వీరి బందిపోటులు, సంసారిణుల కొంపలు తేసివేయవా! ఎందఱుత్తమ కాంతలు భ్రష్టలై పోవుదురు! పురుషులలో నెట్టి మహా కలహములు సంభవించును! లోకవిపత్తును మనమిట్లు లాపుటచే మనము లోకోపకారిణులము.

మధు—మనము గుడిసెవేట్రిలమై పరస్త్రీలను బతివ్రతలుగఁ జేయుచుంటిమా! మనము మహాపాపాత్ములమై యితరులను బుణ్యాత్ములుగఁ జేయుచుంటిమా! ఏమివెఱ్ఱి! పతివ్రతను బాడుచేయువాఁ డెవ్వఁడును లేఁడు. తపస్సు, దైవము, నామె నెల్లప్పుడుఁ గాపాడుచుండును; కాని వీథిలోని మగగాడెదెలు, కుక్కలైన మనలఁ గాంచి కన్నుగీటునంతటి పరమ లాఘవ స్థితిని బడి యింక నధోగతికిఁ గ్రుంకుచున్న మనమా, స్వతేజోదుర్నిరీక్ష్యలగు పతివ్రతలను రక్షించుట!

దేవ—సరి సరి! ఇఁక నీవు వారకాంతా వ్యాపారమును మాని భాగవతోత్తమత నవలంబింతువా యేమి?

మధు—ఇదివదలవచ్చునుగాని యది సంభవించు టెట్లు?

దేవ—ఇడివదలిన వెంటనే తనంతతానే యది సిద్ధించును. అన్ని వన్నెలు చిన్నెలు ధనముతో నున్నవి. వ్యాపారము వాలిన ధనము క్షీణించును. ధనలోపమునం దత్త్వజ్ఞానవృద్ధియే కదా? కడుపునిండిన చిలుక కునికిపాటును పడనుగాని కడుపుమండిన చిలుక రంగా రంగా యని కూయదా! [నేపథ్యమున] రంగ! రంగ, రంగా!

మధు—అదిగో! భక్తాగ్రేసరుండగు విప్రనారాయణుం డిటు వచ్చుచున్నట్లున్నాడు. ఆతని పుణ్యదర్శనమున బవిత్రుల మగుదుము.

దేవ—నీవు కమ్ము. నేను గానక్కఱలేదు. నే నాతని నా దర్శనమున నపవిత్రునిగాం జేయకుండు నెడల చాలును.

[నేపథ్యమున] చాలును. అంతే చాలును. ఈకాంచనపుష్పములతో దివ్యమగు దండ యగును.

మధు—మఱియొక కంఠరవము వినంబడుచున్నది. ఆతని కొక శిష్యుండు కూడ నున్నవాండేమో!

దేవ—పణ్యస్త్రీ కొక్క బానిస, పుణ్యస్త్రీ కొక్క పూర్వసువాసిని శ్రీరంగదాసున కొక్క శిష్యుండు లేకున్న గ్రంథమే నడువదు గాదా?

[నేపథ్యమున] "రంగడే రంగడు" అని నేను చేసిన గ్రంథమును నీవు విందువా?

[నేపథ్యమున మరియొక ధ్వనితో] చిత్తము.

దేవ—నేను జేసిన గ్రంథ మనుచున్నాండు. ఈతని కింక నహంకారము వదలలేదు. నీవు విందువా యనుచున్నాండు. ఒకని మెప్పు నింక నపేక్షించుచున్నాడు. ఈతండు స్తుతిప్రియుండు. ఈతని కింక భక్తి పూర్ణముగం గుదురలేదు.

విప్ర—[నేపథ్యమున] బాలకా! పాడెదను వినుము.

దేవ—బాలకుఁడేకాఁడు. బాలికలు గూడ విననై యున్నారు.

[విప్రనారాయణుఁడు శ్రీనివాసుఁడను శిష్యునితో 'రంగఁడే రంగఁడు' అని పాడుచుఁ బ్రవేశించును.]

విప్ర— బలహంసరాగము—ఏకతాళము.

రంగఁడే రంగఁడు ♦ రమ్యగుణాభంగుఁడే [రంగ]
భంగహీనభక్తకోటీ ♦ పాలనాత్తసంగుఁడే [రంగ]

[తాండవించును]

దేవ—అక్కా! భంగహీన భక్తుండనుచున్నాఁడు. భక్తికిభంగములు ప్రాయికములని యెఱిఁగి యనుచున్నాఁడు సుమా!

విప్ర—మంగళలలితాంగుఁడే ♦ మహితదయాపాంగుఁడే
అంగసంగతోద్గదార ♦ థాంగశంఖశార్ఙ్గుఁడే [రంగ]

[తాండవించును]

హా! రంగ! రంగ! రంగా! కస్తూరిరంగా! కావేరిరంగా!

దేవ—ఆక్కా! నాన విడిచినఁ గాని నారియైనాట్యమాడ లేదు. అట్టిచో నట్లుచేయు పురుషుఁ డెంతలజ్జారహితుఁడై యుండవలయును! అందులోఁ కాళ్ళుగాలిన కోఁతిచిందులవంటి యీదిక్కుమాలిన మిట్టగంతులను వేయుటకు నెంత సిగ్గుమాలినవాఁడై యుండవలయును. సిగ్గులేక యూరందఱి యెదుట మన మెగురులాడ నంతకంటె సిగ్గులేక మనయెదుట నితఁ డెగురులాడుచున్నాఁడు. ఈతఁడు వేశ్యలపాలివేశ్యయై వెల్గుచున్నాఁడు. వేశ్య లీతని యొద్ద శిష్యులుగా నుండఁదగినంత మహాప్రభావము గలవాఁడు.

మధు—నీవు హేళనమునకై యనుచున్నను బరమార్థమే నీ నోటి నుండి వెడలినది.

శ్రీ—గురూత్తమా! దేవరవారు రచించిన యీపదము దివ్యముగ నున్నది. బ్రహ్మముఖోత్థితమగుగాయత్రీమంత్రములో మూఁడవ వంతుఫల మీయఁ దగియున్నది.

విప్ర—ఎట్లయ్యా! శ్రీనివాసా! [పుష్పములు మాలగగుచ్చుచుండును]

శ్రీ—గాయత్రికి మూఁడుచరణములు. దేవరపదమున కొకచరణమే.

దేవ—(తనలో) శ్రీనివాసా! తెలివిగలవాఁడవే. కాని గాయత్రికంటె నీతని రంగకీర్తనమే యధిక ఫలప్రదమని చెప్పినయెడల బాగుగ నుండును. ఏలనఁ, జతుర్ముఖ బ్రహ్మోద్గతమగు గాయత్రికిఁ జరణత్రయ ముండుసరికి దుర్లభమైపోయెను. ఏకముఖ బ్రహ్మోద్గతమగు కీర్తనమునకుఁ బూర్ణముగ నొక్కచరణ మున్నది. గొప్పకాదా!

విప్ర—నీవు నన్నేదో యొకకారణమున స్తుతిచేయుచునే యుందువు. నీ కెన్ని మాఱులు చెప్పినను—

శ్రీ—ఆత్మస్తుతికూడదని చెప్పినారు! కాని గురుస్తుతి కూడదని చెప్పి యుండ లేదు.

దేవ—(అపవారించి) అక్కా! వింటివా? గురుశిష్యసంభాషణ మెంత శ్రావ్యముగా నున్నదో! చెప్పితినని గురుఁడనును! చెప్పియుండ లేదని శిష్యుఁ డనును! గురుఁ డసత్యవాదియైనఁ గావలయునుఁ, శిష్యుఁడు గురుద్రోహియైనఁ గావలయును.

మధు—(అపవారించి) చెల్లెలా! పూజ్యుల నధిక్షేపింపకుము.

విప్ర—శ్రీనివాసా! పరమపవిత్రమై, సర్వార్థసిద్ధిదమైన గాయత్రీమంత్ర మెక్కడ! మనసుండఁబట్టలేక యేదో వెట్టిమొట్టిగ నఱచిన నా కీర్తన మెక్కడ! శ్రీరంగ దేవునకు, శ్రీరంగ కింకరుఁడనగు నాకు నెంత యంతర మున్నదో గాయత్రికి నా కీర్తనమున కంత యంతర మున్నది. నాదియొక భక్తియేనా! నా ప్రార్థన మొక ప్రార్థనమేనా! నేను జడుఁడను—దురభిమానిని—పాపాత్ముఁ డను—కుటిలుఁడను—అధముఁడను—దౌర్భాగ్యుఁడను—చప లుఁడను—పశువను—రంగ—రంగ—రంగా!

శ్రీ—నేను శిష్యుఁడ నగుటచే నేను గాడిదను—కాకిని—కంబళిపురు గను—పలుదోముపుల్లను—చారమను—పీచను—ఏసను— [illegible]. నారాయణ! నారాయణ! నారాయణ!

గీ. కనులు మూసికొని సతిరూపమును దృఢముగఁ
గనఁగలేని నరుఁడు దేవుఁ గాంచితి నను
నెందులకుఁ బుట్టె నెఱుఁగక యెటులో పుట్టి
తానె బ్రహ్మ మటంచును దలఁచు నొకఁడు.

గీ. బ్రహ్మము నెఱుంగ నరుఁ డెన్ని పాట్లు పడిన
నన్ని వెట్టిపోఁకలసంధు లతిశయించు;
తెలియలేని దెఱుఁగు టెట్లు! తెలియకుంట
మతియె లేని తెలివికంటె మంచిగాదె?

గీ. వస్తుతత్త్వ మెఱుంగుట వట్టికల్ల
మనకుఁ దెలివితో సంతయుఁ బనియె లేదు
భక్తిఁ గింకరో హమ్మని భగవదర్ప
ణంబు తన్నేసికొనుటె మోక్షంబు తెలుపు.

గీ. అట్టిబ్రహ్మ మర్చారూప మంది యిచట
రంగఁడై వెలసెనుగాన రంగ, రంగ,
రంగ రంగ, రంగా రంగ, రంగ యనుట
కంటె నిహాపరోత్తారక గతియె లేదు.

(నేపథ్యమునఁ) రంగ రంగ రంగ రంగా! రంగ! (ధ్వనులగుచున్నవి)
ఓహో! దాసాధముఁ డొనర్పు పుష్పమాలా కైంకర్యమునకు
వేళయైనది. రంగా! రంగా!

మధు—దేవదేవీ! ఈ మహానుభావుఁ డింక శ్రీరంగదేవాలయమునకు
బోవును. మనము మనయింటికి బోవుదము రమ్మ.

దేవ—ఈతనిని సమీపించి మాటలాడి మఱి పోవుదము.

మధు—విష్ణుసామీప్య మొందవలసిన భక్తాగ్రేసరుఁడు విట సామీప్య
ముచే నపవిత్రయగు వేశ్యచే సమీపింపఁబడుట యనర్థమగును
గాదా! అదిగాక, ఆతనికి మన కేమి మాట లున్నవి? అతనిని!
బరిహాసింతుమా! బంగారునగలకై బాధింతుమా! పరపణ్య
భామినులఁ గాంచి కన్నుగీటె నని దెప్పుదుమా! దేవదేవీ!

మన మాతనిని సమీపింపవలదు! నీవు హేళనస్వభావముగల దానవు. ఆత్మశక్తివిశ్వాసాధికత గల దానవు. తొందరచే నేమాట నీ నోటనుండి జాఱునో! భగవద్భక్తులతోడి పరిహాసపు మాటలు పాములతోడి జలాటలు! కావున దూరమున నుండియే యొక్క నమస్కార మర్పించి పోవుదము రమ్ము.

దేవ—ఇక్కడనుండి చేయు నమస్కార మెదుటికిఁ బోయియే చేయుదము. నీ కేమియు భయ మక్కఱలేదు. నే నాతని బరిహాసింపను లెమ్ము.

మధు—పరిహసింపక పోవుటయే కాదు. భాషించుటకూడా వలదు
దేవ—సరే! పోవుదము.

(ఇద్దఱును విప్రనారాయణుని కెదురుగఁ బోవుదురు)

మధు—మహాత్మా! దాసురాలి ప్రణామ మంగీకరించవలయును.
(నమస్కరించును.)

దేవ—దేవా! దేవదేవి మ్రొక్కుచున్నది. (నమస్కరించును.)
విప్ర—(వారివంకఁ జూడక యాశీర్వదింపక)

శ్లో. కుడతిశై, ముడివైత్తు, కుణాదిశై పాదనీట్టి
వడతిశై పిన్ బుకాట్టి తెన్ తిశై యిలంగైనోక్కి
కడల్ నిఱకడవుళెన్దై యరవణై త్తుయిలుమాకణ్
డుడలెనక్కురుకుమాలో వేన్ శెయ్ గేనులగత్తీరే.
నంబెరుమాళ్ తిరువడిగళే శరణం (నిష్క్రమించును)

శ్రీని—అడియేనికంతవట్టుదనుక నక్కఱలేదు. దేవరతిరువడిగళేశరణం.
(నిష్క్రమించును.)

మధు—మహాత్ముని దర్శనమైనది. కృతార్థులమైతిమి. పోవుదము రా!
దేవ—కృతార్థుల మెట్లయితిమి ?
మధు—దర్శనమువలన—

దేవ—(తనలో) ఈఁకెలో నొక్క వెండ్రుకవు. వెండ్రుక కాలిన కమ
రవు. శంఠ! శంఠ! శంఠ! (అపవారించి) అక్కా! వింటివా!
గురుశిష్య నైచ్యాను సంధాన బంధుర గ్రంథ సందోహరచనా
ధౌరంధర్యము! ఆహా! ఆచారము ననుసరించి యధమత్వ
ములో నన్యోన్యాధిక్యము నపేక్షించి, యవకతవకలలో నొకని
తలపై నొకఁడు దాఁటదలఁచి, యజ్ఞానకృత డుంబాచార
ధోరణిని వీరాశిన యావాచ్యాసందర్భాపములు బహు పాప
ప్రదములై వీరి నంతటివానిగఁ జేయుచునుమా!

మధు—ఎందుచేత!

దేవ—దైవదివ్యమంగళ విగ్రహప్రతిబింబముగ నీనరదేహము నిర్మింపఁ
బడినది. తన్మహాతేజః పవిత్రస్ఫులింగమైన యాత్మ యీ దేహ
మున నుంచఁబడినది. అందుచే స్వనిందాపరుఁడగువాఁడు దైవ
నిందాకరుఁడు. ఆత్మఘాతుకుఁడు దైవఘాతుకుఁడు. తానే
బ్రహ్మమనుకొని యనుసంధించు నడ్డబొట్టు టద్వైతినైన నా
యప్రమేయుఁ డామోదించునుగాని తానుఁ బందివని బలు
మాఱు పడఁదిట్టుకొను సంగవామాల భాగవతోత్తముని
సాఁగనీయక మానఁడు. ఈతనిపాలు లేక ముందున్నవి. ఆత్మ
గౌరవము లేని వానికిహమునందుఁ బరమునందుగూడ దుర్గతియే

మధు—చాలు, చాలు! నాల్గుముక్కలు చదివితినని విఱ్ఱవీఁగి విష్ణు
భక్తులను విపరీతముగఁ దూలనాడుచున్న నీ పాటలు ముం
దెట్లుండునో యోజించుకొనుము.

విప్ర—

గీ॥ ఎన్నికోటులజీవు లీ ♦ యిలను గలవొ!
ఇట్టి లోకమువంటివి ♦ యెన్ని యర్బు
దంబు లున్నవో! అందు జీ♦వంబు లెట్టి
వెన్ని శంఖానుశంఖంబు ♦ లున్న వొక్కొ!

గీ॥ శతశతసంఖ్య జీవసం ♦ ఘాతములను
వివిధనైజరూపధ్వని ♦ భేదగతుల
లీల సృజియించి రక్షించి ♦ గోళకోటు
లిద్ధగతిఁ ద్రిప్ప నతఁ డబ్బ ♦ యెంతవాఁడొ!

(గుండెలు కొట్టుకొనుచు)

గీ॥ ఇంత జేయు నాతనిబుద్ధి ♦ యెంతో! తేజ
మెంతో! కల్పనావైచిత్ర్య ♦ మెంతో! దృష్టి
యెంతో! రక్షణసామర్థ్య ♦ మెంతో! యాజ్ఞ
యెంతో! ఇన్నియుఁ గల యతఁ ♦ డెంతో! యెంతో!

(గుండెలు కొట్టుకొనుచు)

గీ॥ మనకు ముందునకుం జూడ ♦ వెనుకనున్న;
కనిన వినలేము! వినుచుఁ బ♦ల్కంగలేము;
పల్కుచుండి వ్రాయఁగలేము ♦ వ్రాయుచుండి
తలఁపలేము: తలంపులో ♦ నిలువలేము.

గీ॥ మనకు దెలిసిన దేదైన ♦ సంపూర్తిఁ గలదె?
ఇదిగో! పుష్పమను పూవన ♦ నేమి! ఊఁహు!
యెట్లు పుట్టిన? దూఁహుహూ ♦ ఇట్టిరంగు
లెటుకలిగె? నూఁహు, యెనస్తు ♦ విద్ధి? ఊఁహు!

గీ॥ తృణ మనఁగ నేమొ? యెట్టిదో ♦ తెలియలేక
ప్రకృతి శాస్త్రాళి కొందఱు ♦ వ్రాయుచుంద్రు
తలపయిని వెండ్రుకెట్టిదో ♦ తెలియలేక
యాత్మజిజ్ఞాస మఱికొంద ♦ ఱాచరింత్రు.

గీ॥ మొఱుపు మింటఁ దళుక్కనఁ ♦ దెలుపు దప్పు
జనుఁడు వైవాంతికమున స్థ ♦ సరణిఁ జూపు
గోడపై నెక్కఁ దల దిరు♦గు నతఁడు పర
మాత్మ కెగఁబ్రాఁకె మోక్షసూ♦త్రాళిఁ బన్ను.

ముండునా? అష్టాంగసహితముగ నవనతులమగు మనకు—మన మధములమే కానీ యాతండత్యుత్కృష్టుండే కానీ; మనమధిక పాపులమే కానీ, యాతండమితపుణ్యాత్ముండే కానీ; మనమిం ద్రియవశ్యులమే కానీ యాతండతీంద్రియుండే కానీ; మనము తుచ్ఛమైన ధనమునకై మనమానసము విటుల కమ్ముకొనిన వేశ్యలమే కానీ, యాతండుత్తమమగు మోక్షమునకై దనయా త్మను విష్ణు నధీనముగం జేసిన విరాగిశిఖామణియే కాని 'ఆ' యని నోరు తెఱచి యంత యాశీర్వదింపగూడదా? అంతటి ఱేడనే హరిభక్తి యంతయు నంతరించునా? నోరు తెఱచు సరికి రంగడూడిచి పుచ్చుకొని యొకటి నోటిపై వాయించునా? నా కేమియు బోధపడ వేదు? ఏల మనలం జూడ లేదు? ఏల మనతో మాటాడ లేదు?

మధు:—అతం డేల చూడ లేదో, ఏల మాటాడ లేదో యను నాలోచ నము లేశముగాని మన కావశ్యకత లేదు. అతండు పుణ్యమూర్తి. ఆతని దర్శించితిమి. ఆతనికి నమస్కరించితిమి, చక్కవచ్చి తిమి, మనపని యంతవఱకే. ఆతని యాలోకనములతో మన కేమి? ఆతనియాశీర్వాదములతో మన కేమి? ఆతండాశీ ర్వదించినంగాని మనకు బుణ్యము లేదను కొంటివా? ఆతడు చూచినం గాని మనకు సుగతి లేదనుకొంటివా? పుణ్యకార్య మని నమ్మి పుణ్యకార్యమును జేసితిమి. కృతార్థతను బొంది తిమి. ఇతరచింతల తో మనకుం బని లేదు.

దేవ:—ఇదిగో పొందిన కృతార్థత! అరకాలుమంట శిఖ కెక్కుచు న్నది. ఆ! చూడనే చూడ లేదు! అతం డేమి మహాధికుండా? నిశ్చలసమాధినిష్ఠాగరిష్ఠుం డగు యోగియా? శ్రీరంగ దేవుని శిరముపై నెగిరి పోయినాండా? ఆతని కున్నంతభక్తి యాతని కున్నది. నాకుం దగినంతభక్తి నాకున్నది, ఆతనిహృదయమున నొకరంగండు నాహృదయమున నొకరంగండున్నాండా? నన్నుం

జూచుటకైనఁ దగనంత నీచత నాతఁడు దేమున్నది ? శ్రీరంగ దేవుని సేవించిన నేత్రములతో వీధిలోని కుక్కలను, గాడిద లను, పందులను జూచుటలేదా? మన మంతకంటెఁ జెడిపోయి తిమా? యిదియేనా భక్తుని లక్షణము! తన మాత్మవంటిదే యిత రులలో నున్నదని తెలియజాలనివాఁడు భక్తుఁ డగునా? పాపా త్ములఁ నాదరించి, పాపశాంతికై మంగళా శాసనమే పలుక లేని పరమానుచ్ఛగర్వభావుఁడు భక్తుఁడగునా? మాటలాడవేమి? ఏల యాతఁడు మనల నాశీర్వదింపలేదు !

మధు—ఆతని నేమియు ననకుము. ఆతఁడు మహాభక్తుఁడు. ప్రసన్నా గ్రేసరుఁడు. ఏ పుణ్యకార్యమైనను ఫలమునుగోరి జేయఁగూడ దని పెద్దలు చెప్పుదురు. మన మాతని కొనర్చిన నమస్కారము తన్మంగళానుశాసనప్రతిఫలాపేక్షచేఁ జేయఁబడినది కా దని యాతఁ డెఱిఁగి యాశీర్వదింపలేదు; సరేనా ?

దేవ—ఎంత చతురపు ! ఫలాపేక్షచే మనము నమస్కరింపఁగూడదు. కాని యాతఁడాశీర్వదింపఁగూడదా? ఆతని కేమి ప్రత్యవాయము?

మధు—అదిగాక శ్రీరంగపాదభక్తపరవశుఁడై మాలకైంకర్యో త్సాహమున ద్రావిడప్రబంధమును బఠించుచుఁ బోవుచున్న యాతఁడు మనల నెట్లాశీర్వదించును?

దేవ—నోరు పనిచేయుచున్నది కాన నాశీర్వదింపలేదనువా! నమ స్కారంగీకారసూచకముగఁ దల నింత వంచరాదా? చేయి నింత యెత్తరాదా? పోనీ! కన్నులచూపైన నేగంగలోఁ బడెను?

మధు—భక్తిపారవశ్యమున నున్నాఁడని చెప్పలేదా! ప్రపంచమునకే పరాఙ్ముఖుఁడైన భక్తుఁడు మనలఁ జూడలే దందు వేల?

దేవ—ప్రసవమాలను గూర్చుటకుఁ బారవశ్యము లేదేమి? పాశుర ములను బఠించుటకుఁ బారవశ్యము లేదేమి? పాదచారమునకుఁ బారవశ్యము లేదేమి? భక్తుఁడు కాఁబోలునను నట్టిచే బానిసనై

దేవ—ఆతని దర్శనము మన మా చెట్టుక్రిందనుండి చేయులేదా! అంత మాత్రముననే కృతార్థుల మగునెడల నిదివఱకే యైతిమే! ఇతని సమీపమునకు వచ్చి మనము గాంచిన యాధిక్య మేమున్నది? ఆతని మనము చూచుటతోడనే సఫలత స్వర్గప్రాప్తి కలుగునా? మన నమస్కారము నాతఁడు గ్రహించెనా? ఆశీర్వదించెనా? ఎక్కడినారని కుశలప్రశ్న మొనర్చెనా? ఏమియు నక్కఱ లేదు. కన్నెత్తి చూడనైనఁ జూచెనా? ఈ యాత్రి పాదరణమునకే ధన్యుల మైతిమా? క్షాళితపాపుల మైతిమా! సమార్జిత పుణ్యులమైతిమా! మోక్షనిశ్రేణికారోహణ మొనర్చుచుంటిమా! శరీరములతో శ్రీమహావిష్ణులోకమును జేరసిద్ధముగనుంటిమా? ఏటిమాటలు?

మధు—మనము నమస్కరించకున్నను నమస్కరించునట్లు భావించుకొని, తాఁ జేతుల జోడించుకొని యాశీర్వాదము లంతము లేకుండ జేయుట కితఁడు నోటికి దలుపును ద్వారబంధమును లేక వట వట వెళ్ళికొట్టు లఱచు విటాధముఁడా? బహుమిత భాషియైన భాగవతోత్తముఁడు ఇంటికి వచ్చినతోడనే మనమెవ్వరమును మాటలాడకున్నను "అత్తా నీకుఁ దల్లితిప్పు తగ్గినదికద" యని మన యమ్మను, "బావా! ఖంసువా మానినట్లున్నదే మోయి! బొట్టు కనఁపడుట లేదు; భోజన మింకఁ గాలేదా?" యని మన సోదరుని, దుట్టతుదకు "ఏమే! ఈసారి కోరలపున్న మికిఁ గోకతప్పక యిచ్చెదను గోపపడ" కని మన యిల్లాడ్చు దాసి దానినైనఁ గారవించుటకు, బరామర్శించుటకు, శాంతింపఁ జేయుటకు, బహుమానించుటకు, బతిమాలుకొనుటకు, కుశల వార్తలగుటకు నోడలి మదముచే మనతోఁగాని బ్రిదుక లేక మన దయాలేశము కొఱకు, మనబంధువులకు, మనమిత్రులకు, మన యింటికుక్కలకుఁగూడ నధమాధమదాస్యముఁ జేయుచు, లేనిపోని మమకారములు వెల్లడింపుచు, పడికాపులు

నొక్కిన నాప్రాణామమును బ్రతిగ్రహించుటకు మాత్రమే యీ పారవశ్యము బయలు దేరినదా ?

మధు—భగవత్కైంకర్యసాధకకార్యములందుఁ దదేకలగ్నతయే పారవశ్యము. అట్టి తదేకలగ్నతచేతనే యితరకార్యవైముఖ్యము సిద్ధించును. ఇట్టిస్థితి పారవశ్యమే కా దందు వేమి ?

దేవ—పారవశ్యము కాదు. పాషండత్వము—ప్రబలగర్వభూయిష్ఠత—పరనిందా ప్రవీణత—కన్ను లున్న గుడ్డితనము—చెవు లున్న బధిరత్వము—నో రున్న మూకత్వము—ఒడ లెఱిఁగిన పరవశత్వము—డంబాచారము తోడి విరాగత—మతి యున్న పిచ్చి.

మధు—అట్టు లెంతమాత్ర మనఁగూడదు. తలఁపఁగూడదు. అతఁడు యథార్థభక్తుఁడు. నమస్కరించిన పుణ్యము బుగ్గి యగుటయే కాక మీఁదుమిక్కిలి భాగవతాపచారమహాదుష్కృతము గూడ మెడకు జుట్టుకొన్న నై యున్నదా? అతని నట్టులు తూలనాడఁ దగునా ?

దేవ—అట్లు తూలనాడుట తప్పనుచుంటివా? పోనీ! అతఁడుమృతుఁడు! మొఱఁడు! మొద్దు! కొయ్య! పాషాణము! ఈసారి సరియేనా?

మధు—ఔను. అతఁడు మృతుఁడే! ప్రపంచమునకు—అతఁడు మొఱఁడే! సుఖదుఃఖములకు—అతఁడు మొద్దే! ఇంద్రియములయూఁపులాటకు—అతఁడు కొయ్యయే ! శ్రీరంగనామసంకీర్తనేతరగాథాశ్రవణమునకు—అతఁడు పాషాణమే ! పరవనితాపాంగమహిమకు—

దేవ—ఆహా ! మింటిపై నెగిరిపోవుమాటలను జెప్పుచున్నావు. పరవనితాకటాక్షముమాట తరువాతఁ జూడవచ్చును. మొదట స్వవనితాకటాక్షపాళికైన గరగువాఁడేనా ? అక్కడఁ గూడ కాఱుఱాయియేనా ? ఏమో ! భార్యను జక్కబెట్టలేక భాగవతోత్తముఁ డైనాఁడేమో ? రక్తిలోని కెక్కుటకు శక్తిచాలక భక్తిలోఁ బడెనేమో ? ప్రపంచమునఁ గనఁబడు బోడిబుఱ్ఱల బాపనయ్యలు, తాళపుఁజిప్పలదాసులు, కాళ్ళగజ్జెలభక్తులుతఱ

చుగఁ గోలుకరానికోర్క్యు లగు భార్యలలోపలి వెలుపలిఛాటి కాఁగలేక లోకాతీతులైనవారే, లే!

మధు—ఎందుల కూరక పుణ్యలోకము నంతను దూషింతువు!

దేవ—భూషించి మహాపుణ్యము నీవు కట్టుకొందువు కాని, ఇఁక దది చెప్పుము. ఈతఁ డీవనమున వనితతోడనే యుండెనా?

మధు—ప్రస్తుత మిద్దఱు వనితలతో నున్నాడు.

మధు—ఈతడు బ్రహ్మచారి. ఎఱుగవా?

దేవ—అలాగా? బ్రహ్మచారియా? ఆఁ అందుపైఁ బడుచువాఁడా? దానిపై బలాఢ్యుఁడా? అటుపై శ్రీరంగదేవోచితచిత్రాన్న దధ్యోదన మాషఖండాపూపాది మృష్టాన్న భోజనప్రియుఁడా? ఆపైఁ బ్రసవవనవిహారలోలుఁడా? అందుపై భక్తుఁడా? మఱి యందుపై భాగవతోత్తముఁడా? మఱి యింక నందుపైఁ బ్రమదాపరాఙ్ముఖుఁడా? ఆహా! బాగుగనున్నది!

మధు—అంత హేళనముగ నందు వేమి?

దేవ—ఇఁకఁ బడుచుబ్రహ్మచారిభక్తుని బ్రదుకు కడ తేరినట్లే!

మధు—దుఃఖపూర్ణప్రపంచసంబంధ మగు బ్రతుకు కడ తేరుటచేతనే భక్తుఁడయ్యెను.

దేవ—భక్తుఁ డయ్యెనా? ఆఁ! నీకు మతిపోయెనాయేమి? నీవు ప్రపంచాతీత వైతివా యేమి? నీవు యుక్తాయుక్తవిమర్శనాదూర వైతివాయేమి? భక్తుఁడు భక్తుఁడనెద వేమి? ఎవఁడా భక్తుఁడు? ఎవని కా భక్తి! ఎక్కడ నాభక్తి! చందనాదిచర్చల ధరించి పూలదండలు మెడ మునుఁగఁ బూని, దివ్యములగు పీతాంబరములఁ గట్టి, కస్తూరీఘనసారకుంకుమపుష్పవాసనలచే గమగమలాడుచుఁ జెన్నంగి కొబ్బరికాయయంత శిఖ గన్నెరు పూలమాలతో వెన్నున నసియాడుచుండ, నిగనిగలాడుచుఁ జేవలు దేలుచు, గుమ్మడిగింజవలె, పనసపిక్కవలె, తాండ్రబెత్తువలె, పందికొక్కువలె, పోతువలె గాలుకొని యొడలు పొగరుపొగలు గ్రక్కుచు సందులేక పెటపెట లాడుచుఁ, గన్నెతికపుఁ బెండి

కొడుకుల గురువుగఁ ప్రకాశించు నీతని భక్తుఁ డనదవేమి?
జితేంద్రియుఁ డనెద వేమి? సర్వసంగ పరిత్యాగి యనెద వేమి?

మధు—రంగరంగా! ఎట్టి దురాలాపము లాడుచున్నావు. శ్రీరంగ
దేవుని నిర్మాల్యములగు పూలమాలలు మహాభక్తిచే ధరించిన
యితఁడు శృంగారలోలుఁ డగునా? శ్రీరంగప్రసాద మగు చందన
శ్రీపాదరేణువులనుమహానందనమున దనివి తీఱక యొడలంతఁ
బూసికొనిన యీతఁడు విటాధముఁ డగునా? 'నిగనిగలాడుచుఁ
జేవలు దేఱుచు' నని యేమేమో చెప్పితివే. సాంసారికదుఃఖ
దూరతచే, శ్రీరంగదేవదర్శనైకానందమహిమచే, సత్త్వసంపన్న
తచే, భక్తియోగదార్ఢ్యముచే, నూర్ధ్వరేతస్కతచే, బ్రహ్మతేజ
స్సంపన్నతచే ధగధగ లాడుచు దుర్నిరీక్ష్యుఁడై నిండుగ వెల్గు
చున్నవాఁడు! పందివలె నుండెనా? దున్నపోతువలె నుండెనా?
రంగరంగరంగా! కన్నెఱికముల పెండ్లికొడుకువలె నుండెనా?

దేవ—వలె నుండుటయే కాదు. వానినెత్తిపై దాఁటిపోయినట్లున్నాఁడు.
ఈతని జెఱిపిన నట్టిచవుటిపెద్దమ్మ లార్గు ఆగుదురు.

మధు—వాచాదోషము లేల? చాలును! భక్తుం డేమిటి? చెడుట
యేమిటి! విటుఁ డగుట యేమిటి?

దేవ—చెడక—యీతనిభక్తి నిలుచునా? పడుచుఁదన మెక్కడ? భక్తి
యెక్కడ? ప్రపంచసుఖవిరాగికేఁగదా భక్తియుదయింపవలసినది.
అనుభవించి యనుభవించి యేవపడినవానికేఁగదా వైరా
గ్యము లభింపవలసినది రాగమునఁగొంతకాలము వన్నెలవిసఱు
కట్టువలె తళుకుతళుకులాడుచు నూఁగులాడి, యెండలోని సీతా
కోకచిలుకవలెఁ గనఁబడిన పుష్పవతియగు కొమ్మపై కిమకరంద
పానాపేక్ష నెగిరి యెగిరి, యెదవోయిన గిత్తవలె స్త్రీల వెంబడి
అంకెలు వేయుచుఁ గెవ్వుమనుచుఁ గాండ్రించుచు దిరిగి దిరిగి
విరహశృంగారమునఁ బాముపలె బుసకొట్టి క్షయరోగివలె,
దిక్కులేనివలె నగమై, దైన్యపడి, యేడ్చి యేడ్చి, చోరునివలె
గోడలు దాఁటి, కాళ్లు విఱుగఁబడి, రోగములఁబడి శక్తు
లుడిగి, శాంతి బడినప్పుడుగదా విరాగ ముదయింపవలసినది

కొంతకాలము స్త్రీల కొప్పులలోఁ బూలు ముడిచినపిమ్మటఁ గదా, శ్రీరంగదేవునిశిరముపైఁబూలుంచుట! కొంతకాలము స్త్రీ కపోలములపైఁబూచికపుల్లతో మకరికాపత్త్రములువ్రాసివ్రాసి, తుడిచి తుడిచి, యూది యూది, మఱల వ్రాసివ్రాసి చేతులు నొప్పులు పెట్టినతరువాతఁగదా, గంటముతోఁ దాటాకుపైఁ బాశురములో, భగవత్కీర్తనములో వ్రాయుట! కొంతకాలము కాంతల పసుపులతుక కస్తూరితో నొడలంత పెద్దపులి వేషము నకువలె వింతవింతరంగులై వ్రేలుకిచ్చతోఁకవలె జీరాడ వెఱ్ఱి వెఱ్ఱియాట లాడినతరువాతకదా యారంగులు తుడుచుకొని విభూతి రేఖలో, ద్వాదశోర్ధ్వపుండ్రములో ధరించి నెత్తిమీఁది కుళ్లాయిలను గోముఖములుగఁ జేసికొని జపించుట! కొంతకాల మధురపానము చేసినతరువాతఁగదా, శ్రీపాదతీర్థపానము! కొంత కాలము జుట్టు పైరు దిరిగి నభోదర్శనము చేసినతరువాతగదా, శిరోముండనమో, లేక జటాధారణమో! స్త్రీపాదదాసుఁడై కొంతకాలము పరిచర్య చేసినపిమ్మటఁగదా, శ్రీరంగదాసుఁ డగుట! అట్లుగాక—

మధు—ఏమి! నీ సంభాషణమునఁ జెవులు గుయ్యి మనుచున్నవి. నీ యభిప్రాయ మేమోకూడ బోధింపకున్నది.

దేవ—అట్లైన స్పష్టముగఁ జెప్పెదను, వినుము. భక్తికిఁ బడుచుఁ దనము చుక్కయెదురు. రక్తపువేఁడియున్న దేహములో భక్తి మొలక లెత్తదు. కాదాచిత్కముగ మొలచినను వెంటనే పిట్టతలలు వైచి మెలికలుబడి మాడును భక్తి బంగాళాదుంప వలె శీతప్రదేశమునఁగాని వృద్ధిపొందదు. ఇంక స్పష్టముగఁజెప్ప లేదా? పండ్లూడినఁగాని భక్తిబయలుదేరదు. తలవెండ్రుకలుపం డినఁగాని భక్తిచిగుర్పదు. నడుము వంగినఁగాని భక్తిలేవదు. దేహము క్షయించినఁగాని భక్తివృద్ధిపొందదు. చూచితివా? మన అమ్మధరించిన తులసిపూసలమాలను, మనముధరింతుమా? ఆమె శ్రీరంగనామస్మరణము మన కున్నదా?

మధు—నీయూహము కేవలమసత్యము. నీవు వెఱ్ఱిపడుచున్నావు. భక్తి మొదట యదృచ్ఛచే, జననగ, దైవేచ్ఛచేఁ బూర్వపుణ్యము ననుసరించి కలుగును. సత్సహవాసాదులవలన వృద్ధిఁబొందును. బాల్యయౌవనాదు లందులకుఁ గారణములుగావు. వార్ధకమే భక్త్యంకురవృద్ధులకుఁబ్రధానకాలమని నీవుచెప్పితివి. ఇది కేవల మసందర్భ మగు మాట! సుఖానుభవసాధనసాధనములు తగ్గిన కొలఁది సుఖవాంఛ హెచ్చగును. శక్తులుడిగిన కొలఁదివృద్ధి యగునది యాత్మచింతకాదు—ఆశ. నపుంసకుఁడు భక్తాగ్రగణ్యుఁడగు నని నీ యభిప్రాయము. వాఁడతి దుర్నీటుసికంటెఁ దుచ్ఛతరవాంఛాలంపటతాతిపంకిలాత్ముఁడు. పండ్లున్న వాఁడుతన నోటిలో నేదైన నున్నప్పుడు చప్పరించును, గానిపండ్లులేని వాఁడు రేయింబగళ్ళుసర్వావస్థలయందు నొక్కటేచప్పరింపు. మనయమ్మ యేమోభక్తురాలను చున్నావు. ఆమెకున్నంత ధనాశమనకులేదు ఆమెకున్నంత చావుభయముమనకులేదు. స్వోత్కృష్టులయందలి యనురాగమే భక్తి. అనురాగమనునది సర్వమనశ్శక్తులతో వార్ధకమునననశింపకమానదు. పడుచుఁదనమే యందుచేత భక్తికిఁగొంత ప్రధానకాలమని చెప్పవచ్చును. అందుకు బ్రహ్లాదాదులుసాక్షులు.

దేవ—ఆఁ! వార్ధకమున భక్తులైనవా రెవ్వరు లేరా?

మధు—ఉండిన నుండవచ్చును. వార్ధకముచే మాత్రమైనవారుకారు, దైవేచ్ఛచేత. పడుచుఁదనమున భక్తుఁడగువాఁడు మాత్రము పడుచుఁదనముచే నయ్యెనా? పడుచుఁదనముచేఁ జెడునా?

దేవ—అబ్బబ్బ! దైవేచ్ఛ యనినీకునాకుఁగూడ నర్థముదెలియనిమాట నొకదానిని జెప్పినావు. కాలభేదములేకుండ దైవేచ్ఛచేతనేయుద యించునంటివి. సరే—భక్తి చెడుటకూడ దైవేచ్ఛచేతచేచెడునా

మధు—పూర్వజన్మ ప్రారబ్ధముచేత—

దేవ—అంతకంటె నర్థము తెలియని మఱియొకమాట చెప్పుచున్నావు. నీవు చెప్పిన రెండునుగూడఁ గారణములుగావు. భక్తియుద యించుటఁగాని, చెడుటకుఁగాని మనబుద్ధియే కారణము. మన

బుద్ధిచిన్నతనమునఁబొట్లపిం దెవలెమిగులవంకలుగలిగియుండును. భవభారము దిగలాగినకొలఁది తిన్నఁబడును. అప్పుడు పరిపక్వస్థితి నొందును. ఇన్నిమాటలేల? నే నిప్పుడు నీకు నామతమును సదర్శనముగ శిలాశాశనముగఁ జేయఁదలఁచినాను.

మధు—అదేమిటి?

దేవ—ఈ బాపనబిచ్చగానిమూలమునఁగదా నీకు నాకు గుద్దులాట వఱకు వచ్చినది. దైవేచ్ఛచేఁగదా యీతఁడు పడుచుఁదనమున భక్తుఁడయ్యెనని చెప్పితివి. నాయిచ్చచేతనీతనిని నెట్టిభ్రష్టుని జేసెదనోచూడు. దేవదేవభక్తుఁడని నీచేఁగొనియాడఁబడిన, వానిని దేవదేవీపాదదాసునిగఁ జేయుదునో, లేదో చూడు నా చమత్కారము.

మధు—చాలుచాలు! ఇంతవరకెయాలస్యమైనది. ఇంటికిఁబోవుదమురమ్ము

దేవ—అదిగో! తిరిగిపోవుచున్నావు. నీమాటపై నీవు నిలువకతప్పదు.

మధు—చీచీ! అయోగ్యపుఁదలంపులుకూడ మహా పాపప్రదములు. చాలులే. ఇంటికి రా!

దేవ—నీవొక్కపనిఁ జేసిన నే నింటికి వచ్చెదను.

మధు—ఏ దది?

దేవ—"ఈతని భక్తి దొంగభక్తి. ఇతఁడు దేవదేవీవిలాసాదులకు వశ్యుఁడై భక్తిభ్రష్టుడు కాఁగలఁడు" అనుము.

మధు—నాజిహ్వఁ గోసిన నే నామాట ననుదానను గాను.

దేవ—జిహ్వఁ గోసినఁగాని నీ వనలేనిమాటను; నేను నాజిహ్వాచమత్కారమున నిదర్శనముగఁ జేసెదను, చూచుకో—

మధు—జిహ్వాచమత్కారములేనిదర్శనముగావలయునుగానికిరులుగావు

దేవ—ఆలాగేమి? నేనీతని భ్రష్టునిజేసి క్రోఁతినివలెవేశ్యావీధినాడింపక పోయినయెడల నావేశ్యావృత్తివదలుకొని నీకుమరణపర్యంతము దాస్యముచేయుదును. అట్లుచేసినయెడల నీవునాకట్లాచరింతువా?

మధు—చెల్లెలా! నీకేమి మతిపోయినదాయేమి? వసిష్ఠవిశ్వామిత్రులు పోరాడి హరిశ్చంద్రునిబాధించినట్లు మన మీతనికిఁ జిక్కులు గలుగఁజేయుదుమా? పాపమింక వేఱేమూటగట్టుకొననక్కఱలేదు.

దేవ—అక్కా! నాతో నింకనేమియుఁ జెప్పకుము, ఈతఁడు యథార్థభక్తుఁడని నీకు నమ్మకము పూర్ణముగ నున్నయెడల నాపన్నిదమున కంగీకరింపుము.

మధు—నాకా విషయమున నీ నమ్మకముకంటె సంపూర్ణమైన నమ్మకమున్నది.

దేవ—అట్లైనఁ బన్నిదమున కొప్పుకొంటివి?



మధు—ఊఁ!

దేవ—'ఊఁ!' కాదు, ఒప్పుకొంటి ననుము,

మధు—ఒప్పుకొంటిని. మన దాస్యమునకు మరణపర్యంతము మితి యున్నట్లే! ఈతని భ్రష్టునిగఁ జేయుటకుఁగూడ మరణపర్యంతమే మితియా యేమి?

దేవ—ఎంతపరిహాసము? ఒక్కమాసము మితి.

మధు—ఒక్కమాసముకాదు. ఆఱుమాసము లిచ్చితిని.

దేవ—అక్కఱ లేదు.

మధు—అక్కఱ లేకపోవుట కాదు. పందె మంతయు నీవు వచించితివి కద! అందులకు నే నంగీకరించితిని గద! ఈ మితిమాత్రము నేను వచించినది కావున నీ వంగీకరింపుము.

దేవ—సరే! ఇఁక నీవు నీదారిని బొమ్ము.

మధు—నీ విచ్చటనే యుండి యిప్పు డేమి చేయుదువు?

దేవ—నాపాటు లేవో నేనింక జూచుకొందును. నీవు పొమ్ము. దయ యుంచుము.

మధు—ఈబ్రాహ్మణునకుదూరమునుండినమస్కరించియింటికిఁ బోవుద మనిన వినకపోయితివి. అది యింతముప్పునకుఁగారణమయ్యెను.

దేవ—నేనే గెలిచితినేని యింతనిశ్చలుఁడైనవానిని దేవదేవి యిట్టి యాటాడించెనని లోకమందు నాప్రఖ్యాతి వెల్లడియగును. లేదా; అక్కగారిపాదము లొత్తుచుఁ గాలక్షేపము చేసెదను. ఇందున ముప్పే మున్నది?

మధు—నీవు గెలిచినప్పుడు గలుగు ప్రఖ్యాతికై యిప్పుడు సంతోషించు చుంటి కాని, అక్కగారిచేత, గాళులు పట్టించుకొన వలసి వచ్చుటకు విచారించుచున్నట్లు కనంబడుటలేదు.

దేవ—అట్టియవస్థ యెన్నఁటికి సిద్ధింప వనియేకదా నీ నమ్మకము! నీకు భక్తుని నిశ్చలత్వ మొక్కసాహాయ్య మున్నది. దైవేచ్ఛ యొకసాహాయ్య మున్నది. పూర్వజన్మపుణ్యమను మఱియొక్క సాహాయ్య మున్నది. నా కన్ను ముక్కు తీరు, వాణి తప్ప నా కేమున్నది? ఆలస్యమగుచున్న దని యిదివరకే యెన్నిమా ఱులో యంటివి. పొమ్ము. దయ యుంచుము.

మధు—సరే. పోక తప్పునా? ని న్నెప్పుడు తిరిగి చూతును?

దేవ—నన్ను, నీమఱిఁదిని గూడ వేశ్యావీథిలో నా ఉమాసముల లోపునఁ జూతువు.

మధు—ఏమో! నీ కొక్కటే పట్టుదల! లేనిపోని యీగొడవ యం తయు నెందులకు?

దేవ—నాయం దింత దయయుంచి పొమ్ము.

మధు—సరే. అప్పుడప్పుడు క్షేమవార్తను దెలుపుచుందువు గాదా?

దేవ—సరే—

మధు—నేఁ బోయెదను (నిష్క్రమించును.)

దేవ—ఏమి చేయుటకు నేమియుఁ దోఁచకున్నది. అయిన నుచితవేష మున రేపటి యుదయమున విప్రనారాయణుని సేవింపఁ బోయెదను.

(నిష్క్రమించును.)

ఇది ప్రథమాంకము.

శ్రీ

# విప్రనారాయణ చరిత్రము.

## ద్వితీయాంకము

ప్రదేశము — విప్రనారాయణుని పుష్పారామము

ప్రవేశము — విప్రనారాయణుఁడు, శ్రీనివాసుఁడు.

విప్ర — రంగా! రంగా! రంగ రంగ రంగా! రంగా!

శ్రీ — దేవరవారిఁక నట్టిచింత మానుదురుగాక! తత్సంబంధము లగు నన్నిచింత లవశ్యము మానుదురుగాక!

విప్ర — రంగరంగా! ఎంతమాటాడితివి! శ్రీరంగనామస్మరణమే యింక మాననా? శ్రీరంగనివాసమే యింక మాననా? పుష్పమాలాకైంకర్యమే యిఁకమాననా? శ్రీరంగదేవదివ్యపదారవిందదర్శనమే యిఁక మాననా! శ్రీరంగేశ్వర నిర్మాల్యాఘ్రాణమేయిఁక మాననా? తిరుకావేరీతీర్థపానమే యిఁక మాననా? ద్వాదశోర్ధ్వపుండ్రములే తుడిచివైచుకొందునా? రంగభక్తి నిఁక గంగాప్రవేశము సేయనా? బ్రహ్మచర్యవ్రతమును దగులఁబెట్టనా? గజ్జెలువదలి స్త్రీకటాక్షమాలికాశృంఖలలు కాళ్ళకుఁ దగిలించుకొందునా? వింజామరను వదలి పైఁటచెఱఁగు చేతఁ బుచ్చుకొని వేశ్యాకపోలఫలకస్థలవిలసితఘర్మవారి నపనయిం

పనా? రంగ రంగ రంగా! (ఏడ్చును) (యోగిని వేషముతో దేవదేవి (ప్రవేశించును)

దేవ—తథాస్తు! నాచే ముందు గాంచబడిన కార్య మిప్పుడు గజ్జెలు కట్టుకొనియీతనినోటఁ దాండవించుచున్నవి. వీ రింక నిక్కడ నేమిమాట లాడుకొందురో వినెదను.

శ్రీ—అడియేని విన్నపమును దేవరవారు మనఃపూర్వకముగఁ జిత్తగింపలేదు.

విప్ర—నీమాట నాకు బాగుగ బోధము కాలేదందువా! గురుని వాగ్వైఖరి శిష్యునికి బోధింపకపోవుట యొకప్పుడు సహజము గాని యిది యేమి? ఇట్టి విపరీతము? ఇట్టి విపర్యయము! నా బ్రదు కిటు తలక్రిందగునా?

శ్రీ—స్వామీ! దాసు నొకమారు కటాక్షింప్రుము.

విప్ర—నే నొకనిఁ గటాక్షించుశక్తి గలవాఁడను గాను. నాకుశ్రీరంగ దేవకటాక్షము కావలయును. అందుకొరకుఁ బుట్టితిని. అందు కొరకుఁ బ్రతుకుచుంటిని. దానితోడ నే చావవలయును. రంగ రంగరంగా! (దుఃఖించును.)

శ్రీ—నిత్యభక్తి యోగప్రపూర్ణులగు దేవరకుఁ గూడ భగవత్కటాక్ష లోపము గలుగునా!

విప్ర—కలుగనే కలిగినది. సంతతమందహాససుందరవదనారవిందదివ్య సందర్శనప్రదాత యగునా మనోహరుండు, నా కస్తూరి రంగఁడు, నేఁ డేమో నా కప్రసన్నముఖుఁడై యుంటయే కాక కించి త్కోపావేశవికటీకృతనిటలతటుఁడై యుండె నని నేను నీతో నిదివఱ కెన్నిసారులు చెప్పుకొని యేడ్చితిని. ఇంకను—

శ్రీ—అదిగో! అచింతనే మానుకొనుఁ డని నే నిదివరకువిజ్ఞాపనముఁ జేసికొనఁగ మీారన్యథాభావించియిట్టిదుఃఖాధికతనుబొందినారు.

విప్ర—ఆచింతను మానుకొననా ? నాతరమగునా ? మానుకొని నేను జేయవలసిన దేమి ? రంగా ! రంగరంగా !

ఆ. వె. తల్లి లేదు; లేదు ♦ తండ్రి భ్రాతలు లేరు;
లేమ లేదు; గృహము ♦ లేదు; నీవు
దక్క నెదియు లేదు; ♦ దాసునిఁ గోపింప
నేది దిక్కు? రంగ! ♦ యెట్టు లుందు ?

దేవ—(జనాంతికముగ) నీకు లేమ లే దనుకొన నక్కఱలేదు. ఇదిగో! ఇచ్చట నీకొఱకే వచ్చియున్నది. నీ కమ్మలేకపోయిన నత్త యున్నది. భ్రాతలు లేకపోయిన బావ లున్నారు. ఇల్లున్నది. ఇచ్చి పుచ్చుకొనుట లున్నవి. మడియున్నది. మాన్యమున్నది. సొంతవ్యవసాయ మున్నది. అన్నియు నున్నవి. నీకు బుద్ధి మాత్ర ముండవలయును. అనఁగ—లేకుండవలయును.

విప్ర—నాకు బుద్ధి లేదు. మనసు కుదురు లేదు. భక్తి లేదు. రంగా! రంగా! నీ వెట్లు ప్రసన్నుఁడ వగుదువు? ఏమి చేయుదును ?

దేవ—(జనాంతికముగ) ఏమి చేయుదువా ? తెగి పడి భోగమువీధి కడ్డుపడుము.

శ్రీ—దేవా! భక్తి నిలువఁబడుట కొకమార్గమున్నదని నేను వింటిని.

విప్ర—ఆలాగా! చెప్ప వేమి ?

శ్రీ—గంజాయి చిలుములో నుంచి కాల్చినయెడల.

దేవ—(జనాంతికముగ) శ్రీనివాసా! గంజాయి జ్ఞానపత్రము కాని భక్తిపత్రము కాదు. భక్తిని కుదుర్చుపత్రి మేదనఁగ— తీర్చలేని ఋణపత్రము.

విప్ర—(పరధ్యానముగ) రంగరంగరంగా! ఏమంటివి ?

శ్రీ—ఇంత తులసీవనముతోఁ బ్రయోజనమేమి? ఇది కొంత పెఱికి వైచి గంజాయిమొక్కలు నాఁటి పెంచిన యెడల—

విప్ర—హా! రంగ రంగా! ఎంత విపరీతముగఁ జెప్పుచుంటివి ?

గీ. పల్లవితకుసుమితఫూత ♦ వనమునందు
దులసి నుస్మాలన మొనర్చి ♦ ధర్మ్యమపత్రి
వృద్ధిఁ జేయింపు మంటివో ♦ హృదిని విష్ణు
భక్తి విడిచి వేశ్యారక్తిఁ ♦ బడయునట్లు.

దేవ—(జనాంతికముగ) సెబాస్ ఓటిపలుకు లారంభమైనవి. విఱుగఁ దలఁచినకత్తి ముందు పెటపెటలాడుట సహజమే కాదా?

విప్ర—గీ. చల్లనికటాక్షములఁ జల్లు ♦ జలజభవను
జల్లనగు వనమాలను ♦ సరసహృదయ
మందుఁ గలుగురంగేశ ! నా ♦ యందు నీకుఁ
దీక్ష్ణభావంబు తగునయ్య ♦ దేవ దేవ !

శ్రీ—తీక్ష్ణభావ మా మహామహునకు వహించినట్లు మీరు భ్రమపడుచున్నారు! ఆయన తిరుమొగమును మీరు బాగుగఁ జూచినారో లేదో! అప్పుడు దీపపుఁ గ్రీనీడ గాని, మఱి యేదైనఁ గాని తన్ముఖమండలప్రసన్నతను దగ్గింప నట్టి వికాసశూన్యత మీభక్తి లోపమునఁ గలిగినదని భావించి పరితపింపవచ్చునా? అదిగాక మీభక్తి కిప్పుడు లోప మేమి కలిగెను? వ్రాసెడు పాశురములు వ్రాయుచునేయున్నారు. గుచ్చెడుపూలు గుచ్చుచునే యున్నారు. వాయించెడు తాళములు వాయించుచునే యున్నారు. త్రొక్కెడు నాట్యములు త్రొక్కుచునేయున్నారు. చేసెడు స్మరణములు చేయుచునే యున్నారు.

దేవ— జనాంతికముగా తిట్టుకొన్నతిట్టులు తిట్టుకొనుచునేయున్నారు. పెట్టిన పట్టెనామములు పెట్టుకొనుచునే యున్నారు. పూసిన [illegible]చునె యున్నారు. పుచ్చుకొను తీర్థముపుచ్చు[illegible]నుచునేయున్నారు. త్రాగినకూడక [illegible] త్రాగుచునేయున్నారు.

మింగెడు చిత్రాన్నము మింగుచునే యున్నారు. నమలెడు నడలు నమలుచునే యున్నారు. తేఁచినత్రేఁపులు త్రేఁచుచునే యున్నారు. పడిచినయేడుపు లేడ్చుచునే యున్నారు.

విప్ర—రంగ రంగ రంగా! రంగా!

దేవ—(బిగ్గఱగ) రంగ రంగ రంగా! రంగా!

శ్రీ—అదియేమి! ఒకటియొక శ్రీరంగభక్తశిఖామణీ యీసమీపమునఁ జేరి నట్లున్నది!

విప్ర—రంగ రంగా! భక్తిశూన్యముగ నావలెనే కేవలము ధ్వనిగలుగుటకుమాత్రమే "రంగరంగా!" యని యఱచు నేచిలుకయో గోరువంకయో కాక, ఈపాపాత్ముసదరిఁ జేరుటకు భక్తశిఖామణికూడా వచ్చునా! రంగరంగరంగా!

దేవ—రంగరంగరంగా! (దరిఁ జేరబోవును)

శ్రీ—దేవరవా రట్లు కటాక్షింపఁ దగుదురు.

సీ. పావనతులసికా ♦ పద్మబీజస్తోమ
రచితమాలలు మెడఁ ♦ గ్రాలుచుండఁ
దీరుగా దిద్దిన ♦ తిరు[illegible] శ్రీ తిరుచూర్ణ
తిలకంబు దివ్యది ♦ ధతుల నీన
నీరెండతీ రుంపు ♦ నీర్కావికాషాయ
తళతళల్ తను వంత ♦ నలమికొనఁగ
రమ్యనాదముతోడ ♦ రంగనామముఁబల్క
మురళిగానముకీర్తి ♦ మురువుకొలుప

గీ. గుటక లాడవించుచిత్రాన్న ♦ ఖుటికవంటి
వర్ణమును గల్గి వెన్నయ ♦ ప్పమును బోలె
మెత్తనై బోడిదారాగి ♦ మిళ్ళిచెంబు
చేతఁగ్రాలంగ నదిగో! వేం ♦ చేయు నొకతె.

విప్ర—(లేచుచున్నాఁడు.)

దేవ—దాసురాలి ప్రణామ మంగీకరింపవలయును. (సాష్టాంగపడును)

విప్ర—సాష్టాంగము జేయుచు, సర్వాపరాధిని! దాసోహం దాసానుదాసోహం!

శిష్య—(తనలో) ఈమెకు నమస్కరించుటకు నాకు బుద్ధి పుట్టకున్నది. అయిన నేమి? గురువుగారు సాష్టాంగపడినతరువాత నేనూర కుండఁ దగదు (ప్రకాశముగ,) దాసోహం!

విప్ర—దయచేయుఁడు.

దేవ—అట్లు కాదు. మీరే ముందుచేయుఁడు.

విప్ర—అదేమిమాట? దేవివారు దయచేయుదురుగాక!

దేవ—ఆఁ! ఆఁ! నేను మీపాదసేవకై వచ్చినదానను. నన్ను మీ రట్లు గౌరవింపఁ దగదు.

శిష్య—దేవా! స్త్రీకిఁ దాము సాష్టాంగపడవచ్చునా? అందులోను శిష్య త్వకమునకై వచ్చినదానికి—

విప్ర—(దేవదేవిచేతులుపట్టుకొని)కూరుచుండుఁడు. కూరుచుండుఁడు. (ఇద్దఱును గూరుచుందురు.) దేవివారి తిరువడిగళ్లవలన నేదేశ ము పవిత్రమైనది?

శిష్య—(తనలో) ప్రస్తుతము మీవన దేశము.

దేవ—దానిని గూర్చి తరువాత ముచ్చటింపవచ్చునుగాని—మీ శిష్యుఁ డడిగినప్రశ్నమునకు—శిష్యత్వకమునకు వచ్చిన స్త్రీకి సాష్టాంగ మొనర్పవచ్చునా?' యనుదానికిఁ బ్రత్యుత్తరము సాయింపవలయును.

విప్ర—

గీ. శిష్యు నెపుడు గురుఁడు నిర ♦ సింపఁగూడ;
దాత్మసముసిగ భావింప ♦ నగు సతంబు

మోక్షనిక్షేప మిదునది ♦ భూతిరేఖ
కాదు, యజ్ఞోపవీతంబు ♦ కాదు; మఱియు
గొరుసుబోడిమీసము గాదు; ♦ గోష్పదంబు
వంటిజుట్టు గా; దుత్తమ ♦ భక్తిగాని.

దేవ—(తనలో) ఇచ్చట నద్వైతులను గొంచె మెత్తిపొడుచున్నాడు కాంబోలును. ఇతని కింక నన్యమతద్వేషము వదలినదికాదు. భక్తిమార్గము లీతనికిఁ దెలియునుగాని, యనుభవమున కింక బాగుగ రాలేదు. ఇతఁడు సంసారమును వదలినాఁడు. పైపె ట్టందక యూఁగులాడు చున్నాఁడు. ఇతనిని బడఁద్రోయుట కిది యే సమయము. గచ్చపప్పు, దిన్న కాకివలె నాచాకచక్యమున నితఁడు గిరగిర దిరిగి పడవలసినదే. భూతిరేఖ మోక్ష మీయ నపుడు పంగనామము లిచ్చును గాఁబోలు! గోష్పాదమంతజు ట్టియులేనప్పుడు గొఱ్ఱెతలకాయ యంత జుటిచ్చును గాఁబోలు!

విప్ర—

గీ. భక్తునకు జాతిలింగవి ♦ భాగ మిల్ల
స్నానసంధ్యాదికృత్యము లవ ♦ సరము లేదు;
వేదశీర్షి కాజ్ఞత యైన ♦ వేషబంబు
పరమభక్తి యొక్కటే ముక్త్య ♦ సాయ మగును,

శిష్య—దేవరవా రుపన్యసించిన దెంతసమీచీనముగ నున్నను గొంత పాషండత్వమును వెల్లడించుచున్నది. భక్తికత్యధికత నాపా దించుచున్నారు! అదియుఁగూడ సందేహాంశము! భక్తి తప్ప నితరమోక్షోపాయము లే దనుకొనినను దత్సాధనము లైన కర్మజ్ఞానములను నిరసించుచున్నారు. బ్రహ్మసృష్టిలో స్థాపింపఁ బడిన వర్ణలింగవిభేదమునుఁ దుడిచివైచినారు. బ్రహ్మముఖో ద్గీతవేద వేదాంతసారము నప్పున నూదివైచినారు. దేవర

తనదుసహపాఠకునిగాఁగ ♦ దలఁపవలయు
నిద్దఱు స్వగురుసిష్యులం ♦ చెన్న నగును.

గీ. గురుని సేవించి తా నేర్చు ♦ కొనినవాల్గు
ముక్కలు మఱచిపోకుండఁ ♦ బుణ్యమూర్తి
శిష్యుఁడు లభించె నని ప్రీతిఁ ♦ జెందియతని
నిత్యగౌరవమునను మ ♦ న్నింపవలయు.

శ్రీ—(తనలో) ఇట్టిగౌరవము మాత్రము నాయం దెన్నఁడును జూపి యుండలేదు.

విప్ర—గీ. శిష్యునాత్మకు భక్తి వి ♦ శేష మిచ్చి
పరమదయ దానిఁ బోషింప ♦ గురునిభార
మధికభక్తిని గురుదేహ ♦ మాచరించి
రక్షణముసేయ శిష్యుభా ♦ రమ్ము సుమ్ము.

ఇంకను,

గీ. ఇతఁడు బ్రాహ్మణాగ్రేసరుఁ ♦ డితఁడు మాల
ఇది పిపీలిక, యిది సింహ, ♦ మితఁడు పురుషుఁ
డిద్ది స్త్రీ యను పైభేద ♦ మెగయుభక్తి
నగ్నితో దర్వ్యభేదము ♦ లైనయట్లు.

గీ. వేదవేదాంగ సత్సార ♦ వేత్తయైన
శాస్త్రమట్కప్రవీణతా ♦ జటిలుఁడైన
ద్విజవరుండైన విష్ణుభ ♦ క్తిరహితుండు
పరమచండాలుకంటెను ♦ బాంసనుండు,

గీ. శ్వపచుఁడైనను బశువైనఁ ♦ బక్షికీట
కము లయిన విష్ణు భక్తియు ♦ క్తము లగునెడ
బ్రాహ్మణోత్తముకంటెను ♦ బరమపూత
జన్మ లగును మోక్షార్హ్యప్ర ♦ శస్తిఁ గాంచు.

వారు మహాభక్తులు! తమకేమియు బాధలేదు. కాని దీనుఁ డగునడియేని కొక్క భయమమాత్ర మున్నది.

విప్ర—ఏదది?

శీ్ర—భక్తి ప్రత్యక్ష మగువస్తువు. కొలదియో గొప్పయో యది లేనివాఁడే లేఁడు కాని, యెంతభక్తి యున్నప్పు డిట్టిమాట లాడవలయునో యిట్టు లాచరింపవలయునో తెలియదు. భక్తి మాకున్నదని వెల్లడించుచు వేదముల నిరసించి, వేదవిహిత కర్మములను ద్యజించి, వర్ణవిభాగమును భ్రష్టపఱిచి, నిరంకుశ మైనట్టియు సుఖతరమార్గ మైనట్టియు నొక యప్రమాణమత మును భవిష్యజ్జనులలోఁ గొంద ఱేర్పఱుచుకొందు రేమో. అట్టిసమీక్షమతమునకుఁ దమయుపన్యాసము ప్రాతిపదికముగ నుండునేమోయని నేను భీతిల్లుచున్నాను.

విప్ర—భక్తి కుదురనివాఁ డెన్ని వేదవిహితకర్మము లాచరించినను వినియోగము లేదు. కుదిరినవాని కంతకంటె వినియోగము లేదు. కాని ప్రస్తుతవృత్తాంతమును వదలి భవిష్యద్గాథ లేల? ఇప్పటికైన నిద్ది స్త్రీ కాదని నీకుఁ దోఁచినట్లేకద!

శీ్ర—తాను స్త్రీనిగానని యామె యొప్పుకొనినను నేనొప్పుకొనను. నాకన్నుల నెక్కడ మాపుకొందును! ప్రకృతినెట్లు భ్రష్టము సేయఁగలను ?

విప్ర—అబ్బ! నీకు నాయభిప్రాయము బోధింప కున్నది. 'ఈమె' యనఁగ నేమి?

శీ్ర—ఇదిగో! దొంగకోళ్ళను బట్టుకొన వేచియుండు నక్కవలె నున్న యీవ్యక్తి.

దేవ—రంగరంగరంగా!

విప్ర—కాదు. ఈమెయనఁగఁ గరచరణాదివిశిష్ట మగు నీరూపము కాదు. నిరవయవ నీరూపమగునాత్మ. దానికి స్త్రీత్వమున్నదా?

శ్రీ—చూడకుండ నే నెట్లు చెప్పఁగలుగుదును?

విప్ర—నేను జెప్పుచుంటిని వినుము. ఈమె స్త్రీ కాదు. నేను బురుషుఁడను గాను.

దేవ—(తనలో) ఈతనికి భక్తితోపాటు చిత్తభ్రమకూడఁ బట్టినదేమో?

విప్ర—ఇప్పుడు తెలిసినదా?

శ్రీ—(సందేహముగ) ఊ ఊఁ.

దేవ—తెలిసె నంటివి కదా? నీవు స్త్రీవా? పురుషుఁడవా?

శ్రీ—రెండును.

విప్ర—అదెట్లు?

శ్రీ—పురుషులయొద్ద స్త్రీని, స్త్రీలయొద్ద పురుషుఁడను.

విప్ర—సరే. సరే. ఎట్టులైన స్త్రీపురుషభిన్న మైన తత్త్వమవు. (దేవదేవినంకేఁ జూచి) ఇదిసరికే దేవివారిక్షేమప్రశ్నమున కాలస్యమైనది. క్షమింపవలయును.

దేవ—ఈ శ్రీరంగపట్టణమునకు సమీపమున నున్నయొకచిన్నపల్లె మానివాసము. నేను జన్మమున వేశ్యను. దేవదేవి నాపేరు.

శ్రీ—వేశ్యవే! ఆఁ! ఆఁ! ఏమి స్వామీ? భాగవతులము భోగము మేళములో నింకఁ గలసి పోవలసినదేనా?

విప్ర—ఏమనెనో వింటివా? జన్మమున వేశ్యననినది. వృత్తమునఁ బరమభాగవతోత్తమురాలు.

శ్రీ—పండ్లూడినతరువాతఁ గాని, వారకాంత భాగవతోత్తమ యగునా? దేవరవారు పరిశీలింపఁ దగును.

దేవ—పండ్లు కనఁబడుచునే యుండఁ బరిశీలన మెందులకు? దేవా! అట్టి పరమతుచ్ఛవేశ్యాకులమునఁ బుట్టి—

విప్ర—రంగరంగరంగా! ఏపూర్వజన్మపాపముననో యటు సంభవించెను.

శ్రీ—(తనలో) అందుచేతనే మన కీష్టుడిట్లు సంభవించెను.

దేవ—పాపమున బాల్యావస్థలోనిగండములన్నిటిని దాటి బ్రదికి—

విప్ర—పాపము! రంగరంగా!

శ్రీ—(మనది) మనది.

దేవ—మహాపాపమునఁ బెద్దదాననై—

శ్రీ—(తనలో) విటులమహాపుణ్యమున — వైద్యులమహాపుణ్యమున—

దేవ—అంతకంటె నతిఘోర మగుపాపమున నొక్కదుర్విటుని కంటఁ గట్టఁబడితిని

విప్ర—రంగరంగరంగా! వేశ్యలకుస్వాచ్ఛందవృత్తి యగునప్పుడొక్కని కని చెప్పితివి. నాకుఁ దెలియదు.

శ్రీ—స్వామీ! ఇది యేమి తులసిమాలలోనిపూసలను గణించుటా! శ్రీరంగదేవార్పణమునకుగుచ్చెడుపుష్పమాలలోనిపుష్పముల గణించుటా! గాయత్రీమంత్రసంఖ్యాగణనమా! ఊరిలోనివేశ్య కెందఱువిటులో లెక్కించుట మన కెందుల కయ్యా! స్వామీ! నివృత్తిమార్గమున నుండునరులలో భాగవతోత్తముఁ డెట్లు ప్రసిద్ధుఁడో ప్రవృత్తిమార్గమునఁ దిరుగువిటులలోఁ గన్నెఱిక పుఁబెండ్లికొడుకట్లు ప్రసిద్ధుఁడు. దేవర కిప్పుడు సంశయము వీడినదా!

విప్ర—ఈమొగుణమెంతస్వచ్ఛమైనదో నీవుపరిశీలింపకుండ మాటాడు చున్నావు.

శ్రీ—ఆమొగుణమునుగూర్చి నేను జెప్పనే లేదు.

దేవ—అటులైన—

శ్రీ—అటులైన ననఁగా! ప్రథమమదనమంత్రోపదేశ మైనతరువాత—పద్మనాయక బ్రహ్మజిజ్ఞాసాశాస్త్ర ప్రథమసూత్రపారాయణ మైనతరువాత—అంతేకాదా!

దేవ—(తనలో, వీఁడు గంగ్రడముండ కొడుకు యథేష్టవృత్తికి వేశ్యా మాతవలె నడ్డుపడుచున్నాఁడు. (ప్రకాశముగ)నాపాపమేమో కాని నామనస్సు ప్రపంచసుఖానురక్తికెక్కక పోవుటచే—

విప్ర—అదిపాపము కాదు. పూర్వజన్మమహాపుణ్యము.

దేవ—ఏమిపుణ్యమో నే నెఱుఁగను. స్వామీ నేను బడినపాట్లేమిచెప్పుదును! మా అమ్మ నాకు సింగారింప—నే నగలూడఁదీసికొన—ఆమె నాకుఁజుక్కబొట్టుపెట్ట—నేను దానిదిగొని తిరుచూర్ణ రేఖతీర్చుకొన—

విప్ర—చూచితివా? పుణ్యురాలీయలంకారవైరాగ్యము! ఊర్ధ్వపుండ్రధారణోత్కంఠత! ఆహా! రంగరంగరంగా! భక్తి! భక్తి! భక్తి! వంటిది మఱియొకటి యున్నదా? వేదవిహితకర్మాచరణ మావశ్యక మంటివే! జ్ఞాన మావశ్యక మంటివే! ఇక్కడ నవియేవియు నక్కఱలేకుండ నిశ్చలభక్తి చిన్నతనముననే యెట్లు కలిగినదో చూడు! శ్రీరంగమూర్తి నిర్హేతుక జాయమాన కటాక్షవైభవముననే యది కలుగవలయును.

శ్రీ—ప్రవృత్తిలోఁ దిరిగి పడకుండ దానిని దుస్సంగశూన్యత్వము చేతనే మనము కాపాడుకొనవలయునని దేవర యిదివఱకు సాయించినారు.

దేవ—సాయంకాల మగుసరికి, విటాధముల నాకర్షించుటకై, గుమ్మములో నిలుపఁబడి తలు పోరఁజేసికొని, ర[illegible]సొట్టల [illegible] వారు, తాళపుగొలుసులగలగలలవారు, [illegible]నిదీర్ఘముల [illegible] గుయిలవారగు సర్వాభాగ్యనిక్షురకుక్షులు ఏథి[illegible]ండి [illegible] కలు సవరించుకొనుచుఁ బోవుచుండ, [illegible]ప్రముంచు[illegible] [illegible] వెనుకకు దాఁగుడుమూఁత లాడు[illegible] నన్ను మా[illegible] గుమ్మములోనికి రెంట—మొఱ్ఱో యని నేను వెనుకవెనుక నాలోనేను దిట్టుకొనుచుఁ బోవ—

విప్ర—ఆహా! రంగరంగరంగా! భక్తమునకిఁ బ్రాపంచికసుఖనిర్బంధ
మెంతమహాకష్టము! భక్తి యుదయించినపిమ్మట నది నిశ్చలముగ
వృద్ధికావలయునుగాన, తుచ్ఛసుఖనిత్యప్రోత్సాహము దాని
కెంతయవరోధముగావించునో చెప్పవలయునా? నీవునిశ్చలచిత్త
వృత్తి గలిగినదాన వగుటచేతనే, నీభక్తి యవ్యాజమైనభక్తి
యగుటచేతనే, నీవు సర్వవిఘ్న పరమశాంతిఁ జేసి, యింత
వఱకుఁ గడ తేఱితివి! నీయవస్థవిన నాకు జాలియగుచున్నది.

శ్రీ—(తనలో) మీయవస్థఁ జూడ నాకేడ్పు వచ్చుచున్నది.

దేవ—దీపాలుపెట్టిన నాలుగుగడియలకుఁ బసువులసంతకుఁ బైపల్లె
నుంచి వచ్చి పసువుసందర్భము కాకపోవుటచేఁ దిరిగియింటికిఁ
బోవుటకు వీలులేక మాడుచున్నకడుపుమంటను శనగపప్పు
బెల్లముచే శాంతిపఱచుకొని. నిద్రించుటకుఁ దావు దొరకక,
వీథిలో నడయాడుచున్న యోతలమాసినముండకొడుకో యీ
రాత్రి పెండ్లికొడుకుగ దాపరింప—

శ్రీ—సంతలోఁ బసువు దొరుకుట దుర్లభము గాని సానివీథిలో సాని
దొరుక కేమి?

విప్ర—ఎంతకర్మము! రంగరంగరంగా!

దేవ—అట్టి తుచ్ఛరూపస్వభావుఁడు—

శ్రీ—నేఁడు వెఱ్ఱిమొగమునిర్భాగ్యులు తప్ప విష్ణుభక్తులు లభింతు
[illegible] రంటివా యేమి?

దేవ—(తనలో) అమ్మ! నాటియొట్టపుము [illegible] (...)క [illegible]గ
[illegible] పట్టుకొని గడలోని కతఁడ [illegible]—నేను బంచపాళీ
[illegible] కొతని [illegible], నన్నాతఁడ [illegible] నఁగ, నేను
[illegible]యు విడిపించుకొని ధుమధుమ [illegible] నన్నాతఁడు. [illegible]
[illegible], నేను దిట్ట, నా తఁడు నన్ను [illegible] క్తులాడ, ననేద్వ, [illegible]

ముష్టియుద్ధసంరంభమునకు నాయమ్మ చూచి నన్నుఁ బడదిట్టి
వాఁడు సంతతక్లేశమున కోర్వఁడఁ గోపునేమో యను రోషముతో
నన్ను సున్నపుంబిడతతో నెత్తిపైఁ గొట్ట—

విప్ర—ఆఁ! ఆఁ! రంగరంగా! సున్నపుంబిడత యేల?

శ్రీ—బొప్పికి వేఁడి సున్నము తాయనకట్టు లేకుండుటకు—

దేవ—గిలగిల కొట్టుకొని నే నేడ్వ—(ప్రవచ్చును.

విప్ర—రంగరంగరంగా! ఏమనవలెను. భక్తునినేత్రములవెంట నానంద బాష్పములు వెడలవలయును.

గీ. ఇతరసుఖములఁ గోరక ♦ హీనకష్ట
పాలిఁ బడి భక్తిసిటు వృద్ధి ♦ పఱచినావు;
కడుపు మండ లోకులదిట్లఁ ♦ బడుచు నాన
యేది ధనవృద్ధిఁ జేసెడు ♦ కృపణునట్లు.

దేవ—ఇంటివారందఱు తలకొక తిట్టుతిట్ట, నిరుగుపొరుగు గుడిసెవేత్రి పేరటాండ్రు దొడలునొక్కుకొనఁగ—విటకాండ్రందఱు వెక వెకలాడ —బోగమింటిపరువు తీసివై చుటకుఁ బుట్టినదీనికి గరి కెగాల్చి వాతవేయు మని వాడసానులు వైద్యబోధములు సేయ—నంకిలియేమో యని మాయమ్మ సోదికిఁ బోయి చేటెఁడు ప్రాటియాకు తాయెతులు కీలుకీలునకుఁ గట్ట— మంత్రవేత్తలని చెప్పవచ్చిన మోసగాండ్రు నన్ను ముగ్గులఁ గూర్చుండఁబెట్టి బూడిదతోఁ గలిపిన దూలగొండనూగు నాకు బోసి యేడ్పింప—స్త్రీత్వవృద్ధికై నేరేడుపండంత మాత్రలు నాచే వైద్యులు మ్రింగింప—

శ్రీ—పుంస్త్వవృద్ధికై మదనకామేశ్వరమో మర్దనమోగాని స్త్రీత్వ వృద్ధికి మందేల?

విప్ర—రంగరంగా! ఏమికష్టములు? జనుల కెంతవెఱ్ఱి!

గీ. అనృతవాదులు సత్యవా ♦ ఘనులు బుద్ధి
హీనులఁ దని యతిభయముఁ దవు ♦ యెన్నుచుందురు
కులటలు పతివ్రతను వెఱ్ఱి ♦ గోల యొంట
రెత్తు చచ్చు పెద్దమ్మని ♦ యీసడింతురు.

గీ. అత్యనాచారు లిద్ధళి ♦ స్వార్థకాత్మ
ఘాండసపు ముండకొడుకు కసి ♦ చాటుచుందురు
భవభుజాపీడితులు భక్త ♦ సరుస బెత్త
విభ్రమాదభ్రుఁ డసి బాధఁ ♦ బెట్టుచుందురు.

గీ. తక్కుకుఁ గలవెఱ్ఱి వాఁటెన ♦ ధన్యతముని
వెఱ్ఱివానిగ జనులు భా ♦ వించుచుందు
రట్టివెఱ్ఱి దీజేసవెఱ్ఱి ♦ యతండు లోకు
లెల్లరును వెఱ్ఱివా రని ♦ యెంచవలయు.

దేవివారు సాయించు నుపన్యాసమునకు నడ్డువచ్చితిని. క్షమిం
చి సెలవిచ్చెదరుగాక !

శ్రీ—దేవి వారి యుపన్యాసమునకు దేవరవారి యోపికకుఁ గూడ
నంతము గానఁబడ కున్నది !

విప్ర—శ్రీనివాసా! అట్టు లాడుట న్యాయమా!

గీ॥ భక్తివృద్ధికై భక్తుఁడు ♦ పడెడు పాట్లు
భక్తుఁడు గ్రహింపఁ దగుఁగాక ♦ పరుసతరమె?
ఘనమహాకావ్యపోషణ ♦ మునఁ గలి పను
కష్ట మితరుఁ డెఱుంగునే ♦ కవియె కాక.

శ్రీ—గప్పు మను యొకసారె మెఱుపు మెఱసినట్లు—పూలు జల్లున నా
కస్మికముగఁ జల్లినట్లు—చల్లఁగా హఠాత్తుగాఁ బన్నీరుచిలికిన
టు—చందనగంధగంధిలమందమారుతము వీచినటు—సర
సంగీతమాధురీధురీణారావపువిసరు చెవిసబడి హృదయమున

దూరినట్లు—సుందరయువతీ సుకుచాగ్రయాదృచ్ఛికస్పర్శచే నొడలు మనస్సు నాత్మయునంతయు నొకమాఱు జలజల మనినట్లు—ఈయంశముమాత్ర మడిమేసికి దేవరవారి కిప్పటివఱ కనుభూతము. క్షమించవలయును—నిష్ప్రయత్నముగ, నిరాయాసముగ, నబుద్ధిపూర్వకముక బయలువెడలినకవితయానందింపఁ జేయునుగాని, గాదెక్రిందిపందికొక్కువలె రేయింబగళ్లు బఱికి బఱికి, పండ్లు గిట్టకఱచుకొనఁజేయునట్లు అంపపుకోతవలె గోసి కోసి, గ్రుడ్లు నీరుగ్రమ్మ నొక్కొక్కవెంట్రుకను దంటసమునవలె బీఁకి పీఁకి, జనపనారపచ్చడినివలె వెనుకకు ముందునకు నూఱి నూఱినట్లు, కష్టపూర్వకముగ, బలాత్కారముగలాగి లాగి, యీడ్చి యీడ్చి చెప్పి వీథినిబారవైచిన కవిత, వెఱ్ఱికుక్కవలెఁ దోఁకముడిచి పండ్లిగిలించి, తోఁచక, తావులేక, యందఱిని జూచి తా జడియుచు, నందఱకుఁ దా భయహేయతలను గలిగించుచు, నొకచోట నైన నొకనిముసమైన స్తిమితముగ నిలువఁబడదు నన్న 'చీచీ' యనుధ్వనులచే బెదరి పాఱిపోవుచు, లోకులు నిందించుచున్నారని యేడ్చుచు, నందులకొఱకు లోకులపైఁ బగఁ దీర్చుకొనఁ గఱవఁబోవుచు నొకనిని జంపుచుఁ దాను దూరపువారిఱాల దెబ్బలను దగ్గర వారికఱ్ఱదెబ్బలను దిని పరమపదించును. భక్తియుఁగూడ నటులే. అది దివ్యతేజమువలె బయలువెడలవలయును. అట్టి యట్టి పూర్వపుణ్యమునఁ బ్రాఁకవలయును. అంతయే కాని పడరానిపాటులఁ బడినంతమాత్రమున నది వృద్ధియగునా? గొప్పాద్రవ్వుట కది యేమి వంగచెట్టా? గసికఁ గొట్టినఁ గాని పక్వము గాకుండుట కదియేమి పనసకాయయా? దంపి, సాగఁ దీసి, లట్టించినఁ గానిభోగ్యము గాకుండుటకదియేమి గోధుమ

పిండియా? మహాకష్టములఁబడి యెట్టులో స్వల్పముగ వృద్ధి చేసికొనుభక్తినిశ్చలముగమాత్రము నిలువదు. ఏటకుక్కలాడి, వగలాడి, తగులమారిపేరఁటాలో కుక్క దక్షోద్యదనపుఁబోత్రిను వలె నోటఁ గఱచుకొని పోవును.

విప్ర—రంగరంగరంగా! రంగ!

దేవ—మహాత్మా! దేవరశిష్యుఁడు సూర్యునికి వారములును, చంద్రునికిఁ దిథులును జెప్పవాఁడుగ నున్నాఁడు!

శ్రీ—ఈకొత్తశిష్యురాలు—ఈకొత్తశిష్యురాలు—గోవింద భక్తునకు గొక్కెకము సెప్పుటకు వచ్చినది కాఁబోలు నేమి?

దేవ—(తనలో) వీ డసాధ్యుఁడే!

విప్ర—(చెవులు మూసికొని) రంగరంగరంగా! అట్లనెద వేమి?

శ్రీ—నేను దేవరనేమియుననలేదు. ఈశిష్యురాలు నన్నధిక్షేపింపనేల?

విప్ర—కాని, నీబుద్ధి మొదటినుండియుఁ గనిపెట్టుచుంటిని. ఏమో లోకవిరుద్ధముగ నున్నది.

శ్రీ—మీచర్యయో? ఈవయసేమి? ఇంతభక్తి యేమి? ఈ దేహదార్ఢ్యమేమి? ఈ ప్రపత్తి యేమి? ఈ రక్తపటిమయేమి? ఈ యింద్రియనిగ్రహ మేమి? ఈ ప్రాపంచికసౌఖ్యవిరాగత యేమి! ఈ వానప్రస్థత యేమి? ఈ మాధుకరభిక్షాన్ననియమ మేమి! ఈచర్య లోకవిరుద్ధముగాదా? మీశిష్యుఁడ నైన నా బుద్ధికూడ నట్లే యుండుట యాశ్చర్యమా!

విప్ర—(నవ్వుచుఁ దల పంకించి) నీవుస్తుతిని మానవుకదా?

శ్రీ—స్తుతిని మానుమని నన్ను దిద్దుటకంటె సత్యమును జెప్పవలయు నని శాసించువేదమును దిద్దిన బాగుగ నుండును.

దేవ—(తనలో) ఆహా! మహాత్ముఁడు బహునిష్కల్మషహృదయుఁడు బహుభూతదయాయుక్తుఁడు. స్త్రీపురుషభేదమే యిప్పటికెఱుఁ

గనిమహామహుఁడు. కాని స్వల్పస్తుతిప్రియత, అత్యమాయికత మొదలగుకొన్నిలోపము లీయనయం దుంటచేతనే యాసపడు చుంటిని గాని, జాగిలమువలె నీతని గాఁచియున్న యీశిష్యుని దలఁచుకొన భయము వైచుచున్నది.

విప్ర—భాగవతోత్తములాలా! కానిండు.

దేవ— ఏమున్నది. భక్తురాలనని, బ్రహ్మచారిణి నని, వైరాగినినని జోగిని ననియందరునన్నుఁ దరిమితరిమితిట్టుతిట్టి —బాధింప—

విప్ర—ఆఁ! ఆఁ! నిజమే! నిజమే!

గీ. అట్టిశుభనామములు తుచ్ఛ ♦ లందుఁ జేరి
తిట్టు లయి భక్తునకు నిందఁ ♦ దెచ్చు నింత
కవిమృదులవాక్యములుఁ నిర ♦ క్షరనటకుల
నోటఁ బడి కవి కిసుమంత ♦ మాట వలెను.

కాని,

గీ. సంగయుతులకు భూషణా ♦ స్వర్ణకాంత;
లగును దూష్యము లధికభ ♦ క్తంచితునకు;
వారి కతిదూష్యహేయమౌ ♦ భక్తిపూర్ణ
మగును బరమభూషణము భ ♦ క్తాధికునకు!

దేవ—ఇంటిలోనే పడి "భగవంతుఁడా! నీపాదసాన్నిధ్యమున కెప్పుడు తీసికొనిపోవుదువోయీ!" యని యేడ్చుచు నొకపంచను వైఁట చెఱఁగుఁ బఱచుకొని రంగనామస్మరణము సేయుచుఁ బడియుండ నొక్కరేయి భుజాగ్రపరిచిహ్నిత శంఖచక్రుఁడు—తులసీమాలావక్షస్కుఁడు—ద్వాదశోర్ధ్వపుండ్ర పరిభూషిత దేహుఁడగు నల్లని యాచార్యపురుషుఁ డొకఁడు స్వప్నమున సాక్షాత్కృతుఁడయ్యెను.

విప్ర—వేశ్యయింటికి స్వప్నములోనైన నాచార్యపురుషుఁడు వేంచేయుట కిదియే మొదటిసారి.

విప్ర—ఆహా! ఆహా! ఏమి నీయదృష్టము! తరువాత నేమి జరిగినదో చెప్పు.

దేవ—నే నామహాత్మునకు నమస్కరించి దేవరవా రెవరో సెలవిండని వేడుకొంటిని.

విప్ర—కానీ! త్వరగఁ జెప్పుము.

శిష్య—ఉండుఁడు. ఏమి చెప్పవలయునో యాలోచించుకొననీయ రేమి?

దేవ—ఆలోచించుకొనుట కది యసత్య మని నీయభిప్రాయమా!

శిష్య—నిన్న రాత్రి గలిగినస్వప్న మీాయుదయముననే యెంతయో నిదానించి స్మృతికిఁ దెచ్చుకొనినఁ గాని పూర్తిగా వెల్లడింప లేను. అట్టిచో నెప్పుడోగలిగినస్వప్నము నాలోచించుకొన కుండ నెట్లు చెప్పఁగల్గుదువని యంటిని. లేనిపోని దురభిప్రాయ మేలపడెదవు?

విప్ర—నాయనా యుండవోయి! శీఘ్రముగ నేమిజరిగినదో చెప్పుము. తా నెవరినని చెప్పెను.

దేవ—నన్ను విష్ణుదాసుఁ డందు రనెను.

శిష్య—అదేమిమాట? వైష్ణవులు విష్ణుదాసులుగాక వేశ్యాదాసు లగుదురా!

విప్ర—ఆతనిపేరు?

దేవ—పేరు చెప్ప వీలులేదు. నేను శ్రీస్నవణ్ణంశైద పెరుమాళ్ దాసుఁడ ననెను.

విప్ర—ఓహో! భక్తిసారులవారోయి! భార్గవాన్వయులోయి! నావ ణ్ణన్ వలె నిద్దఱుతల్లులపుత్రులోయి!

శిష్య—ముసలిదానికిఁబడుచుఁదన మిచ్చినమహాపురుషులా?

విప్ర—ఔను.

శిష్య—(అపవారించి) ఈపడుచుముండ నాతఁడు ముసలిదానిని జేసిన యెడల మన కీబాధ యుండకపోవును. (ప్రకాశముగ)

అయ్యా! పార్వతీపరమేశ్వరు లెదుట నిలిచిననైన వారింజూడని మహాత్ముఁ డీమెయింటికి వచ్చెననిన నెట్లు నమ్ముదురు?

విప్ర—నారాయణమూర్తియే యాశ్రితపరమసులభుఁడై యుండఁ దద్భక్తులుగూడ న ట్లుండరా? తరువాత నేమి జరిగెను?

దేవ—మహాత్మా! నాకేమైనఁ దారకమార్గ మున్న దేమో చెప్పు మని ప్రార్థించితిని.

శ్రీ—(తనలో) తారకమార్గము నిప్పుడేల వెదకుకొనవలయును? వృత్తి ననుసరించి యూరివారినెత్తిఁగొట్టుటయే తారకమార్గము.

విప్ర—తరువాత—

దేవ—"శ్రీరంగక్షేత్రమునఁ బుష్పవనమున నర్థపంచకజ్ఞానసంపన్నుఁ డగుమహాత్ముఁ డొకఁడు విప్రనారాయణుఁ డనుపేరున వెల్గుచున్నాఁడు. నీవు పోయి యాతని సేవించిన నిస్సంశయముగఁ గృతార్థురాల వగుదువు" అనెను.

శ్రీ—(తనలో) ఈదుర్వేశ్యాసంగతి కాచార్యోపదేశము మూలాధార మయ్యెనా?

విప్ర—ఆఁ! ఆఁ! నే నంతవాఁడనా? అయ్యయో! దుర్మార్గుఁడను. పాపిష్ఠుఁడను. ఆమహాత్మునిపాదుకల కున్నంతయర్హతయైన నాకు లేదే!

శ్రీ—ఆపాదుకలక్రిందిమట్టి కున్నంతయర్హత నాకు లేదు.

దేవ—ఇట్లు సాయించి యాతఁ డంతర్హితుఁ డయ్యెను. ఒక్క తెను వైకి రాఁగ నూరివారు తాలఁ గొట్టుదు రను భయముచే మాయక్కను సహాయురాలిగఁ దీసికొని నిన్నఁటియుదయమున నీపుష్పవనముఁ జేరి దేవర యెదుటఁ బడి మాయక్కతో సాష్టాంగపడితివి.

విప్ర—ఆఁ! ఆఁ! అదెప్పుడు.

శ్రీ—నిన్నఁటియుదయమున నని చెప్పియే యున్నది.
విప్ర—నీవుకూడ నప్పుడు నాతోడనే యుంటివి కాదా?
శ్రీ—ఊఁ.
దేవ—మీశిష్యుఁడు మమ్ములఁ జూచినట్లు నే ననుకొంటిని.
విప్ర—శ్రీనివాసా! చూచితివా?
శ్రీ—చూచితిని.
విప్ర—అప్పుడేల చెప్పలేదు?

శ్రీ—దేవరవారియొద్ద విష్ణుగాథామహాత్మ్యమును నేర్చుకొన వచ్చిన వాఁడను గాని దేవరకు వేశ్యాగాథాకలాపమును బోధించు టకై వచ్చియుండకపోవుటచేత—

విప్ర—ఇఁక నెక్కడివేశ్యయోయి! ఆ వేశ్యాజన్మమే పోయినది! తత్సంసారము లే నశించినవి. ఇది యొకపరిశుద్ధతత్త్వము.

దేవ—సాష్టాంగపడినను దేవరవా రాశీర్వదింప కుండుటచేతను—మావంకఁజూడనైనఁ జూడకపోవుటచేతను—
విప్ర—క్షమించవలయును.

దేవ—దేవరమనము శ్రీరంగేశ్వరపుష్పమాలాకైంకర్యసంకలితమైన పుడు దేవర కన్యవస్తువు కనఁబడునా? నన్నుఁ జూడసిభక్తాగ్రి గణ్యులు నాసేవ నంగీకరించి నన్నుఁ గృతార్థను జేయ రని మహావిచార మొంది, మతిలేక, యెచ్చటికిఁ బోవుటకును గతియు దిక్కును లేక యేమిచేయుటకుఁ దోఁచక, శ్రీరంగ క్షేత్రమంతయుఁ దిరిగి తిరిగి పరమార్తిచే నేడ్చి యేడ్చి, నిన్న రాత్రి రెండుయామములకుఁ గావేరిలో దిగి ప్రాణత్యాగ మును జేయుటకై తత్తీరమును జేరితిని.

విప్ర—రంగరంగరంగా! ఎంతమాట వింటిని!
శ్రీ—(తనలో) ఏదీ? జరిగినది కాదు.

విప్ర—కరచరణాద్యవయవవిశిష్టమగునిట్టిరూపమున నుంటచేతనే యా త్మకు మోక్షోపాయము కలిగినది. ఆత్మతరించునది దేహము చేతనే. రంగరంగా యని స్మరించుటకు నో రుంటచేతనే, రం గాలయమునకుఁ బరుగులిడుటకుఁ గాళు లుంటచేతనే రంగని దర్శించుటకుఁ గన్ను లుంటచేతనే, రంగని బూలఁ బూజసే యుటకుఁ జేతు లుంటచేతనేకదా మన యాత్మలకు రంగభక్తి కుదిరినది. అవయవరహితమును రూపశూన్య మైనయాత్మ రంగని సేవించుటెట్లు? సేవించిన నది యొక సంతుష్టికరమగు సేవగనుండునా? గట్టిగ వదలకుండ రంగనికాళులు పట్టుకొన వలయును. నోరార్చుకొనిపోవునట్లు రంగనామము స్మరింప వలయును. అది సంపూర్ణమగు సేవ. అది సంతుష్టికర మగు కైంకర్యము.

శ్రీ—(తనలో) దీనికే జబర్దస్తీభక్తియని పేరు.

విప్ర—నామనసులోనియభిప్రాయమును నీకుఁ జెప్పెదను వినుము. నాకు మోక్షమందైన నంత యపేక్ష లేదు. ఎన్నిజన్మము లయినఁ దనివి దీఱకుండ నొక్కరీతిగ రంగకైంకర్యమును జేయుటయే నాకుఁ గావలసినఫలము. సరి. సరి. దీని కేమి? తరువాత నేమి జరిగెను.

దేవ—అప్పు డింక జనసమ్మర్దముగా నుండుటచే గొంతసేపు తాళి యుండవలయు నని తత్తీరమునఁ గూరుచుండ నెందుచేతనో కన్నులకట్టె మబ్బు దగుల సొమ్మసిల్లితిని.

శ్రీ—(తనలో) త్రాగుటచేత—

విప్ర—సెబాస్! రంగఁడు నీప్రయత్నమును గొనసాగనిచ్చునా?

శ్రీ—ఎవనిగొంతుఁ గోయుట కట్టెపెట్టి యుంచెనో?

దేవ—అంతట నిద్రావస్థలో—

శ్రీ—తిరిగి స్వప్నమా! ఇదివఱ కాచార్యపురుషునివంతు తీఱినది. ఇఁక రంగనిదికాఁబోలు! వేశ్యానునయమునకు భగవంతుఁడు భాగవతోత్తము లెంతచవుక యయిపోయినారు!

విప్ర—అదియే భగవంతునియం దున్నవిశేషము ఆశ్రితార్తిసుల భుఁడు. గజేంద్రాళ్వారులు తీసుప్రపత్తి సేయ, నిత్యసూరు లాశ్చర్యపడునట్లు స్వామి పరమపదమునుండి వేంచేసి మకరి కాదంతవ్రణబాధితమగు భక్తునిపాదమును శ్రీదేవీకపోలఫల కలాలనశీల మగు తనదక్షిణహస్తమున నొత్తి ధన్యాత్ముని జేసినయాభక్తవత్సలునికంటె—ఆపరమపురుషునికంటె – ఆచ క్రవర్తితిరుమగ నారుకంటె— ఆజగదాధారునికంటె—నాకన్నను కంటె సులభుఁ డెవఁడు? ఆపదల కడ్డుపడువాఁ డెవఁడు? రక్షించువాఁ డెవఁడు? అజ్ఞానహరుఁ డెవ్వఁడు? నిత్యానందప్ర దాత యెవ్వఁడు? రంగరంగరంగా! (అఱచును.)

దేవ—ఎవరో వచ్చి నన్ను శ్రీరంగేశ్వరునియాలయములోనికిఁ దీసి కొనిపోయినారు. "రంగరంగా! విప్రనారాయణమూర్తిని సేవిం పవచ్చి యాతనిచేఁ దిరస్కరింపఁబడి నీపాదములే గతియని నమ్మివచ్చితి" నని పెద్దకేకలు పెట్టి యేడ్చితిని.

శ్రీ—ఇదివఱ కెవరో వచ్చి తీసికొనిపోయి రని చెప్పియుండి యిప్పుడు నీయంత నీవే యాలయమునకు వెళ్ళినట్లు చెప్పుచున్నావు.

విప్ర—అది యొకతప్పు కాదు. కానిమ్ము.

దేవ—"తెల్లవారినపిమ్మట మాలాకైంకర్యమునకై వచ్చువిప్రనారా యణుని మేము మందలింతుము. నీవు పోయి యాతనినే సేవిం పుము" అని స్వామి గంభీరవాక్యములఁ బ్రసాదించిన ట్లుండ నదరిపడి మేల్కాంచితిని.

విప్ర—రంగరంగరంగా! అయ్యయ్యో! రంగరంగరంగా! ఇంక నేమున్నది! రంగరంగరంగా! ఇంపులకా మోము ముడుచుకొంటివి! ఇందులకా యప్రసన్నముఖుఁడవై యుంటివి! ఇదిగో! లెంపలు వైచుకొనుచున్నాను. అట్లుచేయుము, రంగరంగరంగా! క్షమింపుము. సర్వాపరాధిని క్షమింపుము. భక్తశిఖామణి! నన్ను మందలింతువని స్వామి సెల విచ్చెను గాదా! సెల విచ్చెనుగాదా! సెలవిచ్చెనుగాదా!

దేవ—ఏమి? అట్లు సంభ్రమపడెద రేమి? నావలన నేమైన తప్పు గలిగెనా?

విప్ర—నీవలనఁ గాదు యీసిర్భాగ్యునివలన—ఈయత్కిశూన్యునివలన—ఈమత్తుని వలన—ఈమందుని వలన—ఈదురహంకారునివలన—

శ్రీ—అట్లు దూషించుకొందు రేల? శ్రీరంగదర్శనతత్పరతను మీనేత్రములుండి, శ్రీరంగదేవాలయఘంటాంకారనాదశ్రవణతత్పరతను మీకర్ణములుండి, సాశురపఠనావేగమున మీజిహ్వయుండి, భక్త్యావేశమున నాత్మయుండి దేహస్మృతియే లేనట్టులుండిన మీగోమెను గాంచి, యానందించి, యాశీర్వదించి, ప్రసంగించి, యుపదేశించి, కృతార్థ నానిముసమునసే చేయలేదని శ్రీరంగమూర్తికి మీపైఁ గోపము వచ్చిన దనుకొనుటకంటె నసందర్భమైనవాక్యము సృష్ట్యాది యిప్పటివఱకుఁ గలిగి యుండదని నాయభిప్రాయము. అందులో శ్రీరంగమూర్తియే యట్లు సాయించుట తవ దైవత్వమును దాను దగ్ధముచేసికొనుట గాని మఱియొకటియా?

విప్ర—రంగరంగరంగా! ఎట్టిమాటలాడుచున్నావు! శ్రీనివాసా! నీకుఁ దెలియదు. విష్ణుతిరస్కారముకంటె విష్ణుభక్తితిరస్కారము

మహాపాపప్రదమోయి! అట్టిమహాపాపము నామెడకుఁజుట్టుకొనినది. రంగరంగా! రంగా! ఎట్టు లుద్ధరింతువో! పరిసన్నురాలా! నన్ను మందలింతునని స్వామి యానతిచ్చెను గాదా? ఆనతిచ్చెను గాదా? ఆనతిచ్చెను గాదా?

దేవ—మహాత్మా! నేను శాంతిగొంద దేవరయొద్దకువచ్చి తమకుఁ దొందర యిచ్చుచుంటినా? నే నేమైనఁ దప్పాడితినా?

విప్ర—నీ వాడినవి వేదాక్షరములు! నీవు మహాత్మురాలవు. దైవసాక్షాత్కారము గలదానవు. నీతో భగవంతుఁడు సెల విచ్చినట్టు న న్నీయుదయమున రాతఁడు మందలించినాఁడు.

దేవ—ఎట్లు! ఎట్లు!

శ్రీ—(తనలో) ఇదినరకు వినన ట్లే! ఎఱుఁగన ట్లే! నిన్నయుదయము నుండియు నీముండ మమ్ము తథాస్తుదేవతవలెఁ గనఁబడకుండ సమీపమున నాశ్రయించుకొని తిరుగుచునే యున్నదేమో?

విప్ర—నా కాతఁడీయుదయమునఁ బ్రసన్నుఁడు కానేలేదు. ఆతని మొగము వికాసవంతముగనే లేదు. మందహాసపూర్ణముగ నుండుటకు మాఱుగ ధుమధుమ లాడుచున్నది. నాకింతకంటె నేమున్నది. నాబ్రదుకున కింతకంటె లోపమేమి? నాదుఃఖమున కింతకంటె నవధియేమి? నానేత్రముల కింతకంటె మంటయేమి? నామహాపాపమున కింతకంటె దుష్టఫల మేమి? నాయాత్మ కింతకంటె శల్యమేమి? మందలింతు నని యాజ్ఞయిచ్చెను. మందలించినాఁడు. నిన్ను నాయొద్దకుఁ జేర్చుకొంటిని. ఇఁక నామహాత్ముఁడు నాకుఁ బ్రసన్నుఁడు గాకుండునా! అతిసులభుఁడే! ఆశ్రితదోషభోగ్యత్వగుణసంపన్నుఁడే! అమితకరుణాపరిపూర్ణుఁడే! అట్టి శ్రీరంగమూర్తి నాకింకఁ బ్రసన్నుఁడు గాకుండునా? అగును. నా తప్పేదియో తెలిసినది.

అందులకాశీతుడైయైనది. నామనస్సు నిర్విచారమైనది. రంగరంగ రంగా! రక్షించితివి! ఇదిగో నీవు నాయొద్దకుఁబంపినభక్తురాలు. ఈమెతో మహానందమున నింక, గాలక్షేపముసు జేసెదను. ఓరంగదాసురాలా! నీమూలమున నేఁ గృతార్థుఁడ నైతిని.

దేవ—దేవరవారిపాదపూల మాశ్రయించి సఫలమనోరథను గావచ్చిననాతో మీ రిట్లు లానతీయఁ దగునా! దేవరకు శిష్యురాలను. సేవకురాలను. మీపాదముల నొత్తుదును. మీవస్త్రముల నుదుకుదును. మీపూలమొక్కలకు నీళ్ళు తోడుదును, మీరు రంగని కర్పించు పూలదండలను నేను గుత్తును.

విప్ర—అది నే నంగీకరింపను. నా కీచేతు లేల? రంగనికి ధరింపఁదగిన పూలమాలలు నేనే గుచ్చనియెడల నాచేతు లేల కాల్పనా! మాలాకారులగు భక్తు లెందఱో తఱించిరని విని నే నిట్టి [illegible] పవిత్రముగఁ జేసికొనుచున్నారు.

దేవ—అటులైన [illegible]. నేను మీపర్ణశాలను సమ్మార్జనము చేసెదను. అలికెదను ముగ్గు పెట్టెదను—

శ్రీ—ఒకటి యనినమాట యేమి? ఆఁడువారు చేయనన్నిపనులను జేయ నిశ్చయించుకొనినావు.

విప్ర—శ్రీనివాసా! నీకుఁ గొంతదేహశ్రమము తగ్గునని సంతోషపడుచున్నావా?

శ్రీ—దేహశ్రమమున కేమి కాని హృదయశ్రమము ద్విగుణమైనది.

విప్ర—ఎందుచేత?

శ్రీ—భక్తిరాజుచిక్కుడుతీఁగెవలె నొంటరిగ నే యెదుగఁదగినది. అడి యేను వచ్చినపిదపనే దేవరభక్తిసాంగత్యమున కేమిలోపము గలిగెనో యని నేను విచారించుచుంటిని. అందుపై వన్నెలు చిన్నెలు గలయీామె యొకతె దాపరించినది. సర్వసంగపరి

త్యాగు లగుదేవరకు సంసారవృద్ధి యగుచున్నది. ఇంక నెంత వృద్ధియగునో యని నే నేడ్చుచున్నాను

విప్ర—సంసారవృద్ధి యెట్లగును? నున్న లెన్ని గూడిన నొకటి యగునా? ఈమె రంగనియాజ్ఞపై నిట్లు వేంచేసినది మనయిష్ట మేమున్నది?

దేవ—దేవా! మీకిష్టము లేనియెడల నే నెచ్చటికైనఁ బోవుదును. నిర్బంధ మేల?

విప్ర—రంగరంగరంగా! ఎంతమాట నాడితివి! నీవుమహాభక్తురాలవు. నీసాంగత్యమునకంటె నాకుఁ గావలసినదేమి? అందుపైఁ బరమ ప్రసన్న శేఖరులగు భక్తిసారభగవానునిచే నిటకుఁ బంపఁబడితివి.

దేవ—దేవరదాసినై నే నిచ్చట నుండుట మీ కిష్టమేకద!

విప్ర—అడియేని కది మహాభాగ్యము.

శ్రీ—(తనలో) రంగరంగరంగా!

దేవ—మీభుక్తశేష మేమైన నున్న నది మీశిష్యునిచేఁ గుక్కకు విదిర్చినట్లు వేయించుఁడు. ఈబొందిలోఁ బ్రాణములున్నంతవఱకు శ్రీరంగదేవకైంకర్యము, దేవరకైంకర్యము చేసికొనుచు నుండెదను.

విప్ర—రంగరంగరంగా! అట్టు లాడఁ దగునా?

శ్రీ—అట్టు లాడుట తగదు కావున దేవరయారగించుభిక్షాన్న మీమె చేతనే మాధుకర మెత్తించి తెప్పించఁ దగును.

విప్ర—అదేఁమిలకు? నేనే పోయెదను. లేనియెడల నీవు పోయి తేవచ్చును.

శ్రీ—దేవరకు వర్ణవిభాగముతోఁ బనిలేదు. లింగభేదముతో నంతకంటెఁ బనిలేనప్పు డామె తెచ్చిన బాధ యేమున్నది?

విప్ర—ఎందులకోయి! అట్టి యగత్యము లేదు.

శి—(తనలో)

సీ. విప్రాంత్యజులలోన ♦ భేద మేమనుc గాని
పంచమున్తోడ సా ♦ పడఁగ లేఁడు
తరుణీపురుషు లొక్క ♦ తత్త్వ మటానను c గాని
యింతి వీథిఁ బడ స ♦ హింపలేఁడు
వేదముల్ చలిమంట ♦ వేయ నౌననుc గాని
తండ్రిశ్రాద్ధము సమం ♦ త్రముగఁ జేయు
సత్యవర్తనమే ప్ర ♦ శస్తమటాననుc గాని
పలికిన ట్లాచరిం ♦ పంగ లేఁడు

గీ. తనకుడియెడమచేతులఁ ♦ దనరునట్టి
భేదమే తీర్చుకోలేని ♦ వెఱ్ఱినరుఁడు
లింగవర్ణభేదములు మా ♦ ర్పఁగఁ గలఁడె?
పొల్లుకేకల సృష్టి ని ♦ ర్మూల మగునె?

గీ. బ్రహ్మసృష్టిలో భేదమే ♦ ప్రాతిపదిక
వర్ణభేదదులు మఱొక ♦ ప్రబలభేద
మెంచి యొకనిపై నొకఁ డేచి ♦ యెగయుచుండు
భేదశూన్యముగ బ్రదుకే ♦ లేదు గాదె?

గీ. కుక్కగొడుగులవలెఁ బుట్టి ♦ గ్రుంకుమనము
ప్రాక్తనప్రకృతిగతిప్ర ♦ వాహ మడ్డ
పఱుతుమే? బుద్బుదము లట్లు ♦ పైని నూఁగి
యెటనో టప్పనకుండఁ బే ♦ లుటయె కాక.

(ప్రకాశముగ) స్వామీ! అట్లేమో యస్థిమితముగనున్నా రేమి?

విప్ర—నా కిపుడు మనసు నిర్మలముగ నున్నది. లోపలినుండి యేది యో సముద్రతరంగములవలెఁ బొంగుచున్నట్లున్నది. ఒడలు

జలజల లాడుచున్నది. పులకాంకుర మగుచున్నది. రంగ రంగ రంగా! ప్రసన్నుఁడవైతివి. మీరందఱు నాతోఁ బాడుఁడు నాతోఁ దాండవింపుడు. రంగరంగరంగా! రంగరంగరంగా!

దేవ—(తనలో) భక్త్యావేశ మాహికజ్వరమువలె దినమున కొకసారి యో రెండుసారులో తగిలి విడుచునుగాఁబోలు!

కాంభోజిరాగము—ఆదితాళము

విప్ర—నీరదలలితాంగ శ్రీరంగా! ♦ నిఖిలపాపవిభంగ ॥నీ॥
సారహీనం బైనయీసం ♦ సారమందునఁ జిక్కి—నీపద
నీరజంబుల భక్తిఁ గొల్వఁగ ♦ నేరక చెడిపోతిరంగా! ॥నీ॥

దేవ—(తనలో) ఇఁక ముందది జరుగవలయును.

విప్ర—సుందరం బగుఫాలతలమందు ♦ శోభిల్లెడుచిఱుకురు
లందముగ నిరుపాయ లందగను
చెందొవ న్నిందింపఁగం దగు ♦ చందమున దిరు లేఖఁదీర్చిన
చందమామనుబోలునీమొగ♦మెందులకుఁజూపింపకుందువు ॥నీ॥

దేవ—(తనలో) ఈమొగము నామొగమా? రంగనిమొగమా?

విప్ర—(గట్టిగ తాండవించి) రంగరంగరంగా! రంగా!
(పెద్దకేకలువైచి నేలఁబడును)

శిష్య—ఆహా! ఆహా! భక్త్యధికతచేఁ గాఁబోలు మహాత్ముఁడు మూర్ఛ నొందినాఁడు.

దేవ—(ఆతని దనతొడపై నుంచుకొని పైఁట చెఱఁగుతో విసరును.) (తనతో) ఇట్టియవస్థనే నేను గోరితిని. స్త్రీస్పర్శచే నేమైనమూర్ఛ కలుగునేమో?(తలయుఁజెక్కులువక్షమునునిమురు చున్నది)

శ్రీ—నీవెందుల కితని స్పృశించితివి? నీవటు పొమ్ము. లే. లే.

దేవ—గురుదేహసంరక్షణము శిష్యునిదని యీతఁడిదివఱకు బోధించినయంశమును మఱచితివా?

శ్రీ—శిష్యురాలిదని చెప్పినాఁడా? శిష్యురాలి దని చెప్పినాఁడా?
దేవ—భక్తునిఁగూర్చి లింగభేదము చూడఁదగ దని యాతఁడుపన్యసింపలేదా?

శ్రీ—భక్తునిఁగూర్చి యని చెప్పెనా? శిష్యునిఁగూర్చి యని చెప్పెనా?
దేవ—నేనిటకు భక్తినభ్యసించుటకే కదా వచ్చితిని!
శ్రీ—నీవభ్యసించినిశ్చలభక్తురాలవై నప్పుడుచూచుకొనవచ్చును. లే! ఇప్పుడు లే! అదిగో! ఆదిక్కుమాలినపైఁటచెఱఁగుతో విసరుచున్నా వేమి? ఆఁగు! నాపారబ్ధము. ఆగాలి నాకుఁగూడఁదగులుచున్నది. (విప్రనారాయణుని చెవిలో) రంగరంగరంగా! రంగా!
విప్ర—(లేచి) ఏడీ? కావేరిరంగఁ డేఁడీ! ఏఁడీ కస్తూరిరంగఁడు! ఏఁడీ శృంగారరంగఁడు! ఏఁడీ! వైభోగరంగఁడు! ఏఁడీ! నాయొయ్యారిరంగఁ డేడీ! రంగరంగరంగా! (పడఁబోవును.)
(శ్రీ—పట్టుకొని) దేవా! తమ కొడలు తిరుగు చున్నది. పర్ణశాలకు దయచేయవలయును.
విప్ర—పర్ణశాల కేల? నన్నుఁ బట్టుకొని శ్రీరంగాలయమునకుఁ దీసికొనిపొమ్ము! అచ్చట నాదివ్యమూర్తిని, నాముద్దులరంగని, యొకసారి సేవింతును.
శ్రీ—మహాభాగ్యము! దేవర దయచేయుదురుగాక!
దేవ—నేనుఁగూడ వచ్చెదను.
శ్రీ—వలదు. నీవు పర్ణశాలకుఁబొమ్ము. నిన్నటమేముగలిసికొందుము.
దేవ—సరే!

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.

శ్రీ

# విప్రనారాయణ చరిత్రము

## తృతీయాంకము

(ప్రదేశము—విప్రనారాయణుని పుష్పారామము)

(ప్రవేశము—దేవదేవి)

దేవ—ఆహా! పాపకాలము! వేశ్యయింటిచుట్టు శృంగార వేషములతో విటులు దిరుగవలసి యుండ, వేశ్యనైన నేనీసన్యాసినీ వేషమున విటునిసంపాదించుకొనుట కల్లలాడవలసి వచ్చినది. ధనలాభ మునుగోరి యీతనికొఱకు దేవులాడుట లేదు ఆతఁ డిచ్చున దేమి? సాలగ్రామతీర్థము! పోనీ! చక్కఁదనము చూచి యీతని కొఱ కేడ్చు చుంటినేమో యన నట్టిరూపలావణ్యాదు లచట పూర్ణానుస్వారములు! వేశ్యావృత్తికి స్త్రీప్రకృతికిఁ గూడ నన ర్హమైనపని సేయుచుంటిని. మాయక్కచే నెప్పుడో దాస్యము చేయించుకొనఁ దలంచి, యిప్పు డీబాపనయ్య కది యిది యన రానికైంకర్యము సేయుచున్నాను. ఆతనికి దాసినైయుంటిని కడుపు నిండినయన్నమునకు మొగము వాచి, యొడిలునిండిన గుడ్డకు మొగము వాచి యుంటిని. లోనఁ గడుపు మండుచుం డఁగఁ బైకి మహానందమున రంగనామస్మరణము చేయవల యును, కాళ్ళువిఱుగఁ దాండవములు! నోరు నొప్పులువెట్టఁ

బాటలు! చెవులుతడకలుగట్టుదాళపు దెబ్బలు! ఇంతకుమేళ ములో ముక్కాకలుదీరినదాన నగుటచేయాఘాటికింక నిలువఁ బడినాను. అయినను మిక్కిలి శ్రమముగనున్నది. లోపలవిటా కర్షణవృత్తి, పైకివిష్ణుభక్తి! లోపల నింద్రియ సమ్మర్దనోత్కం ఠత, పైకిభాగవతోత్తమత! లోపల సంగవాంఛాపాటవము- పైకి సన్న్యాసినీస్వరూపము! లోపలఁ గ్రీడామందిరావాసాభి సంధి——పైకి శ్రీరంగాలయ సందర్శనకుతూహలత! లోపల భక్తుని బాదదాసునుగఁ జేసికొనుకోరిక-పైకి భక్తునిపాదము లకుఁ బ్రణామము! లోపలననంగమంత్రజపము-పైకి నష్టాక్షరీ మంత్రజపము! లోపల దలఁపులోదొంగతనము-పైకి మాటలో రంగనామము! ఇట్టిస్వరూపము నిట్లు వెల్లడించుచున్నాను. లేనప్రేమములు వెల్లడించుట, రానియేడుపు లేడ్చుట; కలుగని కోపములు గనఁబఱచుట, లేనివినయములు తెచ్చుకొనుట, మొదలగు మదనమహేంద్రజాలవిద్యలలో విజయపత్త్రికఁ గొనినదాననుః గనుక యింతవఱకు దూసిపోకుండ నిలచితిని. అయినను మిక్కిలిశ్రమముగనున్నది. ఎంతశ్రమపడిననుదుదకు సాధింపఁగల నను నాస యున్న నంతబాధలేదు. అధైర్యమను మాటయే యెన్నఁడెఱుగనినాకే యిట్లున్నది. నేనిట బ్రవే శించి యైదుమాసములు దాఁటినది అనేకపర్యాయము లతని దేహముతో నాదేహమును దగులనిచ్చితిని. గిలిగింతలు పెట్టి తిని. జుట్టు దువ్వితిని. పూలుముడిచితిని. దేహమునకుగందము పూసితిని. కాళ్ళకు గజ్జెలుకట్టితిని. చిత్రచిత్రనృత్యములనువంక నెన్నిమాఱులోకౌగలించితిని. మోము మోమునఁ జేర్చితిని. పాదము లొత్తితిని. ఉహుహ్హు! కరుగలేదు. కదలలేదు. మెదలలేదు. అదరిపడలేదు. టొంకలేదు. ఊఁహు. హ్హు!ఒడలు

జిల్లుమనునట్లయినఁ గనఁబడలేదు. రోమాంచనమైనఁ గలుగ లేదు ఱాతిబొమ్మ! మంచుగడ్డ! ఉక్కుతునక! వజ్రఫలకము! ఛీఛీ! ఆఁడుదాని కక్కఱకురానిమగవానితనువేల? ఈ నిర్భాగ్యుని కట్టె యంత్యావస్థాగ్నిదీప్తికే కాని యనంగాగ్నిదీప్తి కక్కఱకు రాదు.

(నేపథ్యమున రంగరంగరంగా! రంగ! అంతమాట వలదు.)

దే—అరుగో! గురుశిష్యులిద్దఱుఁ గూడ వచ్చుచున్నారు. నేనీమాలతీలతచాఁటున నుండి వారేమనుకొనెదరో విందును.

(విప్రనారాయణుఁడు శ్రీనివాసుఁడు ప్రవేశింతురు.)

శ్రీ—ఆలాగునఁ జెప్పు మని యిదివఱకుఁ జెప్పిరి కాదా? ఇప్పు డంత మాట వలదందు రేల?

విప్ర—(సందేహముగ) ఊఁ—ఊఁ—సరే—చె—ప్పు—చూడు—చెప్పిన బాధ యేమున్నది?

శ్రీ—బాధయా? బ్రదుకుదుము. పరువు దక్కించుకొందుము. భక్తి నిలుపుకొందుము.

విప్ర—అభయ మేమియు లేదు! అందుచేత నేనట్లు చెప్పుమనుటలేదు.

శ్రీ—చిత్తము. పోయి చెప్పెదను.

విప్ర—చూడు! ఈదినమునసే యను మాట యేమి? ఇంతలోఁ దొందర యేమి? రేపు చెప్పవచ్చును.

శ్రీ—అట్లు కాదు. క్షమింపవలయును. తలఁచుకొనినది శీఘ్రముగనైన మంచిది. పోయెదను. సెలవిండు.

విప్ర—చూడు! సాయంకాలమునఁ జెప్పుదువుకాని యిటురా!

శ్రీ—నేను రాజాలనందులకు దేవర క్షమింపవలయును. ఇంతకాలమునకు ఖానోటివెంట నామాత్రపుమాట వచ్చినది. పోవుచున్నాను.

విప్ర—ఉండు. ఇప్పుడే చెప్పక తప్ప దనుచున్నావు కాన—విను—మెల్లగ—మృదువాక్యములతో—మనసు నొచ్చకుండ—జాగ్రత్తగా—చెప్పవలయును. ఆమె బహుసుకుమారి సుమా!

శ్రీ—భవబాధాపరిత్యాగిని యగుభక్తురాలు కాదా?

విప్ర—కాదంటినా! ఆమాట యిప్పు డెందులకు! నేను జెప్పినట్లు కాకుండ—నామనసులోని యభిప్రాయ మది యైయుండునని నీ వూహించినట్లుగ—తెలిసినదా?

శ్రీ—తెలిసినది కాని—విప్రాయాజ్ఞ యని చెప్పునెడల పని జరుగును గాని నాయూహ యని చెప్పినయెడల ఛీ! ఛీ! యనును.

విప్ర—అయ్యయ్యో! ఆమె యట్టికఠినోక్తు లెన్నఁడైనఁ బలుకునా? పరమమృదులవాణీమనోహర కాదా?

శ్రీ—మహాత్మా! రంగనామముకంటె మృదుమధుర మైనవాణిలేదని సెలవిచ్చితిరికాదా? దానికంటె మృదుల మని మీ యభిప్రాయమా!

విప్ర—రంగ రంగ రంగా! ఎంతమాట నాడితిని! రంగ రంగా! (చెంపలు వైచుకొనును.) సరే పొమ్ము.

శ్రీ—పోనిచ్చినయెడల నీసరికిఁ దిరిగి వచ్చియుందును. (పోవును.)

దేవ—(తనలో) ఏదియో నాకుఁ గొంతబాధ నిచ్చెడుమాటను జెప్ప వచ్చుచున్నాఁడు. ఈశిష్యునిబలాత్కార మెక్కువగ నున్నది. కానీ! సరసశృంగారలీలాకలాపధళధళాయితరూపసౌభాగ్యము వదలినది కదా! తస్కరవిరాగిని వేషము వచ్చినదికదా! మహారాజులను మంచపుఁగోళ్ళకుఁ గట్టించుమహిమమున్నఁగల సినది కదా! పరమదరిద్రకురూపనపుంసకాధమాధముఁ డగు బాపనపంద వెంట 'మగఁడో మగఁడో'యనియఱచుచుఁ బ్రాఁకు లాడినన నతఁడు నన్నుఁ గ్రేఁగంటనైనఁ జూడనట్టి దురవస్థ

ప్రాప్త మైనదికదా! ఇంతకంటె నైచ్య మేమి రాఁగలదు?
వచ్చునెడల రానీ! నైచ్యము భక్తికి మంచిదే కాదా?
దొంగభక్తి పోయి నిజమైనభక్తి కుదిరినయెడల నదృష్ట
వంతురాలనే! లేదా యజ్ఞోపవీతమును మెలికవైచి భక్తుని
వేశ్యావీధి కీడ్చి తెచ్చి మేళములో నా వెనుక నీతని తాళపు
హంగునకై పెట్టి యింతటినుండి సానులమేళములో శ్రీవైష్ణ
వులు చిప్పతాళపుహంగుఁ జేయవచ్చునను సదాచారమును
స్థాపించి శాశ్వతకీర్తినైనఁ బొందుదును.
(నేపథ్యమున) దేవదేవీ! దేవదేవీ!

దేవ—శ్రీనివాసుఁడు పిలుచుచున్నాఁడు. నేనిప్పు లోనికిఁ బోయి యీ
సారి పిలిచినపుడు కానఁబడుదును. పోవును.

శ్రీ—(ప్రవేశించి) దేవదేవీ! దేవదేవీ!

(నేపథ్యమున) శ్రీనివాసా!

శ్రీ—ఆఁ! ఇచ్చటకు రమ్మె.
దేవ—ఎందులకు?
శ్రీ—ఎందులకో వినుటకే-
దేవ—(ప్రవేశించి) ఏదీ? వినఁ దలచితిని. శీఘ్రముగఁ జెప్పుము.
శ్రీ—శీఘ్రముగఁ జెప్పుట కది మంచిమాట కాదని సంకోచించు
చుంటిని.

దేవ—నీవు సంకోచింప నక్కఱలేదు. నేను గీడును సంకల్పించు
కొనియే యిల్లు వదలి యిటఁ జేరితిని.
శ్రీ—ఆఁ! ఆఁ! నీవు సంకల్పించుకొనిన కీడేమి?
దేవ—ఆత్మహత్య! అది సాగినది కాదు. అంతవఱకు సిద్ధపడియున్న
దానికి నీకీడుమాట లెక్కయేమి?

శ్రీ—నీ విటకు వచ్చి యైదుమాసములు దాఁటినది. కాఁబోలు నేమి?

దేవ—అయిననేమి?

శ్రీ—పాపము! నేటితో నీకు గురుసేవఋణము తీఱిపోయినది.

దేవ—రంగ రంగా! గురువులవారాకస్మికముగఁ బరమపదించినారా?

శ్రీ—(చెవులుమూసికొని) పాపము శాంతించునుగాక!

దేవ—లేక భ్రష్టులైరా?

శ్రీ—నీవింక నిచ్చట నుండిన నేమగునో కాని, నిన్నటనుండి మఱి యెక్కడకైనఁ బొమ్మనినారు.

విప్ర—(తనలో) పాపము! వెడలిపోవును గాఁబోలు! అయిదు మాసములనుండి రంగనామస్మరణమున, రంగగాదాగానమును, రంగభక్తిప్రేరితతాండవమున నెంతయోతోడై యున్నది. ఛీ! ఛీ! పుట్టిననాఁటనుండి పోషించి భక్తినొసఁగినరంగనికంటె నాకుఁ దో డెవ్వఁడు? రంగనికంటె దిక్కెవ్వఁడు? రంగ రంగ రంగా! (లెంపలు వైచుకొనును)

శ్రీ— మాట లాడ వేమి? అది గుర్వాజ్ఞ గావున నెంత శీఘ్రముగఁ బోయిన నంతవిధేయతఁ గనఁబఱచినదాన వగుదువు.

దేవ—నాకుఁ బరమసంతాపకర మగు వార్తను జెప్పితివి. (తనలో) ఇదినాకు నిశ్చయముగ సంతోషకరమగువార్త. నామనోరథ మిక నెఱవేఱఁగలదు. ఇప్పటికి నేను స్త్రీనని యాతనికిఁ దెలిసినది. నాస్త్రీత్వప్రభావ మిప్పటికి బ్రహ్మరంధ్రమున కెక్కినది. నే నిదివఱకు వెల్లడించిన శృంగారభావచేష్ట లిప్పటికి జీర్ణమై రక్తమునఁ గలిసి ప్రవహించు చున్నవి. మోటమొండితత్త్వముకావున నింతయాలస్యమైనది. ఇఁక భయములేదు. ఇఁక నొకటి రెండుమోతాదులతో వ్యాధి తిరుగును. ఐహికవ్యాధి కుదిరిన నరుఁడు మంచమునుండి దిగును. అప్రాపంచికవ్యాధి యైన భక్తిరోగము నశించినవాఁడు మంచమెక్కును. ఇది

మాత్రమే భేదము. కాని రోగము కుదురుటమాత్రము నిశ్చయము. (ప్రకాశముగా, శ్రీనివాసా! నేను బోయెదను గాని పొమ్మనుటకు గురువులవారికిఁ గారణమేమి?

శ్రీ—కారణమునుగూర్చి నాతో నాతఁడు చెప్పియుండలేదు.

దేవ—నీ వేల యడుగక పోయితివి?

శ్రీ—నీవు నన్నడుగుదు వని తెలియక.

దేవ—నాకుఁ జెప్పకపోయిన నీ కైనఁ దెలిసియుండ నక్కఱలేదా?

శ్రీ—పొమ్మనువాఁడాతఁడు; పోవుదానవు నీవు. నడుమ కారణజ్ఞానముతో నాకుఁ బ్రయోజన మేమి?

దేవ—అయినను గారణ మేదని నీ వూహించితివి?

శ్రీ—ఇదివఱ కూహించి యుండలేదు.

దేవ—ఇప్పుడు యోజింపగలవా?

శ్రీ—ఏమున్నది? ఇట నీ వుండుట కిష్టత లేకపోవుటచేత-

దేవ—ఏల?

విప్ర—(తనలో) పొమ్మనుట నాకంతయిష్టమే కాదు. శ్రీనివాసుని ప్రోత్సాహ మెక్కువయైనది. ఆమెవలనఁ దప్పేమియుఁ గానబడదు. నిశ్చలభక్తియుక్తురాలు! అది రంగనామస్మరణముఁ జేయ వీణ మీటునట్లుగ నుండునది. అది యేమోకాని— కొలది దినములనుండి-నాకు—ఒకవిధమైయస్తిమితత—అభూతపూర్వమైనయొకయుత్సాహము—విచారపూర్వకమైన దీరాలోచన మొకపుడు—రేలఁ దఱచుగ నిద్రాశూన్యత— మనసు మఱియొకదారిని బోవుచున్నదేమో యను వెఱ్ఱిభ్రమము-అంతలోనేద్వైగుణీకృతభక్తిప్రబోధితగాఢతాండవ ప్రారంభము—తాండవించుచుండఁగనే యంతలో పరాకు—ఏదో పోయినట్లు వెదకుకొను బుద్ధి—చూపుల కొకవిధ మగు చల

సమః—తొట్రుపాటు—నిర్వర్ణింపలేని యొకవిలాసము—అభిముఖమార్గాభి గమనముగాక—తఱచుపార్శ్వగమనము—అంతలోనట్టె సంకోచము—ఏదియో వచ్చి యానందింపఁ జేయుననునొక పెద్దయాస-నాకింక నధోగతియే యని యకారణముగ లోనఁ గలిగినగుబులు-దేహమున కట్టె యట్టెయొకపు డుత్కర్షత-ఒడలు చల్లఁగ నుండియులోనఁ దాపము—నిష్కారణనిశ్శ్వాసములు— భక్త్యుద్రేకము లేనపుడు కూడ బాష్పనిష్యందము-మనసేమో యూఁగినట్లొకపుడు—గిరగిర తిరిగినట్లొకపుడు—పామువలె నడచినట్లొకపుడు—ఉత్సాహమునఁ బొంగునట్లొకపుడు—ఏదియో దాఁటినట్లొ కపుడు—లోనికి దిగిపోవుచున్నట్లొకపుడు—ముడుచుకొని ముడుచుకొని మూల దాఁగినట్లొకపుడు—నన్ను విడిచి యెక్కడికో పోయినట్లొకపుడు—గట్టిగఁబట్టుకొనఁజూచిన కొలది మంచుగడ్డవలెఁ బట్టు జాఱిపోవునట్లొకపుడు—ఏమి? ఇదియాధియా? వ్యాధియా? రెండునా? చిరకాలమునుండి కసపెట్టుకొని కష్టనిష్ఠురతల కోర్చిన శ్రీనివాసునిజూడ నేమో యుదాసీనత!—నిన్నఁగాక మొన్న వచ్చినదేవదేవిని జూడ నేమో యుత్సాహము! ఇందులకుఁగారణ మేమనుకొనను?

దేవ—శ్రీనివాసా! మాట లాడ వేమి? గురువులవారికి నాపై నిష్టత లేక పోవుట యేల?

శ్రీ—నీపై మిక్కిలి యిష్ట ముండుటచేతనే నిన్నుఁ బొమ్మనినారు.

దేవ—అదిన్యాయమేనా?

శ్రీ—అభక్తుల కది విరుద్ధము గాని భక్తుల కది న్యాయమే! భక్తుని కిష్టదార్థ మొక్క—శ్రీరంగఁడు తక్క నేదియు నుండఁగూడదు. ఇదిగో! నీవుగూడ భక్తురాలవే కదా? నీకీత త్త్వము నేఁ జెప్ప నేల?

విప్ర—అదియోఁడు దశుటచే నిట్టియనను భూతపూర్వావస్థలు కలిగిన వేమో యని—భ్రమపడి—మనశ్చలనము కాదు—భక్తి సంకోచము కాదు—ప్రాపంచికాభిముఖత కాదు—ఒకటి తలఁచుకొనఁ బోవ నొకటినచ్చుట—అనఁగ—రంగనిఁ దలఁచు కొనఁబోవ భక్తుని వైబుద్ధి పాఱుట—రంగనికి—రంగరంగా యనుచుఁ బూలుగ్రుచ్చుచుండ—భక్తురాలి వినయవిధేయతా గురుశుశ్రూషతాసద్గుణసంపత్తిని జూర్చి యకారణముగఁ దలఁపు వచ్చుట—ఒకటియన నేమి? మన నేమో రెండు భాగము లైనట్లును—దేహమునకు మును పెఱుఁగనిదిచిత్రసుఖ మేదియో కలుగుటచేత నీదేహము తత్పునరనుభవము నపే క్షించుచున్న దేమో యనుసందేహ మాత్మకుఁ గలుగుట చేత—ఎందుల కైన మంచిదని—ఆమె నిశ్చలభక్తురాలు కావున నామె కెక్కడనుండినను లోపము లేదని—ఇప్పటివఱ కంతబాధ యేదియు లేకున్నను—ముందు దేది కలుగఁబోవునో యని సందేహించి—కొంచెము దూరముగ నుంచిన సర్వవిధ ముల మంచిదే యని యెంచి—యామెను స్వగ్రామమునకు వేంచేయఁ బ్రార్థించితి నని చెప్పుమని శ్రీనివాసు నంపితిని. ఈసరి కామెతోఁ జెప్పి యుండును. ఆమె నన్నుఁ గూర్చి యే మనుకొనునో? లోప మేదైన నున్నయెడల నది నాది కాని యామెది కాదు. (ముక్కుమీఁదఁ జేవ్రైచుకొని) రంగ రంగ రంగా!రంగా! రంగనామస్మరణమును నిరభ్యంతరముగఁ జేసి కొనవలయును నను యిచ్చటఁ గూర్చుండి తదితరవిషయముల నన్నియుఁ దలఁచితిని. ఇట్టిమనోవికారమే—ఇట్టి యస్వాధీన చిత్తతయే యిప్పుడు ముఖ్యముగ నాకున్న బాధ. ఇది యెట్లు కలిగినను మాన్పుకొనక తప్పదు. అందులకుఁ బ్రశాంతత—

నిరుపహతస్థలస్థత—కావలసి యున్నవి. శ్రీనివాసుఁ డింతకా లముకుండి యున్నాఁ డనుమాటయే కాని యతనివారి యత నిది. అతఁడు నాకులేనట్లుగనే ప్రవర్తించినాఁడు కాని— యీ భక్తురాలు—భక్త్యుత్కంఠతచేఁ గాఁబోలు!—గురు సేవా మహోర్మిచేఁ గాబోలు—నాతో స్మరించి—నాతోఁ బాడి—నాతో నాడి—సర్వోపచారముల నాకుఁ జేసి— యనవరతముఁ గనిపెట్టి యుంటచేతఁ గాఁబోలు—నిట్టివిచి త్రావస్థ కలిగినది. కాన—ఈమెను దూరమున నుంచుట కంటెఁ బ్రస్తుతమున మార్గాంతరము గోచరింపదు. రంగరంగ రంగా! రంగ!

దేవ—నీవు నాతోఁ జెప్పవలసిన దేదియు లేదంటివి కాన నేను బోయి గురువులవారినే యడిగెదను.

శ్రీ—నీ వింక నాయనతోఁ జెప్పుకొనవలసిన దేమున్నది?

దేవ—ఏమియుఁ జెప్పకపోయిన సెలవైనఁ దీసికొనవలదా?

శ్రీ—ఆయనసెలవును మదీయముఖమున నీకుఁ బంపిరి కాదా?

దేవ—నీమొగము సెలవుతో నాకుఁ బనిలేదు. నే నిచ్చట నుండుట నీకు మొదటినుండియు నిష్టమున్నదా? నన్ను వదల్చుకొనఁగ నీవే యిట్లు మోసము చేయుచుంటి వేమో?

శ్రీ—నీబాధ నా కేమి యున్నది?

దేవ—గురువులవారి కేమున్నది?

శ్రీ—ఆయన కేదియో భక్తు ముండులచేతనే పొమ్మనినారు.

దేవ—అది స్పష్టపఱచుకొనుటకే గురువులవారిదర్శన మొనర్పవల యును.

శ్రీ—ఆయన నిన్నుఁ దీసికొని రమ్మని నాతో చెప్పియుండలేదు.

దేవ—తీసికొనిరావల దని చెప్పియుండకపోవుటచేత వచ్చెదను.

శ్రీ—అటులైన రమ్ము. నీవు వచ్చితి వని యాయనతోఁ జెప్పువఱకు నీ వాతని యెదుట నిలువక చాటున నుండుము.

దేవ—ఆతని కీడొంగభయ మేమి? నాకిదోబుచ్చియాటలేమి? నడుమ నీసంధాన మేమి?

శ్రీ—ఏమియు లేదు. కూడ రమ్ము.

(ఇద్దఱును విప్రనారాయణునియొద్దకుఁ బోవుదురు)

శ్రీ—నీవీతులసికోట చాటుననుండుము. నేను గురువుగారితో మనవి చేసెదను. మహాత్మా! దేవదేవి యిటకు వచ్చినది.

విప్ర—ఏదీ?

శ్రీ—తులసికోటచాటున నిలువఁబెట్టితిని.

విప్ర—నేఁజెప్పినయంశమును దానితోఁ జెప్పితివా?

శ్రీ—చెప్పితిని.

విప్ర—ఏ మనెను?

శ్రీ—ఏమున్నది. పోయెద ననెను.

విప్ర—సంతోషపూర్వకముగనే యనినది కద!

శ్రీ—ఎట్లో యొక ట్లనినది.

విప్ర—ఎటులయిన నేమి? పోవుట కావలసినది. సరే! కాని యిప్పుడు దీని నిటకేల తెచ్చితివి?

శ్రీ—ఆమెయే వచ్చినది.

విప్ర—ఏల?

శ్రీ—మీదర్శనముచేసి సెలవు తీసికొనుటకు

విప్ర—సెల విదివఱకే యీయఁబడినది. నాదర్శనముతో నేమి పని యున్నది? నేనొక్కరంగనిదక్క నితరులఁ జూడఁ దలఁచుకొన లేదు. అట్లు దృఢనిశ్చయుఁడ నైతిని. కావునఁ బొ మ్మని చెప్పుము.

శ్రీ—(దేవదేవియొద్దకుఁబోయి) మహాత్ముఁడు దర్శన మీయఁడు. వెడలి పొమ్ము.

దేవ—సరే! నీవుగురువులయొద్దకుఁ బొమ్ము.

(శ్రీనివాసుఁడు విప్రనారాయణుని యొద్దకుఁ బోవును.)

దేవ—(తులసికోటచాటుననే యుండి) దర్శన మీయ నంటిరా? మహాత్మా! కోరినది దర్శనమాత్రమే కదా! ఇంతలో మీకు జెడిపోవునదేది? నాకు లాభించునదేది? మొగము చూపుట తోడనే నాకు మోక్షప్రాప్తియగు ననుకొంటిరా? ఈమాత్ర మునకే యింతనిర్దాక్షిణ్యముగ నిరాకరింపఁ దగునా? చూచి నంతమాత్రమున మిమ్ముల నే నెత్తికొని పాఱిపోవుదు నను కొంటిరా? ఏల మీ కీసందేహము? భక్తశిఖామణు లగుమీ కీపట్టుదల యేల? దర్శనమే యీయరా? ఆఁ! ఎంతమాట! రంగని మొగము ప్రసన్నముగ నుండలేదని గిజగిజ కొట్టుకొని దేవులాడితిరే! జ్ఞప్తి లేదా? తారకమార్గమునకై మీ రొక నిదర్శనమును గోరి పడరానిపాటలు పడుచున్నారు. గదా? మీరే సర్వమని యెంచి మీవలననే కడతేఱవలయు నని నమ్మియున్న నాకు మీరు దర్శన మీయకుండ నిరాకరించిన నెంతక్షోభముగ నుండునో పరతంత్రతాకష్ట మెఱింగిన మీకే తెలియకపోవుట యేల! ఒక్కపూట రంగనియాలయములోనికి మిమ్ము రానీయకుండ నిరాకరించినచో మీమన సెటులుం డునో? ఇదియేనా మీభూతదయాపాటవము! సర్వాసము లని, జ్ఞానసంపన్ను లని, కరుణాపరిపూర్ణులని శేషగుణసనాథు లని మిమ్మాశ్రయించితినిగాని యధికార తారతమ్యమును జూతు రనుకొంటినా? ఆశ్రితజనేంగితజ్ఞానశూన్యతగ నిరాకరింతు రను కొంటినా? క్రూరమనస్కతచేఁ బొమ్మందు రనుకొంటినా?

పాదములపైఁ బడినదానిని, బ్రిబలగర్వాతిరేకమున మొగ మైనఁ జూపక పాఱవోలుదు ననుకొంటినా? అందఱిమొగము లందుకంటె మీతిరుముఖమందు లావణ్యాదు లధిక మని చూడ వచ్చితినా! ఈమాత్రపు మొగమునకు దృష్టిదోషము తగులు నని నిరాకరించితిరా! మీ క్రేగంటిచూపులతో నా పాపము లన్నియు నొకమాఱు భస్మములగు ననియే చూడ వచ్చితినా! అందులకే వచ్చియున్నను మీరిట్లు మొగమోటమి లేక నిరాకరింపఁ దగునా! దర్శన మఁట! ఈయరఁట! ఏమో! దర్శన మేమి తత్త్వజ్ఞానమా! కైవల్యమా? పరమపదమా? భక్తులకు దర్శన మిచ్చి సంతసింపఁ జేయలేనిమీతిరుముఖ మండల మిఁకెందులకు? రంగమూర్తియే సమస్తజనసందర్శన ప్రీతుఁడై, యఖిలభక్తవత్సలుఁడై, సర్వసులభుఁడైన దుర్లభ మైన పరమపదమును సహితము భక్తులకిచ్చెద నని శపథము చేయునట్లు తిరుత్తుళ్ళాయిని శిరముపై ధరించి యుండ రంగ భక్తులగుమీ కీవ్యర్థ్య స్తచింతలేల? చతుష్పాదజంతు వగు గజేంద్రుఁడు భక్తితో భూమినుండి కేకలు వేయ, వైకుం ఠమునుండి, భార్యతోఁ జెప్పక, పెరియతిరువడిను చూడనే చూడక, పైన నుత్తరీయమైన నున్నదో లేదో యెఱుఁగక, పాదచారియై పరుగు లిడుచు ధావనావేగమునఁ గట్టుబట్ట యట్టె చలించుబొజ్జనుండి జారిపోవ, నిలువఁబడి బిగించుకొనిన నాలస్యమగు నేమో యని చేతితోడనే కుచ్చెళ్ళు సడలిపో కుండఁ బట్టికొనుచు నెందులకో యేమి చేయవలయునో కూడ నెఱుఁగని మహోత్కంఠచేఁ దనకొంప మునిఁగిపోయినట్లు, తనపుట్టి మునిఁగినట్లు శ్రీమహావిష్ణువు వచ్చి తనదివ్యముఖార విందసందర్శనసేవ గజేంద్రునకు సాయించియుండ, నట్టివిష్ణుని

పాదదాసు లని, భక్తులని, ప్రపన్ను లని లోకముచే నెన్నఁబడుచుండుమీరు—అట్టిమీరు— అయిదుమాసములనుండి మిమ్మాశ్రయించి, సేవించి, పూజించి, మిమ్మేమహావిష్ణునిగ నమ్మికొని తరింపవలయు నని యెంచి—తులసికోటచాటున నిలువఁబడి "దర్శనమో, దర్శనమో" యని పెరుమాళ్ళుకోవెల చుట్టు గోపురములు ప్రతిధ్వను లిచ్చునట్లు మొఱ్ఱో యని యఱవ—చెక్కు చెదరకుండ—నలుసంత యావేగమైన నొందక—పాపము! అస్వతంత్రురా లెందులకు దర్శనము వాంఛించుచున్నదో తెలిసికొంద మను క్రొంచెముచింతయైన లేక—"దర్సనమునకు వీలు లేదు" అని యాహా! ఆహా! వార్తనంప సాహసించితిరి! సెబాస్! ఇది మీకే తగును! మీమొగమువంటిమొగములు లోకమున నెన్నికోటులు లేవు. తుచ్ఛులగు విటాధముల మొగము చూడనొల్లక మీమొగమం దంతకంటె దైవకటాక్షవిశేషమున నేదియో కించిదాధిక్య మున్న దనియేకదా యిచ్చుటకు వచ్చితిని. ఆమాత్ర మాలోచించుకొన నక్కఱ లేదా?

విప్ర—రంగరంగరంగా! దాని నిచ్చుటకు రమ్మని చెప్పుము.

శ్రీ—వలదు. వలదు. అందువలన నేమి ప్రయాస మగునో?

విప్ర—ప్రయాస మే మున్నది! ఆమె చెప్పినట్లు, దర్శన మిచ్చుటలో మహాకష్ట మే మున్నది! ఇచ్చుట యిచ్చుట యనుటే కాని యేమి యీవలయును? తలఁ దీసి యామెచేతిలోఁ బెట్టవల యునా! మొగ మెత్తుకొనియొకనిముస ముండలేనా? కన్నులు తెఱచుకొని యొకయింతసే పుండలేనా? కష్టమేమియు లేదు. వైష్ణవులమైన మనకిది తగదు. ఆమె మాటలు సహేతుకము లుగ నున్నవి.

శిష్య—దేవా! నామనవి వినుఁడు. వలసు. ఎదుటకు వచ్చినతరువాత నామె తిరిగి పోదు. మీరు కఠినముగఁ బొమ్మన లేరు.

విప్ర—అదేమి మాట! ఇదివఱకు నేను బొమ్మనకుండనే నీవు చెప్పితివా? తిరిగి పోదని యెట్లు చెప్పఁగలవు? దర్శనమునకు రావలదనిన నిన్న మాటలు తులసికోటచాటున నిలువఁబడియే యాడినది కాని యెదుటఁ బడినదా! తల నెత్తి వంచియైనఁ జూచినదా! అట్టి గుణవంతురాలు—

శిష్య—అయ్యయ్యో! అది కనఁబడునో లేదోయని యట్టె మీరు చూచుచున్నారా?

దేవ—అయ్యా! మహాత్మా! ఇంకను దర్శన మీయరా? నావలన పాపమేమికలిగెను? విటుల కీదేహము నమ్మకొనకుండ మీకర్పణము సేయుట పాప మయ్యెనా? దుష్కృతిభూయిష్ఠమైన యిల్లువదలుకొని మీపుణ్యావనమునకు వచ్చుట పాప మయ్యెనా? త్రాగుడును మాని తులసీతీర్థమును పుచ్చుకొనుట పాప మయ్యెనా! జారులలెంపలు వాయించుట మాని వీరవైష్ణవుని పాదము లొత్తుట పాప మయ్యెనా! బూతుకూఁతల మాని పాశురములఁ బఠించుట పాప మయ్యెనా! మిరియాల పూసల పేరులు పారవైచి తామరపూసల పేరులు వహించుట పాప మయ్యెనా! చీనాంబరము వదలి చినుగుల జేగురుగుడ్డను గట్టుకొనుట పాప మయ్యెనా! మీకుఁ దిరుమంజన మొనర్చితినే! మీకాళులు గడిగి తీర్థముగఁ ద్రావితినే! మీబట్ట లుదికితినే! మీయెంగిలిమెతుకులు శ్రీమహావిష్ణుప్రసాదమని కనుల కద్దుకొని భుజించితినే!—ఇట్టిసేవలో బదునాలుగవభాగము శ్రీరంగమూర్తికే నేను జేసియుండినయెడల నాతఁడు— నన్ను— నన్ను—నిష్కపటహృదయనైన నన్ను—దిక్కుమాలిన యే

కాకిని నైన నన్ను—అనన్య శరణ్యనైననన్ను— ఆపన్ననైన నన్ను—ఆఁ! ఆఁ! ఇట్టినన్ను—

విప్ర—భక్తురాలా! ఇటు రమ్ము.

దేవ—(పరుగునఁ బోయి) ఇదిగో! వచ్చితిని. శ్రీవిప్రనారాయణ మహాగురవేనమః (చుట్టుతిరిగి సాష్టాంగ మాచరించును)

విప్ర—అడియేన్ దాసోహం. (తనలో) ఈమె నా చుట్టు నెట్లు గిరగిర దిరిగెనో నాచిత్త మట్లే తద్గమన మనుసరించి లోన స్వప్రద క్షిణము చేసెను.

శ్రీ—(తనలో) ఇక్కడినుండి యిఁక నేను బోవలయును, గానియీరా కాసిముండ పోదు. గురువుగారికి రంగనిపై భక్తి పోవలయును గాని దీనిపై నభిమానము పోదు.

దేవ—స్వామీ!

శ్రీ—ఇంక స్వామి యెందులకు? దర్శన మైనది కాదా? పొమ్ము.

దేవ—దర్శన మైనది. కాని సెలవు పుచ్చుకొనుట యయినదా?

శ్రీ—ఇచ్చట కాయన కేమున్నది? పుచ్చుకొనుటకు నీకేమి కావల యును? దయయుంచి వేగ దయచేయుము.

దేవ—ఏమి మహాత్మా! నేను సెలవుతీసికొని పోవలసినదేనా?

విప్ర—భాగ్యము! (తనలో) రంగ రంగ రంగా! రంగ!

శ్రీ—సరి. సెలవైనది. నడు! నడు!

దేవ—ఊరక తొందర పడెద వేమి? మీ కిష్టము లేనపుడు పోక యిచ్చటనే యుండెద ననుకొంటివా?

విప్ర—శ్రీనివాసా! అది పోదని చెప్పితివి కాదా? మనదొడ్డి దాని కేమి కాణాచియా? మనమేమి దానికి బంచభక్ష్యపరమా న్నములతో నాదరింపు లిడుచుంటిమా? మనము దానిచేత దాస్యము చేయించుకొనుటయై తక్కనది యానడుమ రోగ

ముంతో బడి పోయినప్పుడైనఁ గాసంతయుపచారమొనర్చి తివా? ఇల్లును, దల్లిని, దోఁబుట్టువులను విడిచిపెట్టిన దిట్ట మనల నేల విడిచిపెట్ట లేకుండునని యెంచితివి?

శ్రీ—ఇప్పుడు దేవదవాసి నైచ్యానుసంధానము, స్వదూషణమును దానికిఁదగినంత యుపచారములు చేయలే దనుటనుగూర్చియా?

విప్ర—రంగ రంగ రంగా! ఎట్లు గ్రహించితివి! భక్తురాలా! నీవు మాకంటె గుణసంపన్నురాలవు. మాకంటె వైరాగ్యా ధిక్యయుక్తురాలవు. మాకంటెనిశ్చలచిత్తవు అయిన నేమి? సంసారులలో నొకనితో నొకఁడు కలసి విడిపోవుట యెట్లో భక్తులలోఁ గూడ నట్లే. మాయందు దయ యుంచి నీవు దయచేయుము. అన్యథా యెంచకుము. (తనలో) రంగరంగ రంగా! ఏదో యొకటి శీఘ్రముగఁ దెగ తెంపు చేసికొనినఁ గాని మనస్సు శాంతిగ నుండదు. అబ్బ! రంగరంగరంగా! రక్షింపు. అపరాధుఁడను. అవగుణుఁడను. చంచలచిత్తుఁడను. రంగరంగరంగా!

దేవ—ఇఁక బోవలసినదేనా?

శ్రీ—కిక్కురుమనకుండ—

దేవ—రంగరంగరంగా! రంగా! (ఏడ్చును)

విప్ర—అయ్యయ్యో! నిష్కారణముగ నిర్దోష నేడ్పించితిమి గదా! శ్రీనివాసా! నాగుండెలు తల్లడిల్లుచున్నవి. గాని నీఁక నేమవవలదని చెప్పుము.

శ్రీ—మన కేవఁడు చెప్పినయ్యా!

విప్ర—అట్లాడెద వేల? మన కంతపట్టరాని చింత యేమున్నది? ఏమో! కొలఁది దినములనుండి కన్నులయెదుట తిరిగినది గదా యని కాని—ఇంతకుఁ బరమయోగ్యురాలు! పరమ శాంతాత్మురాలు!—

దేవ—రంగరంగరంగా! (ఏడ్చుచున్నది)

విప్ర—రంగరంగా! ఎంతపాపము! నాకు బుద్దివచ్చిన దాదిగ నేను పెట్టిదో వినలేదు. అట్టిచో నాతులసీవనములోనే, నాకన్నుల యెదుటనే నాకు సర్వోపచారము లొనర్చినరంగదాసురాలే కఠినముగు నాయాజ్ఞమూలముగనే యేడ్చుచుండ నేను సహింపఁగలనా? శ్రీనివాసా! నీవు పోయి యూరకుండు మని చెప్పుము. లేదా నే నెచ్చటికైనఁ బోదును.

శ్రీ—(తనలో) ఈతఁ డిటనుండి పోయిన మంచిదే కాని కదలనిచ్చిన నీతనివెంట యీమె పడిన మహాప్రమాదము సంభవించును. (ప్రకాశముగ) మహాత్మా! తాము మఱియొకచోటికి దయ చేయనేల? దేవదేవి! ప్రశాంతముగు నాశ్రమవనమును రోదనమున నపవిత్రమును జేయుచున్నావు పో!పో! శీఘ్రముగఁబో!

దేవ—(కోపమును నటించుచు బిగ్గఱగ) పోకపోవుదునా? పోకపోవుదునా? ఇదిగో (వేగముగ నడచును)

విప్ర—(తొందరతో) శ్రీనివాసా! ఆఁగు మని చెప్పుము. ఈమె వైఖరిఁ జూడ భయముగ నున్నది. ఎచ్చటికిఁ బోవునో శీఘ్ర మడుగుము.

శ్రీ—ఎచ్చటికిఁ బోయిన మన కేమి మహాత్మా! పిశాచమును వదలనీయరా?

విప్ర—శ్రీనివాసా! నీకుఁ దెలియదు. దేవదేవీ! ఎచ్చటకుఁ బోఁదలఁచితివి?

దేవ—ఎచ్చటకుఁ బోయెదనా? రంగరంగరంగా! మీయొద్దనుండి నిష్కారణముగ మీరు గెంటివైచుటయే కాక నాప్రియత్నమును విఘ్నముగూడఁ జేయున ట్లపశకున పుమాటలఁగూడ నాడుచున్నారా?

విప్ర—చూచితివా? శ్రీనివాసా!

దేవ—స్వామిా! ఎచ్చటకుఁ బోవలయునో చెప్పవలయునా? స్వామిా! శిష్యున కాచార్యాభిమానమే కాని యాచార్యు నకు శిష్యాభిమాన మక్కఱ లేదా? ఆహా! దిక్కుమాలిన యీబొందిలో నున్న యాత్మ నెంత సంతోష పెట్టితివి? చాలు; చాలు! ఎక్కడకుఁ బోనుంటినో చెప్పవలయునా? మీాపాదసేవ నాకు లభింపదు. గాని నాకష్టము లెట్లో కడ తేఱకపోవునా? కడుపుచల్లని కావేరమ్మ లేదా? శ్రీరంగ మూర్తి కిన్నిగోపురమండపాదులు గట్టుటకు భక్తు లిన్ని కోటులరాళ్ళు సంపాదించినప్పుడు నాగొంతుకకుఁ గట్టుకొనుట కంతరాయి తెచ్చుకొనలేక పోవుదునా?

విప్ర—వింటివా? శ్రీనివాసా! నామూలమున నామె కెంతపర్యం తము వచ్చినదో?

శ్రీ—ఆమెమూలమున మీాకు వచ్చినంతమట్టున కింక రాలేదు లెండు. ఆత్మహత్యలో మొదట నశించునది శరీరము. భక్తిభ్రష్టతలో ముందుగ నశించునది యాత్మ. లోకము మీాకొఱకు విచార పడవలసిన స్థితికి రానై యుండ మీా రామె కొఱ కేల విచారింతురు?

విప్ర—రంగరంగరంగా! నాకు భక్తి నశించుచున్న దనుచుంటివా?

శ్రీ—నే ననుట యెందులకు? మీాకుఁ దోఁచుట లేదా?

విప్ర—నీ వాలోచింపకుండ నేల మాట లాడెదవు? మనము పొమ్మను టచే నామె మరణింపఁబోవ నున్నది. కాన భక్తాభిమాన మున, భూతదయాప్రోత్సాహమున, ప్రత్యేకదుష్కార్యారంభ విఘ్నకరణాపేక్షచే నట్లంటినిగాని, లోకములో నందఱికంటె నామె నా కెట్లధిక యగును? నాకన్నుల యెదుట జగత్తున

నెందుకు స్వాభావికమరణము నొందలేదు? ఎందుకు బలాత్కార మృతుల నొందలేదు. వారందఱికొఱకు నేను విలపించితినా? మాతలిదండ్రులు నా యెదుటఁ బరమపదించినపుడు నేను కంటనీరైనఁ బెట్టితినా? అంతనిర్లిప్తతఁ గాలక్షేపము సేయుచున్న నేను దీని చావుకొఱకు వగ నొందుదు నను కొంటివా? నేను జచ్చినఁగాని నారంగభక్తి నశించునా? అది చచ్చిన సరే. లోక మంత వినాశ మందిన సరే.

శ్రీ—(తనలో) పాపము! దాని మరణ మీ మహాత్మునకు లోకవినాశముగఁ దోఁచుచున్నది కాఁబోలు! స్త్రీసాన్నిధ్యమువలన బుద్ధిపూర్వకముగ నీతనితోఁ గలిగిన మమతను భూతదయామాత్రమని, కష్టదర్శనాసహిష్ణుత యని, పరిచయసంజాతమని యీతఁడు భ్రమపొందుచున్నాఁడు. పాపము! ఋష్యశృంగునివంటివాఁడు! అయిననేమి? చెడిపోవనున్నాఁడు.

వి—వింటివా? శ్రీనివాసా! నా కిచ్చట రంగేశసేవ తక్క నితరమేమియు నక్కఱలేదు. అక్కఱ లేదు. రంగరంగరంగా! (లెంపలు వైచుకొనును)

శ్రీ—(తనలో) ఇప్పటివఱ కింక స్వహస్తములతోఁ గొట్టుకొను నదృష్టము పోలేదు.

విప్ర—రంగరంగరంగా! రక్షించు; రక్షించు! చంచలచిత్తమునఁ బడుకొంటిని—కఠినహృదయతను గటికవానిని—రంగరంగరంగా!

శ్రీ—(తనలో) భాగవతోత్తమ మర్యాదకై తిట్టుకొనెడు తిట్టులు క్రమక్రమముగ సార్థకతలోనికి వచ్చుచున్నవి! (ప్రకాశముగ) నేను బండుకొంటి లోకచివరనుండు పేనను. కటికవానిపృష్ఠము క్రింది కొయ్యదిమ్మను. నారాయణ! నారాయణ!

విప్ర—వ్యర్థుండను. అనర్హుండను. నిరుపయోగుండను రంగరంగరంగా! (లెంపలు వైచుకొనును.)

శ్రీ—నేను గరిధూపమును, కుంజపోతము, గబ్బిలపుంబోతుకు, నారాయణ! నారాయణ! ఇదిగో! భక్తులు! ఆత్మహత్య మాట పరాకుపడి మాయబుసులు వినుచున్నది కాంబోలు! నడు; నడు!

దేవ—నీ కెందులకుం గులికెదవు? చచ్చినకంటె నెక్కువపని జరుగక త్రీజదు. భాగవతోత్తమా! తినుయొద్దకు శుశ్రూషనిమిత్తము నన్నుం బంపినభక్తిసారునికి నేను దర్శించు నెడల మీ కామహాత్మ్యమునుం జెప్పవలసినమాట లేమైన నున్న యెడలం జెప్పుడు.

శ్రీ—(తనలో) అహా! బొంబాయిలోం బరసుపడ మేగ సాటివి! నీ కామహాత్ముని దర్శనమే! సెబాస్! ఎంతదాన వైతివి! ఏ తెలకులవానితోడనో! ఏ దూదేకులసాహెబుతోడనో! ఏకుంభీపాకమునసో, ఏయినుపగానుగ నడుమనో?—

విప్ర—ఈమె చతుర్వింశసంభూతుండగు మహాభక్తవరునిచే నిచటికిం బంపంబడిన దనుమాట మఱచిపోయితిని! అహా! గొప్ప ప్రమాదము! ఇప్పుడెట్లు? దీనిని వదలుకొందుమా? పూర్వాచార్యశాసననిరాకరణ మొనర్తుమా? రంగరంగ రంగా! క్షమింపుము. నిన్ను సంతతము తలంపకపోవుటయే కాక యీ దుర్మార్గుడు నీ భక్తశిఖామణుల మర్యాదలు గూడం దీసివైచుచున్నాండు. రక్షించు రంగరంగరంగా! రంగా!

దేవ—బ్రతికియుండి పావుగడియకిందవఱకు బానిసతన మొనర్చితిని గాన నీ భక్తురాలను జేతివిూదుగం బంపందలంచుటకు సాహ

సించితిరి కాని మీకు మంచిగాని చెడ్డఁగాని చేయక మీ జోలికే రాక చిరకాలముక్రిందట వైకుంఠగతుఁ డగు మహా చార్యపురుషుని మఱల నిట్లేల చంపెదరు ? భగవంతుని కార్యము భక్తరక్షణము కాఁగ భాగవతుని కార్యము భక్తమారణమా ?

విప్ర—శ్రీనివాసా ! నా కీమాటలు వినఁ జైతన్య మెడలుచున్నది ! ఈమె యిచ్చటికి వచ్చుటలో రంగదాసోత్తమాజ్ఞయే కాక రంగనియాజ్ఞకూడను. ఇఁకను దాని నుపేక్షింపఁ దగదు.

శ్రీ—మహాత్మా! తిరిగి యిట్లాడెద రేమి? ఇది యంత దొంగవేస మని నేను మీతో నెన్నిమాఱులు చెప్పియుండలేదు. మీ కేల జ్ఞప్తిలేదు?

విప్ర—నీవు చెప్పినది నచ్చకపోవుటచేఁ గాబోలు! అయినను దొంగ వేసమువేసిన మోసకత్తె యిచ్చటనే యున్నది కాదా? ఆమె దొంగతన మామెచే నొప్పుకొనఁజేసి పొమ్మను.

శ్రీ—వలదు. వలదు. ప్రాణము విసిగి అదియే పోవును.

విప్ర—అట్లు కాదు! నీకు దోఁయదు. నీవు దానిఁగూర్చి యూహిం చినదంత కేవల మూహాము అది సత్య మని చెప్పుకంటె నసత్యమని చెప్పుటకుఁ గారణము లధికములుగ నున్న ట్లున్నవి. నీయూహ యసత్యమై, యది భక్తురాలే యగు నెడల మనకు భక్తసంహారణపాపము, భగవద్ద్రోహపాపము, భాగవతాజ్ఞానిరసనమహాపాపము నిశ్చయముగ వచ్చును. బాగుగ నాలోచించుము.

శ్రీ—కాన నామెను బిలువక తప్పదా?

విప్ర—న్యాయముగఁ దప్పించుకొనుటకు దారి కనఁబడదు.

శ్రీ—(తనలో) ఆహా! ఎంత ప్రారబ్ధము సంభవించెను. (ప్రకాశముగ) దేవదేవీ! ఇటు రమ్మా.

దేవ—పో! పో! నన్నుఁ బిలుచుటకు నీ వెవఁడవు?

విప్ర—భక్తురాలా! నేను బిలువు మంటిని. క్షమింపుము.

దేవ—మహాభాగ్యము. ఇదిగో! వచ్చితిని.

విప్ర—నీవు చెప్పఁదలంచిన దేదియో చెప్పుము.

శ్రీ—దేవదేవీ! ఇచ్చటకు నిన్నుఁ బొమ్మని భార్గవులు స్వప్నమున సాయించిరని నీవు చెప్పినమాట ప్రథమ కల్పితము. రంగనిముఖ మప్రసన్నముగనున్నదని విచారించుగురువులవారిమాటలనునీవు ప్రచ్ఛన్నముగ విని స్వప్నసాక్షాత్కృత శ్రీరంగరంగదాజ్ఞ ప్రబంధానల్పకల్పవల్లిని నీవు మఱొకదాని నల్లితివి. నా కవి నమ్మకములేదు.

దేవ—నీవునీతండ్రికిఁ బుట్టితివని నీకు నమ్మక మున్నది కద!

శ్రీ—మహాత్మా! ఎందులకు మీ కీబాధ! నాకీతిట్లు! ఋజువు కాఁద గనియంశము లెట్లు ఋజువుపడఁగలవు? పూర్వాపరశ్చాదంశ ములఁ బట్టి కొన్ని సత్యము లని గ్రహింపవలయును. అటులే కొన్ని యసత్యములుగ గ్రహింపవలయును. కాని సిదర్శన మెట్లు చూపవచ్చును?

విప్ర—కొన్ని సత్యములుగఁ గొన్ని యసత్యములుగ గ్రహింపవలయు నని యంటివే? ఇది సత్యముగనే గ్రహింపఁదగిన దేమో?

దేవ—గ్రహింపఁదగిన్దయావశ్యకత లేదు. మీశిష్యుఁడనిన ట్లన్నియు నసత్యములే. మీకు స్వప్నములు లేవు. తిరుభక్తిసారభగ వానులు లేరు. శ్రీరంగదేవుఁడు లేఁడు. సరియేనా!

విప్ర—రంగరంగరంగా! రంగ! ఎంతపాపము! (చెంపలువైచుకొనును) ఎంతపాపము! మేము నాస్తికుల మగుదుమా?

శ్రీ—(తనలో) వేశ్యాదాసు లగుటకంటె నట్లగుటయే మంచిది. అందులో మతము లేకున్న నీతియైన నున్నది.

దేవ—నాస్తికులు మఱెక్కడనో యుందు రనుకొంటిరా? ఇక్కడనే యుందురు. నాస్తికు లనఁగ మఱెవ్వరో యనుకొంటిరా? వారును నరులే. నాస్తికులకుఁ గొమ్ములు తోఁక లుండు నను కొంటిరా? వారు మీవంటివారే. నాస్తికత యనఁగ మఱెట్టిదోనా! ఇట్టి చిత్తస్థితియే.

విప్ర—భక్తురాలా! నాకు రంగ భక్తియే క్షయించిన దని లోలోపల నడికియేడ్చుచున్న నన్ను నాస్తికుఁడని పిలిచి చంపివేయకుము. నీచరిత్రస్వచ్ఛతనుగూర్చి యవిశ్వాస మీనాఁటనికిఁ గాని నాకుఁ గాదు. రంగనిపాదములతోడను. నీవు పరిశుద్ధురాల వని—పరమభక్తురాలవని—నాకుఁ బూర్ణమైననమ్మికయు. కాని నా పరిభ్రమమననో నాకుఁ దెలియనిమఱేదో కారణముననో కాని నాకు రంగభక్తిలోఁ జలనము కొంత గలుగుచున్నది. మహాభక్తురాలవగు నిన్ను శ్రీరంగమూర్తి నాకంటె నెక్కువగఁ గటాక్షించుటచే నాకట్లు తోఁచుచున్నదేమో? లేక నేనెట్టుఁ గనిరోషముచే నాపై రంగని కాగ్రహము కలిగినదేమో? ఎటులైన నిప్పుడు భక్తిలో నీకు లొంగిపోయితిని. రంగ కృపాధికతచే నీవు కృతార్థతను బొందఁగలవని నాయసూయారహితమైన యభిప్రాయము.

దేవ—సరే. అయ్యా! శ్రీనివాసా! నాయాగమనముఁగూర్చి నీతోఁ జెప్పిన శ్రీరంగభక్తిసాంబాచార్యప్రసంగ మంతయు నీకు నమ్మకము లేదు. కాన నది యంతయు నసత్య మనుకొందము. కాని—ఇటుచూడు—నేను నీ కెదుటఁ గనఁబడుచుంటినా?

శ్రీ—కన్ను లింక నున్నవి కాదా?

దేవ—ఇట్టిదుర్భాష లాడిన నీ కది యాశ్చర్యమే—కాని, యది యటుంచుము. నేను నీవలెనే నరకోటిలోదాన నను నమ్మకము నీ కున్నదా?

శ్రీ—ఆ!

దేవ—నేనిక్కడి వాఁడను గాక యెక్కడినుండియో వచ్చితి నను జ్ఞప్తి నీ కున్నదా?

శ్రీ—సందేహ మేమి?

దేవ—ఇక్కడ నా కొక యద్దెయిల్లో సొంతయిల్లో యుండు నని నమ్మఁగలవా?

శ్రీ—కలదు.

దేవ—నే నొకతల్లిగర్భమునఁ బుట్టినవాఁడ నని విశ్వసింపఁగలవా?

శ్రీ—ఆ!

దేవ—నాకు సోదరులు, బంధువులు మొదలగువా రుండిరనునమ్మక మున్నదా?

శ్రీ—అది నా కెట్లు తెలియును?

దేవ—పోనీ! మీరు నాకు సోదరులుకారుగద? బంధువులుకారుగద?

శ్రీ—కాము.

దేవ—నే నిటకు రాకమునుపు నన్ను మీరు, మిమ్ము నేను నెఱిఁగి యుండ లేదుకద?

శ్రీ—నిన్ను మే మెఱుఁగము. నీవు మ మ్మెఱుఁగుదువేమో?

దేవ—సరే. నే నెఱుఁగుదును. ఐహికసంబంధముచే మీపై నా కభిమాన ముండఁదగిన కారణము లేమైన నున్నవా?

శ్రీ—లేనట్లే.

దేవ—సందేహింతు వేల? ఏకశాఖాసంబంధముగాని, ఏకగ్రామనివాస సంబంధముగాని, సంతతసందర్శనసంబంధము కాని, ఏకమిత్రగ్రహణసంబంధము గాని, మఱియేసంబంధము గాని మీకు నా కున్నదా?

శ్రీ—లేదు.

దేవ—సరే మీరు కట్టుకొన్నవి కాషాయలే కద?

శ్రీ—ఔను.

దేవ—నేఁ గట్టుకొన్నది జేగురుపాతకాదా?

శ్రీ—ఆఁ!

దేవ—ఇంతకంటె మంచిబట్ట దొరుకక కిది కట్టుకొన లేదు కద?

శ్రీ—లేకపోవచ్చును.

దేవ—మీమెడలోనివి నా మెడలోనివి తులసిపూసలపేరులేనా?

శ్రీ—ఆ!

దేవ—చిన్న మెత్తుబంగారము నాఁడుదానవయ్యు మెడఁగట్టుకొనుటకు దొరకకపోవుటచేఁ గాదుకద?

శ్రీ—కాదు.

దేవ—మీ రేకభుక్తిదీక్షలేకద?

శ్రీ—ఔను.

దేవ—నేనో?

శ్రీ—నీవును.

దేవ—ముష్టి యెత్తుకొనినను రెండవపూట మెదుకులు దొరుకక పోవుటచేత కాదుగద?

శ్రీ—కాదు.

దేవ—మీరు బ్రహ్మచర్యవ్రతనిష్టులే కదా!

శ్రీ—దైవకటాక్షముచే నిప్పటివఱకు—

దేవ—నేనో?

శ్రీ—నీపూర్వపుతగులాటములు మే మెట్లు గనిపెట్టగలము?

దేవ—నే నిచ్చటకు వచ్చినతరువాతనైన నాబ్రహ్మచర్యవ్రతదీక్షలో భంగ మేమైన మీరు గాంచితిరా?

శ్రీ—లేదు.

దేవ—నేను యౌవనవతి నైనట్లు నీకుఁ గనఁబడుటలేదా?

శ్రీ—నే నది యెట్లు చెప్పఁగలను? పొంగలిగంగాళమువలె నున్నావు.

దేవ—సరే. నేను గురూపను గానట్లు నీకుఁ గనఁబడుచుంటినా?

శ్రీ—సురూపలను చూచి యేడ్చితినా యేమి!

దేవ—పోనీ! నే నింద్రియలోలతగలదాన నైనయెడల నాకుఁ దగిన మగని నెవనితో చూచుకొనఁగలరా?

శ్రీ—వైష్ణవాలయమున్నచోట మగలకు నాలకాకులకు లోటేమి?

దేవ—నేను మనగురువుగారికి సర్వోపచారములను జేయుచుంటినా?

శ్రీ—అందులకు గురువులేసాక్షులు.

దేవ—తుచ్ఛమైనయీశరీరమును పోషించుకొనుటకే నే నీ దాసితనము కొప్పుకొంటినా?

విప్ర—రంగరంగరంగా! ఎంతమాట!

దేవ—శ్రీనివాసా! నీవు మాటలాడ వేమి?

శ్రీ—గురువుగారు ప్రత్యుత్తరమును సాయించిరికాదా?

దేవ—ఉండుకొనుటకు నూగ్రామమున నిండ్లు లేవా! తోముకొనుట కంట్లు లేవా? పట్టుకొనుటకుఁ గాళ్లు లేదొరుకవా? సేవించుటకు నరులే దొరుకరా? ఇట్టినీచత కొడఁబడి పరమనీచమైనయీ దేహమునే పోషించుకొనఁదలచినయెడల నింతకంటె సుఖకరమగుసేవావృత్తి మఱియొకచోట లభింపఁగలదు కద!

విప్ర—రంగ! రంగ! ఒకనికి దాస్య మొనర్చినదనుక నీ కేమి?

దేవ—శరీరపోషణమునకుఁ గాక—శరీరముకంటెభిన్నమైన యొక తత్త్వమును బోషించుకొనుటకు మనగురువులవారికి నీవలెనే యిల్లు వదలి వనముఁజేరి కాషాయధారణము జేసి బ్రహ్మచర్యవ్రతమొనర్చి యైహికానందము కొఱకు నీకంటె నెక్కువ సేవఁ జేసితినని స్పష్టపడుచున్నదా?

విప్ర—రంగరంగరంగా! చెప్పవలసిన దేమి?

దేవ—శ్రీనివాసా! నీవు రెండు కూజులనుండి యామోదించుటలేదేమి?

శ్రీ—గురువులవారి యామోదనములు హెచ్చగుటచే నానోరు పడిపో యినది.

దేవ—శరీరభిన్నమైన తత్త్వమాత్మయేకద?

శ్రీ—ఆ!

దేవ—ఆత్మను సుప్రసన్నముగ, బరిశుద్ధముగ, క్షేమగుణసంపన్నముగ గురుజనానురాగయుక్తముగ జేసికొనువాడెవడు?

విప్ర—రంగరంగరంగా! వాడేకదా భక్తుడు!

దేవ—అట్టిచో నీవు భక్తుడవు? నేను కాంగదా?

విప్ర—రంగరంగరంగా! ఎంతమాట!

దేవ—అట్టిభక్తుడు [illegible] యైనప్పుడు దాని నేమందురు?

శ్రీ—భక్తుని భాగ్య[illegible]మందురు.

విప్ర—ఆమె [illegible] హేతుకముగ మాటలాడుచుండ నీవు పరిహాసిం చుట [illegible]

శ్రీ—ఈమె చెప్పినదంతయు నసత్యమని నాకు లోన బ్రబలముగ దోచుచున్నప్పటికి నీమెకు దగిన ప్రత్యుత్తర మీయలేని యశక్తివలన గలిగిన దుర్జనత్వమున బుట్టిన వెఱ్ఱినవ్వును వెళ్ల డించితినిగాని యామెను బరిహాసింతునా!

దేవ—మహాత్మా! వింటిరా? కార్యకారణభావ మంతయు నీతడొప్పుకొనినాడు. కాని పర్యవసానమునుగూర్చి నమ్మడట! దీనిపేరు తలతిక్కకాదా? దీనిపేరు నాస్తికతగాదా?

విప్ర—అతనిజోలి నీకెందులకు? నీవు మహాభక్తురాల వని నాకు సంపూర్ణవిశ్వాస మున్నది.

దేవ—భక్తురాలికి బహుమానము పరిత్యాగమా! ఈతడుకూడ భక్తుడేకదా? భక్తియే పొమ్మనుటకు గారణమగునెడల నితని నేలపొమ్మనలేదు.

శ్రీ—అనని వేళ దాఁచినదా? మీరిద్ద ఱొకటియే యగుదురు. నన్నే వేఁడుచేయుదును.

విప్ర—నిన్నేల పొమ్మంటినో కారణముఁ జెప్పెదను వినుము. నీవు భక్తురాలవు. నీవలన నెంతమాత్రమును దోషములేదు. కాని నీ విటకు వచ్చిన రెండుమూఁడుమాసములనుండి నా కేమో కాని యొక విచిత్రమైన—

శ్రీ—(అపవారించి) ఆమాట చెప్పకొండు లేదయ్యా! అది గృహచ్ఛిద్రమయ్యా! ఆత్మదోషమయ్యా! అది చలితేంద్రియత యయ్యా! అంతఃచేతనే భక్తిచ్యుతి యయ్యా! (నోరు మూసికొని) దాఁచఁదగినది వెల్లడించుకొండు రటయ్యా!

విప్ర—నాకు రహస్యము లేదు. నామనఃసాకాశమువలె నందఱికిబట్టబయలుకాఁదగినదే. అది నాదోషమే యగునెడల సర్వ్భతిగ నొప్పుకొనెదను. దోషమును నిష్కపటముగ నొప్పుకొనుటయే దోషప్రాయశ్చిత్తము. హృదయమున నున్నదోషమును వెల్లడించుకొనక లోననే దాఁచుకొన్న యెడల వ్యాధివలె వృద్ధియై నశింపఁజేయదా? భక్తురాలా! అనిర్వచనీయమైనయొక మనస్థ్సితి నీదర్శనమున నాకుఁగలిగి వృద్ధియగుచున్నది. అదియవాఙ్మనసగోచరమగుసుఖము నిచ్చుచునేయున్నది కాని—చూడు! ఏమార్గము ననుసరించి తరింపఁదలఁచితినో యామార్గమునుండి యట్టె యిట్టె తప్పి—మఱల పడి—మఱల తప్పి—క్రమక్రమముగఁ దత్పథమునకు దూరముగఁ బోవుచుంటినో లేక యిఁకఁ బోదునో యనుభీతిచేత—

దేవ—శ్రీనివాసా! చీ!చీ!చీ! కుక్క— అదిగో! తిర్వారాధనపు మడిసంచిని ముట్టుకొనినది.

విప్ర—అయ్యయ్యో! పొమ్ము! పొమ్ము!___

శ్రీ—(తనలో) కుక్క సాలగ్రామసంపుటము నైదుమాసముల క్రింద నేస్పృశించినది. ఇఁకను నోటఁ గఱచుకొనిపోవుటయే తగ వాయి! ఛీ! ఛీ! ఛీ! (లోనికి బోవును)

దేవ—(విప్రనారాయణుని రెండు చేతులు గట్టిగఁబట్టికొని) మహాత్మా నన్ను వదలకుఁడు. నేను మిమ్ముఁ వదలను.

విప్ర—అయ్యయ్యో! రంగరంగరంగా! నాచేతులను ఏవలుఁను లోప ల నేదియో యాపాదశిరఃపర్యంతము జలజలలాడుచున్నది. ఒ డలు పులకిత మగుచున్నది. రంగరంగరంగా! నన్నువదలుము. నే నిదివఱకు నీతోఁ జెప్పకొనినవికార మిదియే. ఇది నీవలననే కలిగినదికాన నీవు దూరమునుండి నన్ను క్షమింపుము.

దేవ—నావలన లోప మేమైననున్నదా? నాయొడలు పులకితమైనదో లేదో చూడుఁడు. (అతనిచేతితోఁదన్ను స్పృశింపఁజేయును.)

విప్ర—రంగరంగరంగా! నీవలన నెంతమాత్రమును లోపములేదు. నీ కు నావంటిమనస్థితిలేదు. నాప్రారబ్ధమున నాకుఁగలుగుచున్నది.

దేవ—లోపము మీదై యుండ శిక్ష నా కేల?

విప్ర—రంగరంగరంగా! రంగ! నా కేమియుఁ దెలియకున్నది.

దేవ—ఇంద్రియ నిగ్రహమున నాశక్తినిగూర్చి నన్నెఱిఁగినంతవఱకంద ఱెఱుఁగుదురు. నేనుమిమ్ములనాశ్రయించుటకువచ్చితినని లోక మంతయు వెల్లడియైనది. ఇప్పుడు మీరు నన్ను వదలుకొనఁ గనే భక్తుఁ డగువిప్రనారాయణుఁడు దేవదేవినిజూచి పండ్లిగి లింపఁబోవ, దేవదేవియాతని నిరాకరించి, తిరస్కరించి, వెడలి పోయిన దని మీకుఁ గలుగఁదలచినయప్రతిష్ట నేను గాదు కదా! లోకమైన సంహింపలేదు. నామూలమున నట్టిదుర్వా -క్యము పుట్టుటకంటె నే నిప్పు డిక్కడనే ప్రాణత్యాగ మొన ర్చుట మంచిది. నేను సర్వసిద్ధముగ నున్నాను.

విప్ర— అయ్యయ్యో! ప్రాణత్యాగమేల ?

దేవ— అటు లంటిరి కాన మీవనములో నేనుండెదను. మీకుఁదఱచుగఁ గనబడను. చెట్టుచాటునగాని శ్రీనివాసునిచాటునఁగాని కూరుచుండెదను. నేను లేనట్లే మీరుభావింపవచ్చును. మీయాత్మను రక్షించుకొనుఁడు. నాయాత్మనుగాపాడుఁడు.

విప్ర— నీవు తఱచుగ నాకుఁ గనబడకపోవుటచేత నట్టినుస్థితిక్రమముగ నశించు నని నీయభిప్రాయమా?

దేవ— నశింపనే నశించును నశింపక వృద్ధియగునెడల నటుపైనఁ జూచుకొనవచ్చును.

విప్ర— వృద్ధియగుటయే! రంగభక్తిచే నిర్మూలనమొనర్తునుగాని—

దేవ— చిత్తము. మఱింత మంచిది.

విప్ర— నాచేతు లింక విడువుము.

దేవ— (తనలో) ఇప్పటి కింతితో సరిపెట్టెదను. (విడుచును)

విప్ర— నీవు తులసికోటచాటున కింకఁ బొమ్ము.

దేవ— చిత్తము. (పోవును.)

విప్ర— రంగరంగరంగా! (లెంపలు వైచుకొనును)

దేవ— (తనలో) లెంపలు కొట్టుకొన్న సరే, ఇంకఁ దల నేలను వైచి మోదుకొనిన సరే, గొంతుకవఱకుఁ బూడ్పించుకొనిగోతిలోఁ గూరుచుండినసరే, కాళ్ళపైఁ దలక్రిందుగ వ్రేలాడినను సరే, రంగభక్తి జఱ్ఱున జాఱిపోక మానదు. దేహమునఁ బ్రవేశించిన విషము జిరజర తలకెక్కక మానదు.

విప్ర— రంగరంగరంగా! రంగ!

గీ॥ కష్టదశవచ్చెనయ్యా! రం♦ గయ్యా! నాకు
నిచ్చలంబుగ నీభక్తి ♦ నిలువ దయ్యా!
నాదుప్రారబ్ధ మేమొ రం ♦ గా! శుభాంగ!
యెట్లు నిలువఁబెట్టుదో నన్ను ♦ నింకమీఁద.

ఆ. వె. బుద్ధి దొంగగొడ్డు ♦ పోలిక నట్టిట్లు
పరుగు లిడును దుచ్ఛ ♦ ఫలముఁ గోరి
దాని మెడను గుదియఁ ♦ దగిలించి నీయొట్ట
యెదుటఁ గట్టిపెట్టు ♦ మింక రంగ!

**దేవ**—(తనలో) దొంగగొడ్డునకు గుదియ వైచినంతమాత్రమునఁ బరుగు లడఁగవు, అంతకంటె దొంగదగుమాటియొకగొడ్డుతో లంకె వేయవలయును. అదియుఁగూడ సిద్ధముగనే యున్నది కాదా!

**విప్ర**—శ్రీనివాసుఁడు లోనికేఁ బోయి యింకను రాకున్నాఁడు—ఇది యేమి! నిశ్చలభక్తితో రంగని దలఁచుచుండ నింతలో శ్రీనివాసుఁ డేల స్మృతికి రావలయును? (ఆలోచనమునటించుచు) అదిగో! దొంగగొడ్డు—పాఱిపోవుట—యనుమాటలు కుక్కమడిసంబి—తగులుట—పాఱిపోవుట-యనుసంశయముల జ్ఞప్తికిఁ దేఁగ నందుపైఁ గుక్కను గొట్టఁ బోయన శ్రీనివాసుఁడు స్మృతికి వచ్చిననాఁడు. భక్తినిశ్చలత్వ వైఖరియిట్లున్నది. రంగ రంగరంగా!ఏమి చేయుదును? నాఁబదు కింక నధోగతియేనా? అయ్యయ్యో! రంగా! రంగ! నీపవిత్రనామమును నోటస్మరించుచుండ మనసులో దొంగకుక్క సంచరించుచున్నది. ఇట్టి పరమపాపిష్ఠుఁడ నైననేను నిన్నింక స్మరించిన వినియోగమే మున్నది? మీఁదుమిక్కిలి పాపముకూడ నేమో అయ్యయ్యో! రంగ! రంగరంగా! (తలపైఁ గొట్టుకొనును)

**దేవ**—(తనలో) నీవు నెత్తిపైన నీచేతులతోఁ గొట్టుకొనిన రసము లేదు. నేనుముందు నాట్యము చేయుచుండ, మాయక్క వెనుక తాళపుహంగు సేయ, నీవు వెనుకఁ దిత్తినూఁదుచుఁ గునికిపాటులు పడి యూఁద మానివేయ, నప్పు డెడమచేతి తాళపు చిప్పతో మాయక్క నీనెత్తిపై టంగున బ్రహ్మరంధ్రస్థానమునఁ

గొట్టినప్పుడు—ఆవిరసయుక్తమైన దెబ్బ! ఆదెబ్బతో గిరగిరఁ దిరిగి తలప్రాణము తోఁకకు వచ్చినప్పుడు రంగభక్తి తిరుగఁ గుదురవలయునుగాని యిప్పుడు నిప్పులలోఁబడి దొరలినగాని విని యోగములేదు.

విప్ర—రంగరంగరంగా! రంగ! నాబుద్ధి నిశ్చలముగ నుంచవా? (గొంతుక బాగుగ సవరించుకొనుచు మరల్నఁకు.) రంగా! (కేక వేయును.) గొంతేమో మోటుగను జీరగలిగినట్లుగు వచ్చుచున్న దెందుచేత నో? ఆహా! ముసలవారము చెప్పవచ్చినప్పుడు దేవదేవి దే. అది రంగనామము స్మరింప నాయొడలు జలజలమని యమితానంద మిచ్చునట్లుండెను. దానిని నాప్రక్కనుంచుకొని దానిచే రంగ నామమును స్మరింపఁజేయుచు నేను సుఖముగ వినుచుండిన యెడల నేను స్మరించుటకంటె నెక్కువఫలప్రదమేమో యను కొందును. కాని ఇది యొక్కప్రారబ్ధము సంభవించెను. అదినా కంటఁ బడుటకుపీలులేదు. ఆసమయమున నేను గన్నులుమూసి కొని వినునెడల నదియూ కనఁబడదు. చిత్తమునకుఁ జక్షువుల గుండ బాహ్యప్రవర్తనము లేకుంటచే మఱింత నిశ్చలత గుదుర వచ్చును. చూడు! దేవదేవి! అక్కడనే యుంటివికాదా?

దేవ—(ఎదుటికి వచ్చి నిలవఁబడి) ఏమి సెలవు?

విప్ర—(కన్నులకుఁ జేయి యడ్డము పెట్టుకొని) నిన్ను నాయెదుటికి రమ్మంటినా?

దేవ—"చూడు దేవదేవీ!" యని మీ రంటిరి కాదా? ఎదుటకురా కుండ నెట్లు చూడఁగలను?

విప్ర—(ఒక్కసారి దానివంకఁజూచి) సరే—సరే! నీవు పోయి చాటుననే యిటఁకఁ గూరుచుండుము.

దేవ—(తనలో) ఇప్పుడు నావంక నీతఁడు చూచినచూపు వెఱ్ఱిచూపే! ఏమియు సందేహములేదు. ఇట్టిచూపు చూడఁగ నీతని నెన్నఁ

డును జూచియుండలేదు పుటములు పూర్ణముగఁ బడని యాభ్ర కపు బిళ్ళలోవలె నీతనికంటిచూపులో నొక చిత్రమైనతళుకు, కొలదిపాటిరక్తియుఁ గానఁబడినవి. అయ్యవారులగారిభక్తి కింకనాశ్వాసాంతమే!

విప్ర—"ఊఁ" అనుసరికి పాపము! పిచ్చిచిత్తి నేమో నను పరుగునవచ్చె ను. ఏమిగురుభక్తి! ఏమి యాజ్ఞావిధేయత! ఏమిగురూపచారా భిలాషోత్కర్షత! శ్రీనివాసుఁడుకూడ మంచివాఁడే. అతఁడు గూడ నాసుఖమునుజూచువాఁడే కాని, ఏమైననేమి! పురుషోప చారములకొలఁది కేర్పడుపఁబడు స్త్రీయొనర్చినట్లుండునా? కాని, ఆతనికి దీనికిఁ బెద్దవైరముగనున్నది. నాప్రారబ్ధఫలములలో నీగృహకలంబమొకటి. చెప్పినట్లు శ్రీనివాసుఁడు వినఁడు. దీనితో జెప్పుటకే మనసొప్పదు. శ్రీనివాసుఁడు డిదిగో వచ్చు చున్నాఁడు.

(శ్రీనివాసుఁడు ప్రవేశించును.)

విప్ర—ఏమైనది?

శ్రీ—అంతయు ధ్వంసమైనది.

విప్ర—తిరిగి యింకఁ బనికిరాకుండఁగనే?

శ్రీ—సంచిని నోటఁ గఱచుకొనిపోవ నే నడ్డుదగిలితిని. దాని నింట నుంచి స్నానము చేసి వచ్చితిని. స్నానమొనర్చెఁగాని తాఁకఁ దగనిపవిత్రవస్తువును దాఁకి స్నానముచేయవలసినదుర్గతి యెట్లు పట్టినదో! మహాత్మా! దేవదేవి యేది?

విప్ర—దానిమాట కేమిగాని ముందీమాట చెప్పుము. అయ్యయ్యో! ఎన్నిసాలగ్రామసంపుటములు! ఎంతదేవతార్చనార్హసామగ్రి! ఇదియంతయుఁ దిరిగి పరిశుద్ధి యింతట నగునా?

శ్రీ—దానిమాట కేమి? అది చెడినమాత్రమే? నిముసములో బాగు చేయవచ్చును. పులికాపో, తిరుమంజనమో, నాశ్రాద్ధమో

యేనో యేఁడిచి నేను బాగుచేసెదను. దేవదేవిమాట యేమో ముందు చెప్పుఁడు ఇది పోయినఁగాని మనకు గతులు నిలువవు. భ్రష్టుల మైనతరువాత మాత్రము మనల గడ్డిమసితోఁ దోమిన సరే. కడిగిన సరే, అరగదీసిన సరే, సాఁగదీసిన సరే చంపిన సరే, తగులబెట్టిన సరే కాని మడిసంచివలెమాతోము మఱల పవిత్రము గాలేము.

విప్ర—నిమ్మళము! అది యాగాటుననే యున్నది.

శ్రీ—అయ్యయ్యో! పోయినది కాఁబోలు నని సంతసించితినే! ఎంత ప్రారబ్ధమయ్యా! ఎందుల కుంచితిరి?

విప్ర—నష్టమేమియుఁ దొంగకు లేదు. కారణమేదో సావకాశముగఁ జెప్పెదను. నాతో లోనికి రమ్ము. చూడు! అక్కడ దేవదేవి యున్నది. దానిని నేను జూడను. కాన, ముందు దానిని జట్టున బొమ్మని చెప్పుము.

శి—మన కీ స్త్రీవిద్యోపాసన మొందుల కయ్యా! దేవదేవీ! ముందు నీవుపొమ్ము. (దేవదేవి పోవుచున్నది.)

శి—మహాత్మా! గడియగడియకుఁ గ్రిందికిఁ జారుచున్నారు. మిమ్మాఁపుటకు నాతరము గాకున్నది. మహాత్మా! మీరే కొంత పూర్వచింత చేసికొని మనసు గుదుటఁ బఱచుకొనినఁ గాని యెంతమాత్రమునువినియోగము లేదు. మహాపత్తురానై యున్నది. మిమ్ముఁ గాపాడుకొనుఁడు. నన్ను రక్షింపుడు.

విప్ర—వెఱ్ఱివాఁడా! నే నంత చపలుఁడ నగుదు ననుకొంటివా? తొందర యేమియు లేదు. లోనికిఁ బోవలయును. చూడు! దేవదేవి వెళ్ళినదేమో!

శి—అప్పుడే వెళ్ళినది.

విప్ర—ఆఁ! కాలిచప్పుడైన వినఁబడకుండ నెట్లు పోయినది.

శ్రీ—అది కనఁబడకపోయినను గాలిచప్పుడైన వినఁబడినదికాదుగదా! యని విలపించుచుంటిరా? ఆహా! ఈ దిక్కుమాలినతలుపు చాటుతారుటలు, సందుగొందుల నిక్కిచూచుటలు మొదలైన ఘోషకూడ నెందులకు?

విప్ర—ఇటులా నీవు నన్ను గ్రహించితివి? దాని నియమ మెంత పట్టుదలతో జరుపుచున్నదో యని నేను సంతసించుచుంటిని.

శ్రీ—ఆపట్టుదలతోఁ బదునాల్గవవం తయిన మీకు లేకపోయెనే యని నే నేడ్చుచుంటిని?

విప్ర—తొందర లేదు. మడిసంచి బాగుచేసికొని మఱల నిప్పుడే యిక్కడకు వత్తును రమ్ము.

శ్రీ—మనసు బాగుచేసికొనుట యంతకంటె ముఖ్యమైనపని.

విప్ర—సరే. మఱల వచ్చి చూచుకొనవచ్చును. రమ్ము.

(ఇద్దఱును నిష్క్రమింతురు.)

ఇది తృతీయాంకము.

శ్రీ

# విప్రనారాయణ చరిత్రము

## చతుర్థాంకము

(ప్రదేశము—విప్రనారాయణుని పుష్పారామము.)

(ప్రవేశము—విప్రనారాయణుఁడు)

విప్ర—గీ. నోము రంగరంగా! యిటుఁ ♦ జోరబుద్ధి
యిటుఁదు నాఁడేనడేవి యు ♦ ల్లాసుచుండుఁ
గన్నులను మూసి దేవుని ♦ గాంచఁ బోవఁ
దాస్యులెయె నవ్వుచు నెదుటఁ ♦ దోఁచుచుండు.

గీ. దాసిపై బుద్ధి మానఁగఁ ♦ దలఁపడినకొ
లంది తద్యోజనమె ప్రబ ♦ లముగ నయ్యె
మఱవఁ దలఁచినయంశంబు ♦ మఱవఁబూను
కొలఁది స్మృతిఁలోన బిగ్గఁ దా ♦ ర్కొనినయట్లు.

గీ. చిత్తమందు వేశ్యారక్తి ♦ చేరుకొలఁది
రంగభక్తి దూరంబయ్యె ♦ రసము కచిక
పిల్చినకొలంది తన్మధ్య ♦ విలసితమగు
వాయుమూర్తి యెగసి పోవు ♦ వైకరిగను.

గీ. దివ్యముగఁ బూర్ణముగ రంగ ♦ దేవుఁ జెచ్చు
నాస్యసేవ ముక్త్ప్రదము; కా ♦ దనఁగ దప్పు

(లెంపలువైచుకొనును.)

కాని పూలమాటున నింత ♦ గానఁబఱచు
తిరుమొగముసేవ మద మెంతొ ♦ తెలియఁదరమె?

గీ. ఎపుడు కనఁబడ దొకవేళ ♦ నెదుట బడఁగ
వలయునపుడైన మాసిన ♦ పైఁటచెఱఁగు
మాటునఁ దళుక్కు మని తొల్లి ♦ మాయ మగును
జలదగతశత్రకతుధనుః ♦ కలికవలెను.

(దేవదేవి ప్రవేశించును.)

దేవ—ఈతఁడేదో పైకి ననుకొనుచున్నాఁడు. ఇచ్చటనఁడివిందును.

విప్ర—ఈదివస మిచ్చట నేదో యొక చిన్న పురాణకాలక్షేపమును నన్నుఁ జేయుమని శ్రీనివాసుఁ డూరక బలవంతపెట్టుచున్నాఁడు కాలక్షేపకర్తను గాలక్షేపప్రియుఁడ నగునాకు భక్తిరహితముగ నేకాని కాలక్షేపము గాకయున్నది. పూర్వాచార్యప్రసాదిత గ్రంథములలో దేనినైనఁ జదివినయెడల నాకుఁ దిరిగి మనసు కుదుటపడునేమో యని శ్రీనివాసుఁడు దేవులాడుచున్నాఁడు కాబోలు!

గీ. చదివినంగాని చిత్తంబు ♦ కుదుటఁ బడదు
హృది కుదుటఁ బడకుండఁగఁ ♦ జదువు లెట్లు?
పెండ్లి కాకుండఁగ మదపుఁ ♦ బిచ్చి పోదు
పిచ్చి కుదురకయుండినఁ ♦ బెండ్లి కాదు.

ఏమి సేయవచ్చును.

దేవ—(తనలో) ఇట్టిసంధినివారకాంతనుంచుకొనుటకంటెఁ దారకమార్గముమఱియొకటిలేదు. (తులసికోటచాటునఁ గూరుచుండును.)

విప్ర—అదిగో! శ్రీనివాసుఁ డింక నేదో పూర్వాచార్యకృతగ్రంథ మొక్కటి తెచ్చి చదువు మని చెప్పును గాఁబోలు! శిష్యుఁడు గురునికిఁ జదువు పంచి దన బోధించుట గురువు చదువుకొన

కుండ మూల్గుట! ఇట్టిరీతిగా నా బ్రిదుకున్నది! (శ్రీనివాసుఁడు ప్రవేశించును.)

శ్రీ—స్వామీ! వచ్చితిని. నాననవిని మన్నింపవలయును.

విప్ర—దేవదేవి యింక రాలేదేమి?

శ్రీ—(తనలో) ఈతని కెంతసేపును దృష్టి దానిపైననే నిల్చియున్నది. ప్రకాశముగ, స్వామీ! పురాణశ్రవణమును నే నపేక్షించి యుండఁగ దేవదేవీదర్శనమును మీరు వాంఛించుచుంటిరా?

విప్ర—పాపము! అదిమాత్రము వినవలదా? ఉన్నవా రిద్దఱు శిష్యులు వారిలో నొకఁడు వచ్చి యొకతె రాకుండు నెడల నాకుఁ గాలక్షేపమెట్లు జరుగఁగలదు. కావున దానిని గూడఁ బిలువుము.

శ్రీ—ఇదిగో! ఇల్లి వచ్చెదను.

విప్ర—అక్కఱలేదు. ఇక్కడనుండియే బిగ్గఱఁగఁ బిలువుము.

శ్రీ—దేవదేవీ! దేవదేవీ!

దేవ—(ఎదుటఁ బడుచున్నది)

శ్రీ—అయ్యయ్యో! ప్రమాదము! స్వామీ! ఈవిసరుకఱ్ఱను మీ మొగమున కడ్డముగ నుంచుకొనుఁడు. (ఇచ్చును.) దేవదేవీ! నీ విచ్చటకు వచ్చి యెంతసే పైనది!

దేవ—నీవు రాకముందే వచ్చినాను.

శ్రీ—నీవు రాలేదని యింతసేపు గురువుగారు నాతో ముచ్చటించు చుండఁగ వినియుండియు వచ్చితినని చెప్ప లేకపోయితివా!

దేవ—చెప్పినయెడల నీతోఁ బ్రసంగింపనిదే యేల యుత్తరమిచ్చితి వని నీ వధిక్షేపింతువేమో? అదిగాక నాకుఁ గునికిపాట్లు కూడ వచ్చినట్లున్నది.

విప్ర—అసురసంధ్యవేళఁ గునికిపాట్లేమి? దేహములో నేమైన నారోగ్యలోపముగ నున్నదా యేమి?

శ్రీ—ముందు జరుగబోవు పురాణ మీయదగిన ఫలమిప్పుడే యావే శించినదా ?

విప్ర—మాటలాడవేమి ? ఏమైన జబ్బుగానున్నదా ?

దేవ—ఉన్నయెడల నెవనితోఁ జెప్పుకొనను ?

శ్రీ—వైద్యునితో—

విప్ర—అదేమి మాట ? దేవదేవీ ! నీవు మాకు సకలోపచారములు చేయుచుండ నీక్షేమముమాత్రము మే మరయ నక్కఱలేదా ? మేమంత యవిశ్వాసముగ వర్తింతుమా ?

శ్రీ—అయ్యా ! విసరుకఱ్ఱ జారిపోవుచున్నది. కొంచెము పైకుంచు కొనుఁడు.

విప్ర—(తనలో) విసరుకఱ్ఱ కాదోయి ! మనసు.

దేవ—మఱేమియుఁ దొందరలేదు. కాలక్షేపమును గానిండు.

శ్రీ—స్వామీ! ఇదిగో! కోశము. (విప్రుఁడు చూచుచున్నాఁడు.) అయ్యో! తిర్వాధ్యయన మంత్రములకట్ట పట్టుకొనివచ్చితిని. పోయి యాచార్యగ్రంథములఁ దెచ్చెదను. (పోవును.)

విప్ర—(తనలో) తద్దినపుమంత్రములా? అయిన నేమి? నాభక్తి కింకఁ బరమకైంకర్యమే కావున శ్రాద్ధమంత్రమైన సమయోచితముగనేయున్నది. (ప్రకాశముగ) ఈదిక్కుమాలిన విసఱుకఱ్ఱతోఁ బ్రయోజనమేమి? (పాఱవైచి) దేవదేవీ! నీదేహములోని బాధయేదో చెప్పెదవా లేదా?

దేవ—చెప్పెదవా లేదా యని యడిగితిరి. చెప్పవలయుననియే యున్నది. చెప్పలేకుండ నున్నాను.

విప్ర—ఏమి? సిగ్గుపడుచుంటివా?

దేవ—మహాత్మా! సిగ్గు విడిచిపెట్టి యెంతకాలమైనది! సిగ్గు గలిగి యుండినయెడల నింతసాహస మొనర్చి యిల్లును బంధువులను

సంపదను వదలి యొక్కతెనై బుద్ధుని నాశ్రయింప నింత దూరమువచ్చియుండినా? అప్పుడున్న భక్తితీవ్రతచే నాకు త్రాణము, నిద్ర, భయము కూడఁ గనఁబడలేదు. నన్నుఁ బ్రాపించిన సమస్తసంబాధదూరముగఁ జేసిన యాభక్తి యిప్పుడు నిలువరాదా! నామహాకర్మము!

విప్ర—నీభక్తి నిశ్చలముగనే యుండెను గాదా?

దేవ—ఉండెను. ఎప్పుడో!

విప్ర—ఇప్పుడో!

దేవ—పోయినది. మీకెందులకు? నాప్రారబ్ధ మెట్లున్నదో యట్లే జరుగును. మీకేమి హృదయపటుత్వము గల పురుషులు. రంగభక్తిజాతి రక్తి హృదయమునం దెక్కుచున్నను బలవంతముగఁ ద్రోసివైచుచుందురు. మనసు వెంటనే త్రిప్పుకొని తిరిగి భక్తిలోఁ బడి గానమో కాలక్షేపమో చేయుచు భక్తిని స్థిరపఱుచుకొందురు.

విప్ర—దేవదేవీ! ఏమి? నీకుఁ గూడ నాకు వచ్చిన స్థితివంటిదే వచ్చినదా యేమి?

దేవ—అట్టిదేయైన యెడల నింతబాధయేమి? నెత్తిపైకి సూర్యుఁడు వచ్చినప్పు డక్కడకు వచ్చి యిప్పటివఱకు నేనేడ్చినయేడు పేమి చెప్పఁగలను? అబలను అందఱిని వదలి యిచ్చటకు వచ్చినదానను. అందులోఁ గేవల మమాయికను. అదిగాక నామర్గతిచే నమితానురాగపూర్ణహృదయను—

విప్ర—నిజమే. అనురాగాదిక్య మున్న హృదయమందే కాని భక్తి నిలువదు.

దేవ—నిలిచిన దేదీ? తల్లికి సోదరులకు శత్రువునైతిని. ఊరివారితిట్టులకుఁ బాత్రమునైతిని. సర్వము మీరే యని మీపాదములఁ

బడితిని. నాపుణ్యావశేషమున భక్తి ప్రబలుచున్నదని పొంగి పోయితిని. ఇంతలో స్వప్నాంతరము బయలుపడునని యెఱుఁగక పోయితిని. హా! స్వామీ! నా కిఁక నేది గతి?

విప్ర—నీ కిప్పుడు కలిగిన మనోవికారము నావలననే కలిగినదని నీకు నమ్మకమా?

దేవ—అయ్యో! స్వామీ! భక్తి భ్రష్టము పోవుటచేఁ నాఁబోలుసిగ్గు తిరిగి నన్నావహించుచున్నది. ఈమనోవికార మెట్టిదో యిది యేండ్లకుఁ గలిగెనో నేనుమాత్ర మెఱుఁగుదునా? పెద్దదాననైనది మొద లిప్పటివఱకు సన్న్యాసమ్మవలెనే కాలక్షేపము చేసితినిగాని యౌవనదశముద్దుముచ్చట లెన్నఁడైన నెఱుఁగుదునా? అయ్యయ్యో! నా యీడువారలు పట్టుబట్ట లని—కాసులపేరులని—కాముకకేళులని—చందనపుఁ బూఁతలని—యత్తరువులని—ముద్దుముద్దుగ మగ లని—ముద్దు లని—కౌఁగిలింత లని—మొదలు తెలియని మహానందముల తోఁజిలుక, గోరువంకవలెఁ గిచకిచలాడుచుఁ, గలకలలాడుచు, గుబగుబలాడుచు, మురియుచుఁ, గులుకుచుండ—

విప్ర—అబ్బ! ఒడలు పులకాంకిత మగుచున్నది.

దేవ—నాపారబ్ధము! నాకుఁ దులసిపూసలపేరులు! జేగురుపాతలు! తల నల్లుకొనినజడలు! ఏకభుక్తులు! బ్రహ్మచారిణీవ్రతములు! దాసరమ్మవేసములు! ఆదశ్నియనములు! పరదేశగమనములు! బానిసతనములు!-ఇంతే కాదా? ఇన్నిఁటికిని ప్రధానమైన యారంగభక్తియైన నిలువఁబడ నాయుంతది లేనేలేదని సంతోషించియే యుందును. అట్లు కాక—

విప్ర—అట్లుకాక-ఇప్పుడు క్రొత్తగాఁగలిగినచిత్తస్థితినినిర్వర్ణింపలేవా?

దేవ—పురుషులు, ప్రాజ్ఞులు, విద్వాంసు లయినమీరే యశక్తులై యుండినప్పుడు స్త్రీని, నప్రాజ్ఞను, ప్రపంచసుఖానుభవమెట్టిదో

కూడ నెఱుఁగని పెద్దమ్మను, నే నెట్లు నిర్వర్తింపఁగలను ?
మొట్టమొదట నిది యేమో కొంచెము స్త్రీమితత లేకపోవుట
యని, తోఁచకపోవుట యని, యేదో యొకవిధమైన జెంగ యని
యనుకొంటినిగాని—

విప్ర—సరిగా నట్లేసుమా నాకుఁగూడ ప్రారంభమైనది!
దేవ—ఆరంభించుట మీ మనస్థితివలెనే ప్రారంభమై వృద్ధియగు
టలో మీ యవస్థకంటె మఱింత శీఘ్రముగను దృఢముగను
పెరిగినది—

విప్ర—ఆఁడుదాన వగుటచేఁ గాఁబోలు !
దేవ—అందులోను శుద్ధసత్యకాలపు వెఱ్ఱిగోలను.
విప్ర—నిశ్చయమే. చూడు ! మనస్సు నిశ్చలముగ నుంచఁదలఁచిన
కొలఁది నా కట్టె యట్టె నీపై బుద్ధి పాఱినట్లే నీకునుగూడ—
ఏది!—నీకునుగూడ—నాపై—అలాగే—ఊఁ !—ఊఁ !

దేవ—మీ రనుటకే సందేహపడుచున్న యంశమును నానోట నేల
యనిపింతురు ? అదిగో ! కాలిచప్పు డగుచున్నది. శ్రీనివాసుఁడు
వచ్చుచున్నట్లున్నాఁడు. విసనుకఱ్ఱ నడ్డుపెట్టుకొనుము.

(శ్రీనివాసుఁడు ప్రవేశించును)

విప్ర—(తనలో) విసనుకఱ్ఱ గాదు. వింధ్యపర్వత మడ్డుగ నుంచిన నింక
వినియోగ మున్నదా ?
శ్రీని—ఈ కోశము కనఁబడుసరికి నాత్రాడు తెగినది.
దేవ—(తనలో) దానిని దాఁచి తద్దినాలమంత్రముల పొత్రను బైని
బడవైచితిని.

శ్రీని—దేవదేవీ! నీ వింత సేపటినుండియు నిచ్చటనే యుంటివా?
దేవ—నేను నిచ్చటనే యుంటిని. విసనుకఱ్ఱయు నిచ్చటనే యున్నది.
శ్రీని—చూడు! నీవు తిరిగి తులసికోట చాటునకుఁ బొమ్ము.

విప్ర—దానికి మాత్రము వినఁబడ వలదా? అది యిచ్చటనే యుండిన మంచి దేమో !

శ్రీని—మొట్టమొదటినుండియు నాలాగుననే యెంచి యింత ముంచు కొంటిమి.

విప్ర—సరే! గ్రంథ మిటు తెమ్ము.

శ్రీని—(ఇచ్చును)

విప్ర—ఏమి యిది?

శ్రీని—ఒకటి యనినమాట యేమి ? పూర్వాచార్యరచితము లగు కొన్నిగ్రంథము లీ సంచికలో నున్నవి.

విప్ర—ఇందులోఁ గావలసినభాగము నీరాట్టమా ? పూచ్చుడలా ? తిరుప్పల్లాండా ?

శ్రీని—తిరుప్పల్లాండు విశేషభక్తియుక్తముగ నుండునని నేననుకొందును.

విప్ర—భక్తిలో నన్నియు నొక్కటే. దేవదేవి కేది కావలయునో?

శ్రీని—నీరాట్టము దాని కక్కఱకువచ్చుట కది సాలిది కాదు; సానిది. మీరు చెప్పిన పూచ్చుడలు పొగచుట్టలైన యెడలఁ గావలయు నేమో?(తనలో) తన బుద్ధిస్తిమితతకొఱకు గ్రంథమునుజదివించు చుండ దేవదేవి కేది కావలయునో యని యడుగుచున్నాఁడు. రంగరంగరంగా! ఎంత కర్మము!

విప్ర—దేవదేవీ ! తిరుప్పల్లాండు నీ కిష్టమేనా ?

దేవ—పూర్వమున నది నా కిష్టమే కాని భక్తి కుదిరిన తరువాత దాని వాసనయైన గిట్టకున్నది.

విప్ర—అదేమి ?

శ్రీని—పల్లాం డనఁగ నుల్లిపాయ యనుకొనుచున్నది కాఁబోలు!

విప్ర—ఆలాగా! ఇది లాకిరింద లా.

దేవ—ఉల్లిలోను నంతే కద !

శ్రీ—ఆరంభింతురు?—లేనిపోనిమాటలేల?

విప్ర—శ్లో. పల్లాణ్డు పల్లాణ్డుపల్లాయిరత్తాండు
పలకోడినూఱాయిరమ్
మల్లాణ్డ తిణ్డోళ్ మణివణ్ణావున్
శేవడి శెవ్వితిరుకాప్పు.

శ్రీ—ఆహా! పెరియాళ్వారి భక్తి మహాత్మ్యము! ఆహా! ప్రపన్నత ఆహా! కవితామాధుర్యము!

విప్ర—దేవదేవీ! వినఁబడుచున్నదా!

శ్రీ—వినఁబడక దానిచెవులలో చెట్టులు మొలిచెనటయ్యా. మీరు గ్రంథమును దదేకదీక్షగాఁ జదువుదురు!

దేవ—వినఁబడిన లాభ మేమున్నది? నా కేమి తెలిసినదా?

విప్ర—ఓహో! అటులైన లఘువుగఁ దాత్పర్యముఁ జెప్పెదమందువా!

శ్రీ—(తనలో) గురుత్వము గోడగడ్డలైనది కాదా?

దేవ—మహాభాగ్యము.

శ్రీ—(తనలో) రంగభక్తికి—

విప్ర—(రాగధోరణిగ) పాండ్యమండలమందుఁ దిరువిల్లుబుత్తూరులోఁ దిరుమహావిష్ణు పెరియతిరువడియంశమున జన్మించినతిరువిష్ణుచిత్తులవారలు లీలా విభూతిలోఁ జేరియుండ నొక్కనాఁడు తమ యిష్టదైవమైన వడపెరంగోయిడయాను దమకు స్వప్నమున సాక్షాత్కరించి యీవిధమున పాయించిరి.

దేవ—స్వామీ! పెరియాళ్వారినిగూర్చి పాయించెద మని విష్ణుచిత్తుని గూర్చి పాయంచుచున్నారేమి?

విప్ర—విష్ణుచిత్తుఁడే పెరియాళ్వారు. ఆయనకు భట్టనాథుఁ డని కూడ పేరు. ఆమహానుభావుడే శ్రీరంగదేవునికి మామగారు.

దేవ—(తనలో) ఒక భక్తుఁడు విష్ణునకు మామగా రైనప్పుడు మఱి యొక భక్తుడు వేశ్యకు మగఁ డేల కాఁగూడదు? క్రమము తప్పినప్పుఁడొకవిధముగనే యన్నమాట యేమి?

శ్రీ—అయ్యో! సెలవిండు.

విప్ర—ఇదివఱ కెచ్చటకుఁ జెప్పితిని?

శ్రీ—ఇంతలో మఱచిపోయితి రేమి? నడుమ నూరక ప్రశ్నము లుండఁగూడదు. శ్రీవిష్ణుమూర్తివారుస్వప్నమున—

విప్ర—సరి. సరి. (రాగధోరణిగ) దేవతాంతర, మంత్రాంతర, సాధనాంతరరూపాయాంతరరహితుండును, స్వస్వరూప పరస్వరూపోపాయస్వరూపఫలస్వరూప విరోధి స్వరూపార్థపంచకజ్ఞాననిష్ఠుండును, నాకారాత్రియసంపన్నుండును, నగు భక్తశిఖామణి కట్లు శ్రీనంబెరుమాళ్లువారు సాక్షాత్కరించి "నేను నీ వారాధించు విష్ణుస్వరూపుఁడను. నీతో నొక్కమాట చెప్పవచ్చితిని. ఓభక్తురాలా!—తలయెత్తి కన్నులు తెఱచి బాగుగా నావంకఁ జూడుము"

శ్రీ—అయ్యయ్యో! అయ్యయ్యో! పెరియాళ్వారిని భక్తురాలా! యని సంబోధించుచుంటి రేమి?

దేవ—శ్రీనివాసా! భక్తులలో లింగభేదము లేదనికాదా మనసిద్ధాంతము!

విప్ర—సరే. పొరఁబాటు. (రాగధోరణిగ) ఓభక్తశిఖామణీ! ఓభక్తశిరోవతంసమా! నీవు మధురాపురంబునకు విచ్చేసి పాండ్యభూపాలుం డగువల్లవదేవరాయనిం గాంచి తద్విద్వత్సభామధ్యంబునఁ బ్రతివాదిపక్షవిక్షేపణ మొనర్చి, ప్రత్యంతప్రతిపాదితంబగు పరతత్వంబు నిర్ణయించి స్వమతస్థాపనం బొనర్చి, తత్సభామండల మధ్యస్థ రత్నమయ తోరణస్తంభస్థలవిసక్షిప్త

విద్యాశుల్కంబు గ్రహించి తెచ్చికొమ్మని గంభీరఘోషణంబుల నానతీయ నంత—నాథ క్తశిఖామణి—యావిప్రోత్తంసుఁ డు—తద్దేవదేవీముఖారవిందనిష్యందమాణ—

శ్రీ—అయ్యయ్యో! "దేవదేవి" కాదు. దేవదేవముఖారవింద. ఇది వఱకుఁ బెరియాళ్వారికి అవికఁ దొడిగించినారు. ఇప్పుడు పురుషోత్తమునకే గాజులు దొడిగించుచున్నారు. అయ్యా! "దేవదేవ"—

దేవ—(తనలో) తలక ట్రైగిరినది. గుళ్లో దీర్ఘము పెట్టినాడు.

విప్ర—నడుమ నడుమ నీవిట్లు లడ్డువచ్చుచుండ నేనెట్లు చెప్పఁగలను?

శ్రీ—నడుమఁ బ్రమాదములు సెప్పుచుండ మనవి చేసికొన వలదా?

విప్ర—ప్రమాదశూన్యముగ నీవు చెప్పరాదా?

శ్రీ—క్షమించుఁడు. మీరే కానింపు. "తద్దేవదేవ"—

విప్ర—అది వలదు. మరియొకదారిని చెప్పెదను. (రాగధోరణిగ) ఆ శ్రీమహావిష్ణుని సంభాషణమును విని భక్తుఁడిట్లు మనవి చేసికొనెను. అయ్యా! "స్వామీ! నేను నిరక్షరకుక్షుఁడను. ఇట్టి మహాకార్యము నావలన నెట్లగునని, నీకేమియు భయము లేదు. నీజిహ్వాగ్రంబున మేము వసింతుమని భక్తవత్సలుఁడు సాయించిపంప, నాతఁడు పాండ్యరాజసభాంతరంబున వైష్ణవ మతస్థాపనమొనర్చి విద్యాశుల్కంబుఁ గైకొని యారాజుచే గంధగజేంద్రంబెక్కింపఁబడి తిరువీథుల వేంచేయింపుచుండఁ గుమారునియున్నతస్థితిఁ గాంచి యుప్పొంగుతండ్రివలె భక్తునిఁ జూచుటకై పరమపదమునుండి శ్రీస్వామివారు లక్ష్మీపతిస్కులై, శంఖచక్రగదాపాణులై, యధిష్ఠిత గరుడసందుర్లై యెదుట సేవ సాయింప—

శ్రీ—స్వామీ! ఇదియే రసమైన పట్టు. ఆదివ్యమంగళవిగ్రహసౌందర్యమును బెరియాళ్వారెట్లు భావించిరో యట్లే మీరు భావించి

యితరచింతలన్నిఁటిని దిరస్కరించి చిత్తమును గుదుటఁ బఱుచుకొనుఁడు.

విప్ర—సరే! అట్లే భావించెదను. (కన్నులు మూసుకొని రాగధోరణిగ) పెరియాళ్వారు వారలఁగాంచి ఓహో! ఓహో! ఇట్టిదివ్యమంగళ విగ్రహముతో నేల దయచేసితిరి? అయ్యయ్యో! ఈస్వరూప మునకు దృష్టిదోషము తగులునేమో! (దేవదేవివంకతిరిగి) ఆహా! ఆకన్నుల తీరేమి? ఆముక్కుసొగ సేమి? ఆకనుబొమల వక్రత యేమి? ఆహా! ఏమిచక్కఁదనము?—ఉబుకుచున్న యావైఁటలోని—

శ్రీ—(తలపైఁగొట్టుకొని) అయ్యో! చాలుచాలు! పురాణము నాపిండ కూడువలె నున్నది. పెరియాల్వారు లేరు. పెరుమాళ్ళు లేరు. అయ్యయ్యో! దేవదేవిని వర్ణించుచున్నా రేమి?

విప్ర—చిత్తము స్వవశము కాకుండ నున్నది.

శ్రీ—ఒకప్పుడైన నలవాటుచొప్పుననైన నిప్పుడు "రంగరంగా" యనుట మాసివైచినా రేమి?

విప్ర—చిటపట లాడుచున్నది. అది యేమి? చినుకు పడుచున్నదా?

శ్రీ—గాఢముగ మబ్బుపట్టినది. పెద్దవర్షమే వచ్చునేమో?

దేవ—గాలివాన వచ్చుటచేతఁ గాలక్షేప మిఁకఁ గట్టివేయవచ్చును. బట్టలారవైచితిని. తడిసిపోవునేమో విప్పి జాగ్రత్త పెట్టెదను.

విప్ర—పోయి శీఘ్రముగ రమ్ము. తడిసిపోవుదు వేమో సుమా?

(దేవదేవి పోవును.)

శ్రీ—(విప్రనారాయణునికాళులు పట్టుకొని) స్వామీ! పడిపోవు చున్నారు. భక్తినినిలుపుకొనరా? అయ్యయ్యో! దేవదేవిముండ మిమ్ములఁ బాడుచేయుచున్నది. మీసెల వగునెడల దానిని జెప్పునఁ గొట్టి యీడ్చివైతును. లేదా మన మెక్కడకైనఁ బోవుదము రండు.

విప్ర—నామూలమున దాసికిఁ గూడ భక్తి జాలుచున్న దఁట. నేను భ్రష్టుఁడ నైనను నాకు నీవు దో డుందువు. కాని పాపము ! అది భ్రష్టతనొందిన దాని కింక దిక్కెవ్వరు? మనల నింత కాలమునుండి కనిపెట్టుకొని యున్నదానినే మనము నిరాక రించుట న్యాయమా ?

శ్రీ—అది యిప్పుడు భ్రష్టురా లగుట యేమి? పుట్టినప్పుడే యైనది. వంశానుక్రమముగ నైనది. అది మీకొంపఁ గూల్చుట కిక్క డకుఁ జేరినది. అయ్యయ్యో! రక్షించుకొనుఁడు.

విప్ర—నన్నుఁ బాడుసేయుటకు దానియుద్దేశ మేమి? వారకాంతకుఁ గావలసినది ధనముకద! అది నాయొద్ద లేదుకద! స్వరూపలా వణ్య మంతకంటె లేదు కదా! ఏమి మూటగట్టుకొనవలయు నని యది నన్నుఁ బాడుసేయ నున్నదో చెప్పు.

శ్రీ—పాపము. మహాపాపము.

విప్ర—ఐహికఫలవాంఛా లేశమైన లేకుండ బుద్ధిపూర్వకముగఁ బాపము మూట గట్టుకొనుట ప్రాణికోటికి సహజమా ?

శ్రీ—నేను మీ కుత్తర మీయఁజాలక యున్నాను. కాని దానిచే మీరు పాడగుట నిశ్చయము.

విప్ర—అకారణముగఁ బాడు కావలసివచ్చినప్పుడు—ఈజన్మమునఁ గనఁబడసికారణముచేఁ బాడు కావలసినప్పుడు—అనఁగఁ బూర్వజన్మప్రారబ్ధకారణమే భ్రష్టత కీడ్వవలసి నప్పుడు— ఎవఁడేమి చేయఁగలఁడు? ఏ మగునో కానీ!

శ్రీ—ఏమగుట కే మున్నది? ఇఁక వేశ్యావీధిని వెట్టిమొగము వేసి కొని మీరు విటాధములు కానై యున్నారు.

విప్ర—ప్రారబ్ధ మటులుండఁ దప్పునా?

శ్రీ—మనమతముల కన్నిఁటికిఁ బూర్వజన్మప్రారబ్ధ మను నీదిక్కు-

మాలినయందొకటె మొకటి దాపరించి యందఱిని భ్రష్టులఁ జేయు టయేకాక, తిరిగి బాగుపడకుండ భ్రష్టతలోనే యొక సంతుష్టిని గలుగఁజేయుచున్నది.

సీ. ద్యూతంబునను గోఁచి ♦ పాతరాయండయి
  ప్రారబ్ధమున నిట్టు ♦ లైతి ననును
కలుఁద్రావు మత్తునఁ ♦ గాంతగాంతుకఁగోసి
  ప్రారబ్ధమున నుఱి ♦ వచ్చె ననును
ప్రబలదురాశఁ జౌ ♦ ర్యం బాచరింపుచుఁ
  గారలోఁ బడఁ బూర్వ ♦ కర్మ మనును
వ్యభిచారమున నోడ ♦ లంత పుచ్చినఁ బురా
  కృతకర్మమునకు న ♦ డ్డేది? యనును
ఇట్లు మగనాలిఁ జెఱిపితి ♦ వేల యనిన
నిది వెనుకజన్మమున నన్ను ♦ నిట్లొనర్చెఁ
బూర్వకృతఫలం బిది కాని ♦ బుద్ధికృతము
గాదనును-బుద్ధి లేకుంట ♦ కల్ల గాదు.

సీ. చదువు లేకుండ న ♦ జ్ఞత నుంటి వేలన్న
  యోగ ముండిన నన్ని ♦ బాగుపడును
ముసలిపందకుఁ గూఁతు ♦ నొసఁగుట తగదన్న
  దశమున్న నైదువ ♦ తనము నిలుచు
వ్యాధికి వైద్యంబు ♦ వలదంధు వే లన్న
  నాయువే తగ మందు ♦ లడ్డుపడునె
దైవముం దలఁపమి ♦ తగదన్నఁ బుణ్యమా
  గతి యున్న సద్బుద్ధి ♦ కలుగు ననును
జనుఁడు; దైవ మొసంగిన ♦ స్వల్పబుద్ధి
నైన వినియోగమును జేయ ♦ కకట! సౌఖ్య

మందలేక యీయఁగలేక ♦ వ్యర్థుఁ డగుచు
నన్నిఁటికి నెత్తిగీతనే ♦ యెన్నుచుండు.

స్వామీ! ఏమో పరాకుగా నున్నా రేమి?

విప్ర—నీ వేమంటివో వినుటకు నాకిప్పుడు తగినంతచిత్తశాంతి లేదు. చూడు! ఈవర్షమెందుచేతనో కాని నాకు మనోవికారమును వృద్ధిచేయుచున్నది సుమా!

శ్రీ—అలాగా! మీమనసునుండి భక్తి నశించినది. శృంగారరస మంకురించినది.

గీ. వర్షపాతము స్త్రీవాంఛ ♦ ప్రబలఁ జేసి
తుదకు విరహుని స్త్రీప్రక్క ♦ నదుకు పెట్టు
నెట్టినీటిప్రవాహంబు ♦ వెట్టికుక్క
విసము వెలిపుచ్చి మృతిప్రక్కఁ ♦ బెట్టునరుని.

(నేపద్యమున) ఉరుములు మెఱుపులు,

విప్ర—శ్రీనివాసా! నీ కొకమాట చెప్పెదను విందువా?

శ్రీ—హితమును నిరాకరించుటకు నా కేమివికారము సంభవించినది?

విప్ర—ఇఁక నట్టిప్రశంస వలదు. ఉరుములు మన కే భయంకరములుగ నున్నవి. పాపము! మనబట్టలు తడిసిపోవు నేమో యని పరుగెత్తిన దేవదేవియింక రాకున్నది తడిసిపోయినదో! గాలిచే నెక్కడ నైనఁ బడిపోయినదో! నీవు పోయి యామెను దీపికొని రమ్ము.

శ్రీ—దానిని వదలుకొనవయ్యా యని నేను దేవులాడఁగ దానిని దీసికొనివచ్చి నాయెదుటఁ బెట్టు మని మీరాడ న్యాయమా?

విప్ర—దానిని గాఢాంధకారమున నశనిపాతభయంకర మగు నిట్టి వర్షమున నొక్కతెను నిరాచ్ఛాదనస్థితిని త్యజించుట మాత్రము న్యాయముగా నున్నదా?

శ్రీ—అది తడువనే తడిసినది. నన్నుఁగూడ నేల తడిపెదరు?

విప్ర—పురుషుఁడవు. దానికంటె నెక్కువవస్త్రములు గలవాఁడవు. నీకేమి? పొమ్ము. ఇఁక నాలస్యము చేయకుము.

శ్రీ—అటులైన బోయెదను. అయ్యా! నమస్కారము. ఇఁక మిమ్ముఁ పుట బ్రహ్మాతరము గాదు (పోవును)

విప్ర—ఇంక రాలేదు. చెట్లకొమ్మ లేమైన విఱిగి మీఁదఁ బడినవో? దారిగానఁబడక నేదైనఁ గాలికిఁ దగిలి పడెనో?
(నేపథ్యమున) హాహాహా! చలి, చలి, చలి! హాహాహా!

విప్ర—అదిగో! అదిగో! దేవదేవీ! తడిసిపోయితివా?
(నేపథ్యమున) చలి, చలి, చలి! హాహాహా!

విప్ర—ఆహా! దైవకటాక్షమున నిప్పుడే మెఱుపు మెఱయుటచేఁ గనులుచు, దత్కాంతివలన నార్ద్రవస్త్రధారిణియగు నామెదర్శనమున హృదయము నొక్కమాఱు తళుక్కుమనిపోయినది. చలిచేత బాధపడుట యేల? ఇదిగో! నాయుత్తరియమును జుట్టఁబెట్టుకొనుము (అటు పాఱవైచును.)
(తనలో) పాపము! చలిచే నెంతబాధ పడుచున్నదో! (ప్రకాశముగ) కట్టుకొను చున్నావా?
(నేపథ్యమున) ఆ!

దేవ—(ప్రవేశించి) చలిచలిచలి! (వడఁకుచు దగ్గఱకు వచ్చును.)

విప్ర—సందేహింపకు. సందేహింపకు. దగ్గఱకు రమ్ము మనుష్యుని వేఁడిమి మంచిది.

దేవ—హాహాహా. (కౌఁగలించుకొనును.)

విప్ర—హాహాహా! ఏమియానందముగ నున్నది! హాహాహా!

దేవ—మన మాపక్కనుండు గదిలోనికిఁ బోవుదము. శ్రీనివాసుఁడు వచ్చు నేమో?

విప్ర—శ్రీనివాసుఁడు నీకుఁ గానఁబడ లేదా?

దేవ—నా కాతఁడు కానఁబడినాఁడు. కాని నేనాతనికిఁ గనఁబడ కుండ వచ్చితిని

విప్ర—సరే. రమ్ము.

దేవ—(తనలో) విష్ణుదాసుఁ డిప్పటికి వేశ్యాదాసుఁ డైనాఁడు. ముకు త్రాడు వోసి యితని నేఁక మా గ్రామములోఁ వేశ్యావీథి కీడ్చుకొని పోవుటయే తరువాయి—

ఇద్దరు నిష్క్రమింతురు.

ఇది చతుర్థాంకము



శ్రీ

# విప్రనారాయణ చరిత్రము.

## పంచమాంకము.

ప్రవేశము—"తిరుక్కరంబనూరు" అనుగ్రామమున వేశ్యావీథి.

(ప్రవేశము—శ్రీనివాసుఁడు, విప్రనారాయణుఁడు.)

విప్ర—దానియిల్లింక నెంతదూరమున్నదో! చూడు! ఆ మలుపేదై యుండునో?

శ్రీ—అదియే నండి! వేశ్యావీథికిఁ దొడ్డక్కము.

విప్ర—పవిత్రములగు వైష్ణవనామముల నేల యపరిశుద్ధి చేసెదవు?

శ్రీ—పవిత్రతము లగువైష్ణవులు భ్రష్టులైపోవు నప్పుడు మాటల లెక్కయేమి?

విప్ర—అట్లు కాదు. భాగవతోత్తములు శాశ్వతులు కాగు. ఎందఱు పుట్టిరో! ఎందఱు భ్రష్టులైరో! ఎందఱు నశించిరో! కాని వైష్ణవసాంప్రదాయ వాక్యములు మాత్రము శాశ్వతములు.

శ్రీ—వాక్యములకంటెఁ జేష్టలు శాశ్వతములుకావా? మొగము కానఁబడకుండ మేలుముసుఁగువైచికొని సందెచీఁకటిని వేశ్యయింటికిఁ బోవు మిమ్మెవరు చూతురని యనుకొనుచున్నా రేమో! ఎవఁడో యొక పనిలేనిచలపాదికవి ద్వాదశోర్ధ్వపుండ్రధారులైన మిమ్ము, దర్భాసనధారుఁడ నైన నన్ను మని మిప్పు డిక్కడ

నున్నట్లువలెనే వేశ్యావీథిరంగమున వట్టిమొగములతోఁ ప్రవేశింపఁజేసి యెదుటఁగూరుచుండు సామాజికులచేత "ఛీఛీ!"యనిపించి వెకవెకవెడనవ్వుల నవ్వించి "ఛూఛూ" యని మీరాదనుమియఁ జేయకుండు నెడల నేను బ్రహ్మణజన్మమునఁ బుట్టినవాఁడనని ప్రమాణము చేయఁగలను. లోకప్రఖ్యాతమై యాచంద్రతారకముగ నిలువవలసిన యీ మీచేష్ట మాపటిమత్తులో మాసిపోవు ననుకొంటిరా? సూర్యునివలె దివ్యతేజమునఁ బ్రకాశించి యవతలి ప్రపంచార్థమునందుఁగూడ వ్యాపించును గాని—ఆహా! అట్టిపనిని జేసినారు మహాత్మా! చాలుచాలు! ప్రపంచ మున్నంతకాలము భక్తలోకమునకు మీచేష్టవలనఁ గలిగిన తలవంపు చాలు! చాలు! నాకు మిమ్ముఁజూడ నేడుపు వచ్చుచున్నది. ఆహా! ఎట్టి మహోన్నతస్థితినుండి యెట్టియథోగతికిఁ గ్రుంకిపోయినారు! ఆహా! ఆకాశమునుండి చుక్కయూడి పడినట్లయ్యెనే! ఇఁకనొక్కమాట కడపటిసారి చెప్పుచున్నాను. నేను మి మ్మిట్టిస్థితిలోఁ జూడలేక—నామనసుండఁబట్టలేక—వెట్టిచేఁ జెప్పుచున్నాను. ఇదివఱకుఁ దిర్వారాధనపుగదిలో నేమిజరిగినదో జరిగినది. దానినిగూర్చి లెంపలువైచికొనియో, తల నేలను మోదుకొనియో, కావేరిలోఁ బడి మృత్తికాస్నానములేడ్చియో యెట్లో యొకట్లు చూచుకొందము. ఇఁక నొక్కయడుగైన ముందుఁ బెట్టక వెనుకకు రండు, పోదము.

విప్ర—నీకు నాయందుఁగల ప్రీతికి సంతసించితిని.

గీ. భక్తిరక్తులు వేఱు తత్త్వములు కావు;
భక్తిదైవానురాగము వనితపైని
రాగమగురక్తి; యది యిది రాగ మొకటె;
తత్ప్రవాహాదిగతులె భేదములు సుమ్ము!

గీ. భక్తి యెదురెత్తుగాన నిం♦పాదినడక,
రక్తి పల్లవువాల్గానఁ ♦ బ్రబలవేగ
యుతము, మార్వడిచేత నా ♦ సతతభక్తి
మఱలి తలక్రిందుగా నట్టె ♦ దొరలు నిపుడు.

గీ. కాలభేద జగతిభేద ♦ లీల కెదిరి
డీకొనుట యానె? మంచిది ♦ మేకొనుటయె;
గాలివానకు నెదురెక్కఁ ♦ గడఁగకుండ
నావికుఁడు దానిగతిఁ బట్టి ♦ పోవుఁగాదె.!

గీ. అడఁచిపెట్టిన రక్తి హే ♦ త్వంతరమున
వెలిఁబడినయప్డు భీకర ♦ చలన మొందు
నట్టె బిగువుగ దట్టించి ♦ నట్టిమందు
రంజకం బంటి ఘామ్మని ♦ ప్రబలునట్లు.

గీ. లో నడంచిన రస మొక్క.♦ లోపమునను
బై బడినయప్డు ప్రబల దు ♦ ర్భరతఁ బొందు
నావిరిని నిండుపాత్రకు ♦ నంతదారి
నీయ బుస్సను ధ్వసితోడ ♦ నెగసినట్లు.

గీ. అడఁపఁబడుచు హఠాత్తుగా ♦ నతిశయిల్లు
నట్టిరక్తికి దయ్యంబు ♦ పట్టినట్టి
మనుజునకుఁ గల్గు నంత సా♦మర్థ్య ముండు,
పిచ్చివానికిఁ గలయంత ♦ వేగమమరు.

గీ. అస్వభావశక్తిని స్వభా ♦ నాల్పశక్తి
తో నెదుర్కొనఁ దరమానె? ♦ శ్రీనివాస!
చచ్చుపాపటగొట్టాన ♦ వచ్చునట్టి
చిన్నకాయకు ప్రేలడ్డు ♦ సేయఁ గలమె?

గీ. కాన ప్రస్తుతావస్థాస్థ ♦ మైన పనిని
జూడఁదగుఁ గాని యెఱుకింపఁ ♦ గూడ దయ్య!
ఇద్ది మార్వాడి యని యంటి ♦ నిద్ది యెంతొ
వఱకు నుండదు పడిలోనఁ ♦ బడుదుఁ దిరిగి.

శ్రీ—అందుచే దైవభక్తుల రగుమీరు దాసిదానియింటికి దానిదర్శనము నిమిత్తమై దయచేయుటయే తారక మార్గ మని కాదా యభిప్రాయము?

విప్ర—అభిప్రాయమే కాదు. ఆచరణముకూడ నటులే.

శ్రీ—సరే. అటులైన దయచేయుఁడు. ఇక్కడనుండియే వేశ్యకొంప లారంభమని చెప్పితిని గాదా? తన యింటిగురుతులఁ గూర్చి యది మీకుఁ జెప్పినమాటలు జ్ఞప్తియున్నవా?

విప్ర—బాగుగ నున్నది. అదిగాక యెంతయో మనస్సంభ్రమముతో నది నాకొఱకు గుమ్మములోఁ గనిపెట్టుకొని యుండదా? ఎప్పుడువత్తునో యెప్పుడువత్తునో యని యెదురుచూచుచు నేమియుఁ దోఁచక మహాందోళనమున నుండదా? దానికిఁ గూడ నాయట్టియవస్థయే సిద్ధించినది. కాన దానికిఁగూడ నాపై ననురాగము ప్రబలముగ నుండును. తానువచ్చి నన్నుఁ దనయింటికిఁ దీసికొనివెళ్ళెద నని చెప్పినదే? ఏమితొందరచేత రాలేదో? దానిని జూచువఱకు నా మనసు శాంతిగ నుండదు.

శ్రీ—సరే. రండు. నడుచుచున్నాముగదా?
(నేపథ్యమున) అడియేన్ దాసోహం! అడియేన్ దాసోహం!

విప్ర—దాసోస్మి! దాసోస్మి! దాసానుదాసోస్మి!

శ్రీ—ఈసమయమున మీరట్లు లనఁగూడదు. (తనలో) ఇప్పుడు నమస్కరించినముండకొడుకు పిల్లివలెఁ జీఁకటిలోఁ గూడఁ జూడఁగలఁడు గాఁబోలు!

విప్ర—ఎందుచేత?

శ్రీ—మీరు సందెచీఁకటిని ముసుఁగువైచికొనిపోవుచు మాటలాడు దురా?

విప్ర—సందెచీఁకటి తనయంతఁ దాఁ బడెను గావున వచ్చితిని. నీవు ముసుఁగువైచితివి కావున నే నొప్పుకొంటిని గాని నాకేమి భయమా? నాకున్నదోషము దేవదేవీవాంఛ. అంతే కాని నాకుఁ బిఱికిదనమేమి? అదిగాక యాచార్యుఁడు నమస్కరింపఁ బ్రతినమస్కారము సేయకుండుట తప్పుగాదా?

శ్రీ—అతఁడాచార్యుఁడఁటయ్యా? జారుఁడు! పరిహాసమునకు నమస్కరించుచున్నాఁడని తెలియ వలదా?

(మాధవుఁడు ప్రవేశించును.)

మాధ—ఓహో! ఓహో! భాగవతోత్తములు కాఁబోలు! ఈ పట్టె వర్ధనములేమి? పణ్యవీధీసంచారము లేమి? వక్షమునఁ దట్టెఁడు తులసిపూసలపేరు లేమి? వారకాంతాదర్శనాభిలాషయేమి? కాషాయధారణయేమి, కాంతానురాగ మేమి? ఆచార్యపురుషులు దిగ్విజయార్థమై వేంచేసితిరి కాఁబోలు! హేహేహే! ఈ వాడసానులలో మీకెవ్వరైన శిష్యురాం డ్రున్నారా?

విప్ర—ఒక్కతె యే! దేవదేవియనునది మాత్రము.

శ్రీ—(అపవారించి) అయ్యయ్యో! ఆమాటయేల చెప్పవలయునయ్యా?

మాధ—దేవదేవియే! అప్సరసవంటి శిష్యురాలిని సంపాదించితిరే? దానికి సమాశ్రయణము చేయుటకు వచ్చినారుగాఁబోలు!

విప్ర—అది యిదివఱకే యైనది. తిరుమంత్రార్థోపదేశమైనది. దాని బుద్ధి మంచిది. కాని, నావలెనే దానికిఁగూడ నన్యోన్యాశ్రయమూలమున రంగభక్తి తగ్గినది. ఇప్పుడు దానిపై ననురాగమున నే నిటకుంవచ్చితిని.

శ్రీ—(అపవారించి) బట్టబయలుసేయు వేల? ఈకర్మ మెప్పటిదైన నెఱుఁగుదురా? అయ్యయ్యో! ఎంత ప్రారబ్ధము!

విప్ర—(అపవారించి) శ్రీనివాసా! నీ కిది యేమి వెఱ్ఱి! నాదోష మున నేను గాంతానురాగుఁడను గావలసివచ్చెను గాని యసత్యవాది నగుటకు నా కేమి కర్మము?

మాధ—మీకును దానికిని సంబంధము జరిగినది కాఁబోలు నేమి?

విప్ర—శారీరసంబంధ మింతవఱకు జరుగలేదు.

శ్రీ—(అపవారించి) స్వామీ! ఇప్పుడేల యసత్యమాడితిరి?

విప్ర—(అపవారించి) అసత్యమేమున్నది?

శ్రీ—(అపవారించి) మీరు దేవతార్చనపుగదిలోనికిఁ బోయితిమని చెప్పితిరి కాదా?

విప్ర—(అపవారించి)ఔను. శీతబాధానివారణమునకై యదిరమ్మనెను.

శ్రీ—(అపవారించి) అదియుఁగాని మీరుగాని యచ్చటఁ దొందర యేమియుఁ బడలేదా?

విప్ర—(అపవారించి) ఏమియుఁ దొందరలేదు. తనయింటికి నన్నుఁ దీసికొనిపోవుదునన్నది. సరే యంటిని. ఇదివఱకురాలేదు. అందుకొఱకు నేనే బయలుదేరితిని.

శ్రీ—(తనలో) ఇది యేమి? వింతగనున్నది. అసత్యమాడువాఁడు కాఁడు. హా! దైవమా! ఈతని యీపరిశుద్ధత నింకఁ గాపాడుము.

మాధ—స్వామీ! అటులైన నిదివఱకు మీకు దానికిఁ జరుగనే లేదు. దానికి మీపై ననురాగమున్నదా?

విప్ర—దానికిఁ బూర్ణముగనున్నది యదేకాదా?

శ్రీ—(అపవారించి) నరుని దేహమును జంపువాఁడు పరమక్రూరకిరాతుఁడైయుండ నాతని యాత్మను శరీరమును గూడఁ జంపునది యనురాగ పరిపూర్ణురా లనెద రేమి?

మాధ—(తనలో) ఈ పంగనామాలబాపనయ్య యుకాలపు వెఱ్ఱిముండ కొడుకు. దారితప్పి నూతనశృంగారమునఁ బడినాఁడు. ఈతని యొద్ద విశేష ధన ముంటచేఁ గాఁబోలు టక్కులాఁడియైన దేవదేవి యీతని యజ్ఞపశువుగఁ బట్టినది. ఈతనివలన నాకుఁగూడ నేమైన లాభింపవచ్చును. (ప్రకాశముగా) నేనీ వేశ్యావీథిస రెండు పుష్కరములనుండి కనిపెట్టుకొని యుంటిని. మీవంటివారి పుణ్యమునఁ బొట్టపోసికొనుచుంటిని. వేశ్యలలోఁ బ్రకృతులు బహువిధములు. ప్రపంచమే యట్లేడ్చుచున్నదిలెండు. పదుచూఁదనము గలిగినదానివలె, పైకి గనఁబడినంతమాత్రమున నది యౌవనవతి యని మన మనుకొనఁ గూడదు. చిత్రకాలము! ఊడిపోయిన పండ్లకుఁ గట్టుడు పండ్లు కద! నెఱసిన వెంట్రుకలకు రంగు కద! ముడుతల మొగమును సాఁగదీయుటకు జిగుళులు గద! పాలిపోయిన దౌడలకుఁ బూఁతలు కద! ఆశ్చర్యము! మొక్కజొన్న పొత్తివలె నున్న మొగమునకైన మెఱుఁగులు కద! ఇది గాక, అత్తరువులని—అగరునూనె లని—దూదిమెత్త లని కొబ్బరిచిప్ప లని—గోరంటాకు లని—ఇంకనేమోయని పెద్ద పెట్టె పట్టినంత సామగ్రి కద! మేళములో నాడుచున్నంతసేపు కన్నులు మొగముమీఁదఁ గద! ఇంటికి వచ్చిన తరువాతఁ జిలుక కొయ్యలను గద!

శ్రీ—అదియేమి?

మాధ—అయ్యో! ఎఱుఁగవా? నూటికిఁ బదుగఱుసానులకుఁ జేత కన్నులు! ఇదికాక, కొందఱు కొబ్బరికాయవలెఁ గొఱుక రాని కొయ్యలుగఁ బైకిఁ గనఁబడి లోన రసపూర్ణహృదయమును గలిగియుందురు. ఇట్టివారిని నెత్తి వాయఁగొట్టి యను

భవింపవలయును. కొందఱు పనస తొనవలెఁ బైకి మధురము గను మృదులముగ నుండి యనుభవింపఁ బోవుసరికిఁ గటు కు్కనఁ గఠినముగ మనస్సు నష్టపెట్టుదురు. ఇట్టివారల దేహాత్మవిచ్ఛేదముచేసి యనుభవింపవలయును. మఱికొందఱు పైకిఁ గఠినముగనే లోనఁ గఠినముగనే యుందురు. ఇట్టివారిని బటికబెల్లమును జప్పరించినట్లు మెల్లమెల్లగఁ గరఁగింపఁజేసి యనుభవింపవలయును. కొందఱు యెండి చచ్చిన ట్లుందురు గాని సీమమిరియపుఁగాయవలెఁగారమునఁ గ్రిందిగ్రుడ్లు మీఁదికిరాఁ జేయుదురు. కొందఱు బుట్టమిరియపుఁగాయలవలె బుంగలై యుండుటయే కాని పిరి నూరబెట్టి యెండబెట్టి కాల్చినఁగాని యనుభవింపఁదగదు. కొందఱు సున్నితముగ శలాకవలె నున్నను చేరవాళి చెఱకువలె మిక్కిలి మధురముగ నుందురు. మఱికొందఱు బొంతచెఱకువలెఁ బూర్ణలై యున్నను గానుగ నాడి యేదో యింతతుక్కుతోఁ ద్రొక్కి బుట్టలు కట్టి పాటకపుజాతి యనుభవమునకుఁ బాఱవైచి సొమ్ము చేసికొనుటకు మాత్ర మక్కఱకు వత్తురు. కొందఱు పండుక్రోఁతులవలె నెఱ్ఱమొగములతోఁ—గొందఱు కొండ ముచ్చులవలె నల్లమొగములతోఁ గొందఱు చిరుతపులుల వలె నొడలినిండ మచ్చలతోఁ—గొందఱు దుప్పివలె శ్వేతపు డాగులతోఁ—గొందఱు తిర్యఙ్ముఖములతోఁ—గొందఱు పార్శ్వముఖములతోఁ—గొంద అధో ముఖములతో—

విప్ర—అయ్యా! మాకీగొడవ యంత నెందులకు?

మాధ—దేవదేవికి మీయెడలఁ బూర్ణానురాగము కలదని మీరు చెప్పుటచేత నింతగొడవ చెప్పవలసివచ్చెను. దాని యనురాగ మెట్లున్న నది మిక్కిలి జాణ. మీరు శృంగారవిద్యలోనింత

నోనమాలలోనేయున్నారు. కావున మీకు నావంటివాని సాహాయ్య మావశ్యకము.

శ్రీ—మీరింతకాల మిటనుండి చేయునది యేమి?

మాధ—పుసుగుడు.

విప్ర—నాకుఁ దెలియలేదు.

శ్రీ—పుసుగు డనఁగ భక్తి పరిభాషలోఁ గొంచెము హెచ్చుతగ్గు పురుషకారము.

మాధ—పురుషకారమే కాదు. స్త్రీపురుషకారము.

శ్రీ—అయ్యా! పక్షి పశువులసంతలోనే కాక పణ్యస్త్రీవ్యాపార మునఁగూడ నున్నదా?

మాధ—పెద్దల నధిక్షేపింపఁగూడదు కాని, యిదిమాత్రము పశువుల సంతకంటె భిన్న మెట్లగును?

శ్రీ—రంగరంగరంగా! అయ్యా! వింటిరా?

విప్ర—నీ యిచ్చటి వ్యాపారమురీతి యెట్టిదో చెప్పుము.

మాధ—నా వ్యాపారమర్మములు తమ కేల? నేను మీకు దేవదేవి ననుకూలముగ సంధానపఱిచి, తద్వేశ్యామాతవలనఁ దమకు బాధ లేకుండఁ జేసి—

శ్రీ—అది నీ వెట్లు చేయఁగలవు?

మాధ—నే నట్టి మాతలకింద దూతను. వచ్చిన సొమ్ము వారు నేను వయస్సునుబట్టి పంచుకొందుము.

విప్ర—మీరు నాకు రాయబారము సేయ నక్కఱలేదు.

మాధ—అట్లనకుఁడు. మనువులను స్థిరపఱుచుటలో దూతలు. మహీనాథుల కార్యములందు దూతలు. మనుజులవ్యాపారము లందు దూతలు. మదనతంత్రములందు దూతలు. మరణము లందు దూతలు. పుట్టినది మొదలు గిట్టెడు పర్యంతము పని యంత దూతలతోడనే యున్నది కాదా?

విప్ర—అయినను మాకు నీతో నేమియు లేదు క్షమింపుము.

మాధ—పురోహితుఁడు లేని వివాహమా ? అధ్వర్యుఁడు లేని యజ్ఞమా ? చారుఁడు లేని రాజనీతియా ? మంత్రసాని లేని ప్రసవమా ? వైద్యుఁడు లేని చావా ? సంధానకర్త లేని సరసమా ? చాలు !

శ్రీ—నీవు పోవయ్యా ! మాతో నీ కేందులకు ?

మాధ—నా సహాయ్యము లేనిదే మీకు శృంగభంగమగుట నిశ్చయము. నేను బోయెదను. కాని నా కేమైన నొసఁగుఁడు.

విప్ర—ఇచ్చుటకు మాయొద్ద నేమి యున్నది ?

మాధ—దర్భాసనపుఁగట్టలో నేమో యున్నదే ?

శ్రీ—ఏమి యున్న నీకేమి ? పోవయ్యా !

మాధ—(తనలో) వీరియొద్ద ధనమున్నది. మొండిముండకొడుకులు నా కీయకున్నారు. నేను ముందు దేవదేవి తల్లియొద్దకుఁ బోయి యామెతోఁ జెప్పెదను. (పోవును)
(నేపథ్యమున) స్కూ ! స్కూ ! (కుక్కలు మొఱుఁగును)

శ్రీ—చూచితిరా ! కుక్కలను మనపై నీతఁ డుసికొల్పుచున్నాఁడు !
(నేపథ్యమున) స్వామీ ! కుక్కలు మీదర్భాసనపుఁ గట్ట నెత్తుకొనిపోవును. జాగ్రత్త !
(మఱియొక ధ్వనితో) ఓహో ! అయ్యవారులవారు కాఁబోలు ! ప్రతివాదిభయంకరులు కాఁబోలు ! హేహేహే ! రావణసన్యాసమోయి ! (చప్పటలు జరచుచున్నారు.)
(మఱియొక ధ్వనితో) రంగదాసు లనంగదాసులైనారు ! ఓహో ! ఆచార్యపురుషులు వ్యభిచారపురుషులైనారు ! వేదమార్గప్రతిష్ఠాపకులు విటమార్గప్రతిష్ఠాపకులైనారు ! తిరుప్పావు కాలక్షేపప్రియులు దేవదేవికొఱకుఁ దిరుపీఘులు వేంచేసినారు. లేవిడీ ! కొట్టు ! కొట్టు !

శ్రీ—మనల వీరు కొట్టుదు రేమో ?

విప్ర—వారికి మన మేమి యపకార మొనర్చితిమి ? భయము లేదు. కాని, వీరు విటులే—నేను విటుఁడనే. వీరును స్త్రీవాంఛచే నిటకు వచ్చినవారే—నేను నట్లే వచ్చినవాఁడనే. వారి చర్యయుఁ దప్పే—నాచర్యయుఁ దప్పే. వారు నన్ను దూర నేల ? నన్నుఁ గొట్టు డన నేల ? వారిని లోకు లేల యిట్లు నిందింపఁ గూడదు ? కుక్కలు సహితము నన్నుఁ గాంచి యేల మొఱుఁగవలయును ?

శ్రీ—గీ. విటతతిప్రవృత్తిగతు లంత ♦ వెగటుకావు;
గృహిణి గర్భాధారిణి యొకి ♦ లింతవలెను
సంగదూరభాగవతుని ♦ జారచర్య
విశ్వనింద్యంబు విధవవే ♦ విళ్ళఁబోలె.

గీ. సంగయుతుల దుర్గతులు హా ♦ స్యంబు లగునె ?
యడుసులోనఁ బందుల పొర ♦ లాటలట్లు
విగతసంగులరక్తి న ♦ వ్వించు నెగురఁ
బోయి పండ్లూడఁ బడువెట్టి ♦ మొగములాగు.

గీ. ఎంగిలాకున సోమరి, ♦ రంగనిగుడి
భక్తుఁ డుంటయె యుచితత ♦ వాఁడు గుడిని
తండు పెంటపై నుండ నిం ♦ ద్యంబు గాదె ?
యనుచితగతి యెట్లైనదూ ♦ ష్యంబు సుమ్ము.

(నేపథ్యమున; సాధనసప్తకస్థాపకాచార్యోత్తమా ! దాసోస్మి దాసోస్మి !

విప్ర—అదేమి ? అదేమి ?

శ్రీ—ఏ మున్నది ? దేవరవారిమహిమము నెవఁడో వర్ణించుచున్నాఁడు. అందఱికి మోక్షోపాయములుగ కర్మ, భక్తిజ్ఞానములుండ మన

వారు ప్రపత్తిమని చాలుగవవానిని జేసుకొనిరి. వారి తరువాతి వారది చాలక మావార్యాభిమానము నైనవవానిని జేసుకొనిరి. దేవరవారు వ్యభిచారాభిమానమను నాలవవానిని గూడ స్థాపించిన మహాచార్యపురుషులని యెవఁడో యనుచున్నాఁడు (నేపథ్యమున) ఓహో. సామాన్యాచార్యపురుషుని వలెఁ గానఁబడుచున్న సీతఁడు నూతనవైష్ణవావతారమోయి! “వందేవిష్ణుం సదానందం వాసుదేవం నిరంజనం” (లెంపలు వైచుకొనుచు) అపరాధుఁడ నపరాధుఁడను.

విప్ర—నేను శ్రీ మహావిష్ణునవతారమ నవికూడా హేళన మొనర్చుచున్నారా?

శ్రీ—శ్రీ.మహావిష్ణువు కృష్ణావతారమున గోపికలిండ్లఁ జేరి వారి నుద్ధరించినట్లు మహావిష్ణుఁడు తిరిగి దేవరవారి యవతారమును ధరించి సానియిండ్లఁ జేరి వారల నుద్ధరింప నని—
(నేపథ్యమున) ఇదే యిల్లు! ఇదే యిల్లు! లోనికి రండు!

విప్ర—అదిగో! కర్ణామృతముగ దేవదేవిమాటలు వినఁబడినది.

శ్రీ—అంతటితో నైనదా? శ్రీరంగమూర్తివలె నది సీఁకు దివ్యదర్శనసేవకూడ నీక సాయించును.
(వెనుకఁ దెరయెత్తఁగా నింటిలో దేవదేవి ప్రవేశించును)

దేవ—దాసురాలు నమస్కరించుచున్నది.

విప్ర—దాసోహం.

దేవ—తుదకు మా కుటీరమును బావనముసేయ దయచేసితిరా?

శ్రీ—(తనలో) మా వనమును శ్మశానమును జేసి—

విప్ర—కుటీర మనిద వేమి? ఓ! దివ్యభవనము!

శ్రీ—వైష్ణవమద్యాదచే న ట్లనుచున్నది లెండు.

దేవ—తా మీ యాసనమున దయచేయుఁడు. శ్రీనివాసా! నీవుకూడాఁ గూరుచుండుము.

(ఇద్దఱట్లు సేయుదురు.)

అక్కా! నీ మఱఁదిగారు వేంచేసినారు. ఇటు రమ్ము.

(మధురవాణి ప్రవేశించును)

దేవ—(అపవారించి) అక్కా! మనయమ్మ రాకుండ నీతనితో నీయెదుటఁ జెప్పవలసినమాటలు కొన్ని యున్నవి.

మధు—(అపవారించి) సరే! (ప్రకాశముగ) దాసురాలి నమస్కార మంగీకరింపవలయును.

విప్ర—ఓహో! ఈమెయేనా నీయక్క!

శ్రీ—(అపవారించి) నా నీయక్క యనెద వేమి? వేశ్య భార్యయగుటయే విరుద్ధమైయుండ వేశ్యయొక్క నీయక్కగూడ నగుటెట్లు?

మధు—అమ్మ యిప్పుడే వచ్చునేమో!

వేశ్యమాత—(ప్రవేశించి) రావోయి! మాదిగయ్యా!

(మాధవుఁడు ప్రవేశించును)

మాధ—(అపవారించి) అత్తా! క్రొత్తవారియెదుటఁ గూడ వెనుకటివలెనే తిట్టకుము. చూడు! నీ కడుపునఁ బుట్టెదను.

వేశ్యమా—నాకడుపున మొగలంజెకొడుకు లేల? నోరుమూయుము.

మధు—అమ్మా! ఇడుగో! నీ చిన్నయల్లుఁడు.

వేశ్యమా—ఏఁడమ్మా! ఏఁడమ్మా! నాయాయనే! నాతండ్రి!

శ్రీ—నేనుగాదు. నేను నీయల్లుని శిష్యుఁడను. (తనలో) ఎంతనిర్భాగ్యముగ స్వస్వరూపనిర్ణయమును జేసికొనవలసి వచ్చెను!

వేశ్యమా—తోడుపెండ్లికొడుకవా? నాయనా! దగ్గరచూపు బొత్తుగా నానదు! ఇదిగో! నాకన్నతండ్రి! ఇడుగో! వావరాలనాయన! నాయన బుల్లిబొజ్జనిండఁ బెద్దకాసులు!

శ్రీ—(తనలో) ఒకగడియక్రిందవఱకు నాయన పెద్దబొజ్జనిండఁ జిట్టిగారెలు!

మాధ—(అపవారించి) అత్తా! గురువుగారి నిర్భాగ్యపుఁబొట్టలో కాదు. శిష్యుని దర్భాసనపుఁగట్టలో—

వేశ్యమా — అమ్మాయీ! నీవు లోనికిఁబొమ్మ. ఒసే ముద్దీ! నీవుపోయి చెల్లెలిని ముద్దుల ఎఱదిగాక్రిపక్కలోనికి సింగారింపవలదా!

స్త్రీ — మాధవా! మధురవాణి ధ్వంసమైకాంబోలు మద్దిక్రింద దిగినదా!

మాధ — నేనుమాధవుఁడ నైననేను జచ్చుమాదిగను కాలేదా!

వేశ్యమా — ఒసే లోనికిఁ బోక యదేపనిగ నేమి చూచె! ఇంకఁ జెల్ల వారినదాఁక వలపులమగనిని జూచుకొనక చేసికొనున దే మున్నది? అబ్బఅబ్బ! బెంగపెట్టుకొనిపోయితివే! నాల్గుజాములు నాలుగేండ్లయిపోయెనే! వచ్చునో రాఁడో! ఏమి పలవ రింతలు! పో పో! లోనికిఁబో! కూడైన దిన్నఁగఁ దినక నకనక లాడుచున్నావు. నీమగని గనిపెట్టుకొని నే నిక్కడ నుందు నమ్మ! ఈ బంగారపుఁబిచ్చుక నెవతెయైనఁ జెంగున మూటఁ గట్టుకొని పాఱిపోకుండ నేఁ గాపుండెదను లే నడు నడు!

దేవ — నేను సెలవు దీసికొని తిరిగి దర్శింతును.

విప్ర — శీఘ్రముగ రావలయును సుమా!

వేశ్యమా — అయ్యో! నాయనా! వలచి వలచి, మురిసిమురిసి, శ్రీరంగమునుండి తెచ్చుకొనిన శెల్వప్పిళ్ళరాయఁడవు కాదా? శీఘ్రముగ రమ్మని చెప్పనేల? మా కాలమునాఁడు మాకుఁగూడ మగలని ముద్దుమగలని, బెదరింపుమగలని, తేరమగలని, వెచ్చపు మగలని, సంతమగలని, మంచముక్రిందిమగలని, మారింటిమగలని ముద్దుచుసుముక్కాలువారు సంక్రమణపుజంగాలవలెఁ దిరుగుచునే యుండువారుకాని మాఱుమంచములేకుండ సానితనము చేసిన చచ్చుపెద్దమ్మలము గాముకదా! అయిననేమి మాకాలములో నీమమకారములుమాత్రము మేమెఱుఁగమమ్మా! మీ బాపన మమకారముచేతనే మడఁగిపోవుమాట యుండునెడల సంతకొంప నొక్కటెక్కమీఁద నెల్లు నిలువఁబెట్టఁగలుగుదును!

మాధ—(తనలో) ఉన్న దొక్క టెక్క యన్నమాటసత్యము. రెండ వది కొయ్యచేయి.

దేవ—అమ్మా! ఒక్క టేసోది చదువకు.

వేశ్యమా—(అపవారించి) నే నెఱుఁగుదు నమ్మా! నీ కిది సోదిలాగు ననేయుండునమ్మా! కడుపునిండినమగఁడు కంటఁబడినప్పుడు కడుపునఁగన్నతల్లి మంటఁ బడవలసిన దని నేనెఱుఁగనమ్మా! కాసంతయన్నఁ గస్సుమనెదవు కాని ఒసే నేనుదెచ్చినదేదో దిగ మ్రింగుటయే కాదా మీప్రయోజకత్వములు! పట్టుమని యొక్క సంసారమును మాపఁగలిగితివా? ఒక్క కొంప దిబ్బచేసితివా? మందుఁ బెట్టి యొక్కముండకొడుకునకు వెఱ్ఱి లెత్తించితివా? ఎంతసేపు సరసులవెంట నీవు తిరుగుటే సరిపోయెను. ఇఁక సాని తనమేమిటి? నా శ్రాద్ధమా? మమకారములతో నొడలు నిండునా? ఇల్లునిండునా? నూఱుముద్దులు పంటికిరింది యొక్క పోఁకబద్ద విలువచేయవు. గంపెఁడు కౌఁగిలింత లొక్కకంబళి పాత విలువచేయవు. ప్రేమలఁట! పొలయల్కలఁట! విరహ వేదనలఁట! నాపిండాకూడఁట! నల్లమడుగఁట!

మాధ—అమ్మా! వేశ్యామాతగారూ!

శ్రీ—(తనలో) శాస్త్రిలగారు, రాజుగారు, పంతులుగారు, అని బిరుదములను ఒతెంచి సంబోధించినట్లు వేశ్యమాతగారూ! యని పిలుచుచున్నాఁడేమి?

వేశ్య—ఎందులకోయి! మాదిగపందగారూ?

మాధ—నీవు దేవదేవిని గూకలు పెట్టకుము చిన్నతనము.

వేశ్యమా—చిన్నతనముకావుననే యేడ్చుచున్నాను. అది గాక సాని దానిసౌఖ్యప్రబదుకనఁగ నెన్నోనాళ్ళా? వేసవి యమితముగఁ గాచియుడుకువాన లారంభించువెంటనే కలుగు విసూచిరోగప్రు

దహాతపావలె నది నాలుగుమాసము లుండునరికి మహాకష్టము. ఆసమయములోనే యానంతెవట్టున కంచరితలలు గొట్టవలయును! ఆ పుణ్యకాలము దాటిపోయినతరువాత సానియమ్మ నారియింటిలోను, జారులున్నవారిగుళ్ళోను, నీక ఘూపదీప నైవేద్యము లిద్దఱను సున్నయే.

మాధ—దేవదేవిమాత్రమూరకున్న దేవి నిక్షేపశాస్త్రాచార్యులవారిని దెచ్చికొన్నదికదా! ఇంతటినుండి దానిప్రతిభ! దానిసంపాదన!

వేశ్యమా—ఆలాగున నంటివి. బాగుగ నున్నది. మానాయన! మా తండ్రి! మా మొహరీలరాయఁడు! ఇదిగో! ఇక్కడనుండి దేవ దేవి తేలవలయును. ఇక్కడనుండి యేదో — పూసయని, పుట్రి యని, గుళ్ళని, గుట్రి యని, కాసని, కట్రి యని, నగ యని, నట్రియని, గుడ్డని, గుట్రయని, ఆకికయని, ఉట్రయని, మేడ యని, మెట్రి యని, భూమి యని, బుట్రి యని—

మాధ—(తనలో) మా కుపయోగించెడు ప్రతివస్తువుతో నొక నిరుపయోగమైనయవస్తువునుగూడ సంధించినది. విటుఁడైన గురువుతో శుద్ధనిరుపయోగనిర్భాగ్యుఁడైన యీ శిష్యు డున్నట్లు—

శి—(తనలో) ఓసి! నీయిల్లు నల్లకాడుగాను. చావునకు సిద్ధమైన ముండవు సంయుక్తాక్షరము లెంతస్పష్టముగఁ బలికితివే. వస్తువున కొక్కొక్క ట్రచొప్పునఁ బెట్టుకొని వచ్చితివి. నీగొంతుకఁ గోయ! మీ కిచ్చుటకు మాయొద్ద నేమున్నది? మా కున్న సర్వస్వము దర్భాసనము — దట్రి — పైత్రాడు — తట్ర — లోనమడిపంచ — మట్ర.

దేవ—అయ్యా! పోయెదను. అక్కా రమ్మ. (ఇద్దఱు పోవుదురు.)

వేశ్యమా—నాబాబునొద్ద నేను గూరుచుండెదను. మాదన్నా! నీ వచ్చుటఁ గూరుచుండుము.

శ్రీ—(తనలో) అగ్ని పరిశాంతినొందుటవలనఁ గదా యెంగిలిబంటి యీకట్టె నిట్టె సమీపించినది.

వేశ్యమా—అల్లుఁ డని యడఁగి యత్తగారికి నమస్కరించుటకు, నత్తగా రసహ్యాయనముగ నల్లు నాశీర్వదించుటకు—నంటి ముట్టరాని—అగ్రకులములోఁ బుట్టితివికదా! మన కింక ముద్దు ముచ్చట లెట్లు తీరును?

మాధ—(తనలో) ముడుపులతో—

శ్రీ—(తనలో) నాకు మరణము సిద్ధించునెడల నీసమయమున మహా ధన్యాత్ముఁడ నగుదును. ఈమాటలు వినలేకుండ నున్నాను. శ్రీరంగదేవునికిఁ దప్ప దేవతాంతరమునకే చేయి మోడ్పని యీమహానుభావుఁ డీముదిముండకు మ్రొక్కఁ దగునఁట! ఆహా! కాలవిపర్యయము! (లెంపలు వైచుకొనును.

వేశ్యమా—నాయనా! నీ స్వేచ్ఛానృత్తి కభ్యంతరము సేయఁగల తల్లిదండ్రులు నీ కున్నారా?

విప్ర—లేరు

వేశ్యమా—[illegible] మే అ[illegible] [illegible]వు [illegible]నా.

శ్రీ—తి[illegible] కు[illegible] [illegible]

వేశ్యమా—[illegible]ప్పి[illegible] మా[illegible] [illegible]ని [illegible] జియొ[illegible]చో[illegible] కిఁ [illegible]—సిద్ధేషము [illegible]సొత్తు[illegible]—[illegible]త్రి[illegible]—[illegible]!—తో[illegible]ట, దొడ్డి కున్నపాయ లేమో [illegible]తా లేమో! ఇప్పటికున్న పిల్లికూన లేమో! అవి యన్నియుఁ దెచ్చికొని—అమ్మాయి యుగదిలో—ఉఁ నీపెట్టెలోనే—మా కొక్కపైస యక్కఱలేదు. నాయనా!

అదీపముతోడు! మాసంపాదితములే మాకుసమృద్ధి! కట్టుది! పట్టికెజ్జీడి! రసపూర్ణతలో—నాయనోయి! చూడు!—లేత ముంజెకాయనంటిది. మావస్తువు మంచిదైనప్పుడు మాకెన్నంటికిం గొదువలేదు. కాని. ఈమణిపూసను నీవు మగఁడగుట కంటె మహాదృష్టములేదు. చక్రవర్తులకుం దగినది మనకుం బెద్దపడుకేల? నాయనా! మీ కేయే గ్రామములలో నెంత లెంతవసతు లున్నవి?

విప్ర—ఎక్కడను లేవు.

మాధ—(అపవారించి) అసత్యము—నమ్మకుము.

వేశ్యమా—మామగా! అల్లుఁడుగారి కొక్కటే సిగ్గు—

శ్రీ—(తనలో) అది లేకపోవుటచేతనే యిచ్చుట నున్నాఁడు.

మాధ—సిగ్గు కాదమ్మా!

వేశ్యమా—కాకపోయినయెడల భూము లెక్కడ నున్నవో తెలిసి నంతమాత్రమున నాతిసొత్తు నెత్తుకొని పాఱిపోవుదు మని భయమా!

విప్ర—అట్టిసందేహము లేవియు లేవు.

శ్రీ—(తనలో) ఉన్నపాత్రెల్ల రంగభక్తి. అది దేవదేవి హరించుకొని పాఱిపోయినది.

వేశ్యమా—శ్రీరంగములో గొప్పతోఁట మీకున్నట్లు నేను వింటిని గదా! ఏల చెప్పకపోయితివి? అల్లుఁడత్తగారియొద్ద నసత్యము లాడవచ్చునను గాఁబోలు! అందులకొఱకె కత్తగారల్లునిబుగ్గగ హాస్యమున కట్టె పొడువవచ్చునను గాఁబోలు!

(పొడువఁబోవును.)

శ్రీ—ఆఁగు! ఆఁగు! అది యేమిపని?

వేశ్యమా—ఓసీ! ఇదేమి వింత? చాలు చాలు! ఎవఁడైన నవ్వుకొని పోవును. అబ్బ! దైవముఖమునుజూచి తగినవానికిఁ జేతులార సాలంకారికన్యాదానము చేసికొనినయత్తగారికి కూడమూట మోసికొనిచ్చిన నీకున్నమాత్రపుస్వాతంత్ర్యములేదా? దగ్గ ఱగఁ బరిశీలించి, అపవారించి) మాదా! ఇదేమో! సుద్దతోను జేగురుతోను బరజాలువేసినగోడవలె నీతఁడున్నాఁడేమోయి!

మాధ—(అపవారించి) భాగవతోత్తముఁ డని చెప్పలేదా?

వేశ్యమా—(అపవారించి) భాగవతోత్తముఁ డని నీవనఁగ భామా కలాపమో, జలక్రీడలో యాడఁదగిన వేషధారి యనుకొంటిని. ఉన్న బండార మీవక్షోవర్ధనములేనా యేమి? ఒడలినిండ నట్ల కట్టులవలె నీ బొట్లేమి?

మాధ—(అపవారించి) అసాంప్రదాయముగ బొట్లనగూడదు. తిరు మణికాపమ్మా!

వేశ్యమా—(అపవారించి) నీతిరుమణికాపుతీర్థముబోను. చెమ్మకాయ లవలె, లాంతరుచట్రములవలె, మూఁడుకొమ్ముల మోడలవలె నిట్టి భయంకరములగు పంగనామా లేమిటోయిబాబూ! ఈతనికి యథార్థముగ నెంతసొమ్మున్నదో కనుఁగొనవలయును.

మాధ—అయ్యా! శ్రీరంగములో నున్నతోట మీదగునో కాదో యత్తగారితో మనవి చేయకపోయితిరి.

విప్ర—అది నాదే.

వేశ్యమా—నాయన! నాతోఁటలరాయఁడు! నాబంగారుతండ్రి! అందు లోని ఫలవృక్షములవలన నెంతరాఁబడి?

విప్ర—ఫలవృక్షము లేమియు లేవు.

వేశ్యమా—ఆఁ! ఆఁ! అదేమి?

విప్ర—పూలచెట్లు కొన్ని యున్నవి.
వేశ్యమా—పూలచెట్లేల ? స్వాలంకారమునకా ?
మాధ—(అపవారించి) శవాలంకారమునకు.
వేశ్యమా—ఆభూమిని విక్రయించిన మొదల నేమి వచ్చును ?

విప్ర—అది నాసొంతము కాదు. దేవస్థానపువారియొద్ద బాడిగకుఁ దీసికొంటిని.
వేశ్యమా—చీ ! చీ ! పోపి ! చరరూపకమైన సొత్తేమైన నున్నదా?
విప్ర—ఏమియు లేదు.
వేశ్యమా—నాతోడే ?

శ్రీ—(తనలో) రంగపాదాలు పోయి వేశ్యపాదాలతో డనవలసి వచ్చినది. మహాదుర్గతి !

విప్ర—ఏమియు లేదు.
వేశ్యమా—చేతిలో చిన్న కాసైన నున్నప్పుడు కదా ప్రక్కలోనికి సాని ?
మాధ—నిజమే! అక్షరమునకు నెత్తిపై నేత్వమున్నప్పుడు కదా క్రిందదైత్వము ?

వేశ్యమా—ఔనయ్యా ! దాసరయ్యా ! ఏ మున్నదని నీ విచ్చుటకు వచ్చితివి ?
శ్రీ—(తనలో) రంగరంగా !
విప్ర—దేవదేవికి నాపై మహానురాగమున్నదని వచ్చితిని.

వేశ్యమా—ఇదియూ నీకున్న సొమ్ము. ఇన్ని పంగనామాలమంగలి కత్తులతో మాబుఱ్ఱలుగొఱుగుటకు వేంచేసిన తిరుమంగలి యాళ్వారవా ? నాయనా ? నడు ! నడు !
శ్రీ—(తనలో) రంగరంగరంగా ! ఎంత మాట వినవలసివచ్చెను ! (అపవారించి) స్వామీ ! పోవుదము రండు.

వేశ్యమా—(అపవారించి) మాధవా ! నేను బోయెదను. ఈనగ్నా సనపుఁగట్టెను నీవు తప్పించుకొని రావలయును.

మాధ—సందేహమా ? ఎంత వారికైన నంతయే యగును.

వేశ్యమా—మాదా ! ఈముష్టి పెద్దమ్మలను గుమ్మము లోనికి రాకుండఁ గుక్కలను గొట్టినట్లు కొట్టుము. నేను పోయెదను.

( వేశ్యమాత నిష్క్రమించును. )

మాధ—అయ్యా ! గురువుగారూ ! నామాట విని యీముసలి ముండ కేమైన నిచ్చిన యెడల మీరు సర్వకార్యదిగ్విజయము కరతలామలకము. మీరు విద్వాంసులు వేశ్యావీథి మర్యాద లెఱుఁగనివారా ? ఏల మీ రుపేక్షించిరో తెలియకున్నది.

విప్రి—ఉపేక్ష కాదు. ధనాభావము.

మాధ—నిజముగ ?

విప్రి—ఆ !

మాధ—అట్లైన మీ రీవీథికి రాఁదగదు. దానములకు దక్షిణలకు, సంభావనలకు, సంతర్పణలకు నిదియేమి యజ్ఞవాటియా? అయ్యయ్యో ! మాసవేతనములకు, వార్షికములకు, వస్త్ర బహుమానకృత్యములకు, ధనసత్కారములకు నిది యేమి రాజసభ యనుకొంటిరా ? అయ్యయ్యో ! బందిపోటుదొంగల భయమున కేల వచ్చితిరి ?

విప్రి—వారిభయము మా కేమి ? వారు హరించునది మా యొద్ద నేమున్నది ?

మాధ—సరి సరి ? అట్లైన ధనాగమునకుఁ గొంతఁ బ్రయత్నించుట మీ కిష్టమా !

విప్రి—ఏమందువు ? శ్రీనివాసా !

శ్రీ—మీయిష్ట మెట్లో య ట్లాచరింపుఁడు. అయినను—

విప్రి—ఏప్రయత్నము చేయుమని యభిప్రాయ మయ్యా!
మాధ—అయ్యా! శ్రీనివాసుఁడు దుర్బలుఁడై యున్నాఁడు. నేను గసిగ వలెనున్నాను. మీకు దేహబలము, దైవబలము కూడ నున్నది. ఊరు మాటుమణఁగినది. చీఁకటిరాత్రి—

విప్రి—ఇఁకఁ జెప్పకుము.
మాధ—వలదనుచున్నారు కాని యింతకంటె సద్యఃఫలద మైనప్రయత్నము మఱియొకటి లేదు. దీనితరువాత ప్రయత్నముచెప్పనా?
విప్ర—వలదు.
శ్రీ—వల దనుట యేల? చెప్పుఁడు.
మాధ—మీరు సంపూర్ణపండితులు స్వరూపగ్రంథములలో నిధులు, మంచి వైదికజ్ఞానసంపన్నులు. అదిగాక, కాసియకుండ వెల యాలిని వశపఱుచుకొనుటకుఁ దగినంతలౌకికజ్ఞానమున నసమానులు. మీరొక్కగ్రంథమును రచియించినయెడల గాగరా కట్టిన భోగముముండ చేతఁ దలకొక్కగ్రంథమును గొనిపించి మీకుఁ గావలసినంతధనముఁ జేర్తును. స్వతంత్రజీవనోపాధులలోఁ గన్నమువేయుట తరువాత గ్రంథకర్తృత్వమే యూరి వారి ధనమును హరించుటకు కుత్తమమైనది.

విప్రి—ఏగ్రంథ మొనర్పుమని మీయభిప్రాయము?

మాధ—అటు లడుగుఁడు. చెప్పెదను. లౌకికవైదికసాంప్రదాయ జ్ఞాననిక్షేపు లగుమీరు కళాశాస్త్రమునకు విశిష్టాద్వైత భాష్యగ్రంథమును రచించినయెడల—

విప్రి—అయ్యా! దాసునిఁ గటాక్షించి వదలిపెట్టుఁడు.
మాధ—మీ రిక్కడ వీథియరుఁగుమీఁదఁ జీకఁటిలో నుండఁదగునా?

మాయింటికి రండు.
విప్రి—క్షమింపుఁడు. నే మిచ్చటనే యుండుదుము.

మాధ—దేవదేవి తిరిగి యిచ్చటకు వచ్చు ననునాస మీ కేమైన నున్నదా?

విప్రు—ఏమైనఁ గాదు. కావలసినంత—

శ్రీ—(అపవారించి) ఉండినయెడల నతనిసంగతి యెఱిఁగియుండియు నతనితోఁ జెప్పదురఁటయ్యా?

మాధ—ఏమి మీ కీ వెఱ్ఱి!

విప్ర—నావెఱ్ఱికంటె దాని వెఱ్ఱి హెచ్చు—దానిహృద్వ్యాఖరి నే నెఱుఁగుదును. ఈ ముసలియామెకుఁ గొంత భయపడినను రాక మానదు. ఆమె నన్నే విడుచునా? ఆమెవలన నాభక్తిచెడెను. నావలన నామెభక్తిచెడెను. ఇద్దఱు మన్యోన్యకారణమున భ్రష్టతను బొందితిమి. మా కిద్దఱ కొక్కటే యంతఃకరణ వృత్తి. ఒక్కటేగతి. శ్రీనివాసా! నీయభిప్రాయ మేమి?

శ్రీ—నాకు మతిలేదు. నన్నేమియు నడుగకుఁడు.

మాధ—అది రసయుక్తహృదయ యనుమాట నిశ్చయము.

విప్రు—రసయుక్తహృదయ యని సామాన్యముగ ననెద వేమి? సంపూర్ణరససంయుక్తహృదయ. దానిహృదయ మట్టిదే కాని యెడల నేనిట్టులై యుందునా? రాకపోవుటయే! ఎంతమాట—శ్రీనివాసా! కాలిచప్పుడగుచున్నది చూడు!

శ్రీ—కాలిచప్పుడు కాదయ్యా! గాలిచప్పుడు. అదిగాక నేను జూచున దెక్కడ? తలుపు వేసియే యున్నది.

మాధ—ఆమె వచ్చునెడల నీద్వారముగుండ రాదు. ఈప్రక్క తెరువులో దొడ్డిగుమ్మ మున్నది. అది నీకుఁ జూపించెదను. నాతో వచ్చెదవా?

శ్రీ—అంతయావశ్యకత యిప్పుడు లేదు.

విప్ర—శ్రీనివాసా! లేదందు వేల!

శ్రీ—ఆమె యిప్పుడే రాసై యున్నదని మౌనమ్మకమై యుండ నగత్య మేల ?
విప్ర—ఈసారి గొళ్ళెమును జేయు గళుకు వినబడినది. వేగ బొమ్మ.
శ్రీ—ఇది మనసులోని యులుకు.

మాధ—అట్లు లనఁగూడదు. నేనుఁగూడ వింటిని.
విప్ర—చూచితివా ?

శ్రీ—సరే ! మందిదే. రానేవచ్చును. ఇఁక బోవ నేల ?
విప్ర—నాయనా ! పొమ్ము. నామనసు మహానందోళనమొందుచున్నది.
శ్రీ—(పోవును)
మాధ—(సంచి తీసికొని) నా మనసు మహానంద మొందుచున్నది.
(పాఱిపోవును)
విప్ర—శ్రీనివాసా ! త్వరగ రమ్ము (లేచును.)
శ్రీ—(వచ్చి) వచ్చినదా ?
విప్ర—పోయినది.

శ్రీ—సాని వచ్చి యప్పుడే పోయినదా ?
విప్ర—సాని కాదోయి ! సంచి-అందులో సాలగ్రామము లున్నవి.
శ్రీ—అయ్యయ్యో ! నేను బోయెదను.

విప్ర—నేనిప్పు డిక్కడ చేయునదేమి ? రేపుసాయంకాలమునఁ దిరిగి వత్తము. అంతవఱ కేచ్చటనైన నుందము. తలుపు మూసియే యున్నది కద.

శ్రీ—ధనహీనునియెడల సానిదానిహృదయమువలె—
విప్ర—హా ! దేవదేవీ ! దేవదేవీ !
(ఇద్దరు నిష్క్రమింతురు)
(దేవదేవి ప్రవేశించును)
దేవ—అక్కా ! ఇటు రమ్ము.

మధు—(ప్రవేశించి) నాకు నిద్ర వచ్చుచున్నదని చెప్పిన వినక తిరిగి యిప్పు డిక్కడ కేందులకుఁ బిలిచితివి ? అదిగాక నీభర్తతో నాయెదుటఁ జెప్పవలసినమాట లేమి యున్నవి ?

దేవ—రమ్ము. ఎట్టిమాటలఁ జెప్పెదనో.

మధు—నా కాతని జూడ సిగ్గమ్మా !

దేవ—నేనుగూడ నుండునుగాదా రమ్ము. (గుమ్మమునొద్దకుఁబోయి) హా ! ఇదియేమి ? ఆ మహానుభావుఁ డేఁడీ ? ఏఁడీ ! ఎటకుఁ బోయెనో ?

మధు—అమ్మ భర్తురా లంటివికాదా ? అమ్మచేసినపనియే యిదియై యుండును. ధనశూన్యముగ రానేల యని యేమిదుర్భాష లాడ సహింపలేక యాతఁ డెటకైన బోయెనేమో ? పాపము ! నీకు మిక్కిలి సంతాపకరముగ నున్నది కాబోలు !

దేవ—నాకు సంతాపము లేదు. సంతోషము లేదు. ఆతని జూడ వలసిన యావశ్యకత స్వల్పముగఁ గలిగి వచ్చితిని.

మధు—నాయెదుట నీ వాతనితో నాడవలిసినమాట లున్నవని చెప్పితివి. అవి యేమి ? అదిగాక, మనసమయము ననుసరించి నా దాస్యమునకు నీ వేల యంగీకరింపకున్నావు ?

దేవ—నాకు నీదాస్య మక్కఱలేదు. నీపక్కఱలేదు. మాయమ్మ యక్కఱలేదు. ధన మక్కఱలేదు. ఏమియు నక్కఱలేదు. ఈయంశములు నీతోఁ జెప్పరమ్మంటిని.

మధు—అమ్మ తెలివితక్కువచేత నట్లు జరిగినది. ఆ మహానుభావుఁడే తిరిగి వచ్చును.

దేవ—నా కాతఁ డక్కఱలేదు. ఈ వేశ్యావృత్తితోడనే పనిలేదు. (నగ లొలిచి) ఈ నిర్భాగ్యపుఁ దుక్కుతో నాకుఁ బనిలేదు. (పాఱవైచును.)

మధు—అయ్యయ్యో! ఇదియేమి? విప్రనారాయణునితోఁ గొంత యావశ్యకత గలిగి వచ్చితి నంటివే?

దేవ—ఔను. ఇక్కడ నున్న యెడల మాటలాడఁ దలఁచినాను. మాట లనఁగ నేమున్నవి! అతనితో నా తప్పు నొప్పుకొని క్షమించుమని గోరఁ దలఁచితిని. లేఁడు. అతనిదారి యతనిది. నాదారి నాది.

మధు—చెల్లెలా? అ ట్లందు వేల? ఏమో రోజుచున్నా వేమి?

దేవ—ప్రపంచమున నిదివఱకుఁ బుట్టినవేశ్యలందఱు తమ యావజ్జీవములలో సంపాదించుకొనిన మహాపాపముకంటె సహస్రాంశము లధికమైన పాపమును నే నొక్కతె నొక్కయాఱుమాసములలో సంపాదించుకొంటిని. అందులకు నాకుఁ జింత లేదు. జరిగిపోయినది. చింతపడిన వినియోగములేదు.

మధు—కాని యిప్పుడు నీ వేమందువు?

దేవ—చెప్పలేదా? నాకుఁ బ్రాపంచికసంబంధ మేమియునక్కఱలేదు.

మధు—మహాభక్తుఁడైన వానిని సంపూర్ణభ్రష్టుని జేసి యాతని నిప్పుడు విడిచిపెట్ట న్యాయమా?

దేవ—అతఁడు సంపూర్ణభ్రష్టుఁడు కాలేదు. చేయుటకు నాతరము కాలేదు.

మధు—నాకుఁ దెలియనిమాటలఁ జెప్పుచున్నావు.

దేవ—విప్పి చెప్పెదను వినుము. ఎన్నరాని లంజెవేశములు వేసి యాతనిని మడిగదిలోనికిఁ దీసికొని పోయితిని.

మధు—తరువాత—

దేవ—ఆయన బ్రహ్మచర్యవ్రతమునకు భంగము కలుగఁజేయవలయునను దురుద్దేశముతోఁ గౌఁగిలించుకొనుసరికి నా యొడలా పాదమస్తకము భగ్గుభగ్గున నిప్పులతోఁ గాల్చినట్లు మండి

పోయెను. నిలువుననట్లు కాలిపోవుచుంటి ననుమహాభయముచే నేనుండఁ జేతులు తమంత తామె పట్టువదలిపోయెను. వెంటనే యొడలిమంట చల్లాఱెను.

మధు—ఏమి వింతగ నున్నది?

దేవ—మన కిది వింత గాని, దుస్సహ తేజస్సంపన్నులైనభక్తుల కది వింత కాదు. అంతకుముం దనేకపర్యాయము లాతని స్పృశించితిని గాని యట్టియవస్థ నాకుఁ గలుగలేదు. ఆతఁ డప్పటికిఁ గొంత భక్తిచ్యుతి గలవాఁ డయ్యును రంగఁ డాతనిని—నీవు చెప్పినట్లు — సంపూర్ణభ్రష్టుఁడు కాకుండ రక్షించినాఁడు. అంతట నా కేమియుఁ దోఁచక బొత్తుగఁ బెదరిపోయిన మతితో నిల్లు సేరితిని.

మధు—అందుచేతనా వచ్చినప్పటినుండియు నేమో వెఱ్ఱిదానివలె నుంటివి? విప్రనారాయణవిరహముచేనట్లుంటివనియనుకొంటిమి!

దేవ—అది మీ వెఱ్ఱి—శ్రీరంగము పోయి యాతనిని నాయింటికిఁ దోడితెత్తు నని యాతనిమహోవాంఛపై మాటవరుస కంటిని. అట్లు నేను బోకపోవుటఁ జూచి యాతఁడే యిచ్చటకు వచ్చినాఁడు.

మధు—బ్రహ్మహత్యఁ దెచ్చుకొంటిరి కదా? మనపంచలఁబడి దేవులాడు నీబ్రాహ్మణు నిప్పు డేమి చేయవలసినది?

దేవ—మనమూ చేయవలసినది? అజ్ఞానము—వేశ్యాకులమునఁ బుట్టి తరతరములనుండి వచ్చుచున్న పాపగంధవిషసంపర్కమును రక్తమునఁ బూర్ణముగఁ గలిగి పెద్దదాననైనదిమొదలు నిరంకుశముగ వ్యభిచారమొనర్చిన నేనే భక్తుని సంపూర్ణ సంస్పర్శచే—అది యొక్కమిష—కాని యథార్థముగ నీవు చెప్పినట్లు దైవేచ్ఛచే—పాపించిక సుఖవిరాగినైనై—భక్త్యంకుర

సహితహృదయునై యున్నప్పుడు — మహాత్ముఁడు పరమ భక్తుఁడు, లింగభేదమే యెఱుఁగని రంగదాసుఁడు, ఆహా, దైవసముఁడు-అట్టి లోకోత్తరుఁ డొక్క-సారి—పురాకృతపాప శేషమున వేశ్యావీధికి రాఁగ నంత యేనా? తిరిగి భక్తుఁడు కాఁడా? అందులకు మరమేమిచేయవలసియున్న దనుచుంటివా! ఎంతమాట! తల గిఱ్ఱునఁ దిరిగి, దేహ మవశమై, పడిపోవుచు, క్రుంగినప్పుడైన, నేలఁ బడకుండ నాతనిని రంగఁ డుద్ధరించి నాఁడే? ఇప్పు డారంగఁ డెక్కడకుఁ బోవును? ఆతనినిగూర్చి నీకు విచార మక్కఱలేదు. నన్నుఁగూర్చి యంతకంటె నక్కఱ లేదు. నేనుఁ బోయెదను. నమస్కారము.

మధు—ఎక్కడకు? తిరుగ విప్రనారాయణునియొద్దకుఁ బోయెదవా?

దేవ—అయ్యయ్యో! ఒకనితో లేశమైన నిమిత్తము లేదని చెప్పఁ దిరిగి యట్లడుగుదువేల? విప్రనారాయణునితో నాకేమి? నాతో నాతని కేమి? నాకొక్క శ్రీ మహావిష్ణువుతోఁ దప్ప నితరవస్తువుతోఁ బని లేదు.

మధు—నీ విట్లు బోయితివని తెలిసినయెడల నమ్మ బెంగపెట్టుకొని చచ్చిపోవునేమో?

దేవ—అమ్మ పోయినయెడల జగత్తంతయు నవియునా నీ యభిప్రాయము? అట్లయినమాత్ర మేమి?

మధు—అయినను దొందరపడక యాలోచించుకొనుము.

దేవ—ఆలోచించిన యాఁడుదాని కధోగతియే. పోవుచున్నాను. (తనలో) దక్షిణమున సారనారాయణ మను దివ్యక్షేత్ర మున్నది. అచ్చటఁ జేరి విష్ణుదాస్య మొనర్చుకొందును.

(దేవదేవి పోవును.)

మధు—అయ్యయ్యో! పోవుచున్నది ఇఁక నాఁగదు. ఆహా! భక్తియందున్న విశేషమెంత! దొంగభక్తి నాలుమాసములు దెచ్చుకొనుసరికి సత్యమైనభక్తి కుదిరినది. ఆహా! ఆహా ఇంటి కొక్కతెనై పోయితిని. దేవదేవి యెక్కడికో భక్త్యావేశమున నిల్లు విడిచిపోయినదని నేను మాయమ్మతోఁ జెప్పను. విప్రనారాయణుఁడు దన కేమితోందగ యిచ్చునో యను భయమున సమీపముననున్న పినతల్లిగారి గ్రామమునకుఁ బోయెనని చెప్పెదను. హా! విప్రనారాయణా! ఎంతపని జేసితివయ్యా! ఎక్కడ నుంటివయ్యా!

(నిష్క్రమించును.)

ఇది పంచమాంకము.



శ్రీ

# విప్రనారాయణ చరిత్రము

## షష్ఠాంకము

(ప్రదేశము—వేశ్యావీధి)

(ప్రవేశము—విప్రనారాయణుఁడు శ్రీనివాసుఁడు)

విప్ర—ఈసారి యేకారణముచేత లోనికిఁ బోవచ్చు నంటివా?

శ్రీ—అది కారణ మంటివి గాని పోవచ్చు నని చెప్పలేదు. వేశ్యామాతకు దూత నని యాతఁడు చెప్పలేదా? అతఁడే మనసంచి హరించినాఁడు. అందువలన నిర్భీతిగా లోనికిఁ బోయి యా ముండను బెదరింపవచ్చు నని యుంటిని. సంచికొఱకు నే నేడ్చు చుండఁగ సానికొఱకు మీరు వాంఛించుచున్నారు.

విప్ర—సరే. "దేవదేవి" యని పిలువుము.

శ్రీ—దేవదేవి ! దేవదేవి !

(నేపథ్యమున) ఓసే! పెద్దీ! జంగమునూకాలయ్యగారు కాఁబోలు! తలుపు దీయుము.

(మఱియొకధ్వనితో), ఎవఁడైన సరియే నే నిప్పుడు తీయుటకు వీలులేదు.

వేశ్యమా—(తలుపు తీసి) నాయనా ! నాకు దగ్గునకు భూతపిల్లి గడ్డ తెచ్చిపెట్టెద నంటివి. తెచ్చితివా ?

శ్రీ—నేను శ్రీనివాసుఁడను.

మా—నాతండ్రే! శిష్టుకరణం శ్రీనివాసంగారా! చూడు! మా అమ్మమెడలోఁ బట్టెడ నంకించుకొనియే వచ్చితివి గదా! నాయనే! ఏదీ?

శ్రీ—(అపవారించి) అయ్యా! ఇక్కడకు దేవదేవ కిద్దరైనారు. వింటివా? అడిగినకొలఁది నింక నెందఱు బయలుదేరుదురో! బ్రహ్మచారిణి యని మీ యభిప్రాయము. (ప్రకాశముగ) నేను శిష్టుకరణమును గాను. విప్రనారాయణుని శిష్యుఁడను వీరే మా గురువుగారు.

వేశ్యమా—ఏఁడీ? మీగురువు. జుట్టు పాయఁదీసి తన్నెదను. నిన్నను బొమ్మని చెప్పినను సిగ్గులేక తిరిగి యేల వచ్చినాఁడు?

విప్ర—మాసంచిని నీదూత మాధవుఁడు హరించుటచేత నీతోఁ జెప్ప వచ్చితిమి! (మాధవుఁడు ప్రవేశించును.)

మాధ—దొంగముండకొడుక! నీసంచిని నేను హరించితి నటఁరా? నీ బ్రదుకునకు సంచికూడనా? సంచి యున్నయెడల సందెబిచ్చమైన నెత్తుకొందువు కాని తేరసరసమునకు వత్తువా?

వేశ్యమా—దాసరిముండకొడుక!. త్రిశూలములవలె, నురికంబముల వలె పట్టెనామములు పెట్టి సిద్ధమైతివా? నీసుద్దబద్దెలు చూచి నిన్ను వాడసాను లిట్టె యిట్టె ముద్దుపెట్టుకొందు రనుకొంటివి కాఁబోలు! మొద్దుముండకొడుక! నీ జేగురుడాగులు చూచి బోగముముండ లందఱు రాగముందెద రనుకొంటివి కాఁబోలు బైరాగిముండకొడుక!

శ్రీ—రంగరంగరంగా! (చెవులు మూసికొనును.)

మాధ—అతనిధైర్య మది కాదమ్మా! అచ్చువిడిచినయాఁబోతావుల మందపై నిరంకుశముగఁ బడినట్లు శంఖచక్రచిహ్నితుఁడైన

యీతఁడు సానిపనుచులపైఁ దేరతేరఁగఁ బడుట కధికార మున్నదని యనుకొనుచున్నాఁడు.

వేశ్యమా—ఊరివారికొంపలు మేము దీయుచుండ మాకొంపలు గూల్ప వచ్చితివా? ఊరివారి రక్తమాంసములు మే మనుభవించుచుండ మారక్తమాంసములు నీబొట్టఁ బెట్టుకొవచ్చితివా? చీచీ! అబ్రకోసుజాయిలాగున మొగము నీవు! నడు! నడు!

మాధ—పట్టియబ్రకోసుజాయి కాదమ్మా! నాలుగవయంకె వేసిన యబ్రకోసుజాయి యనునెడల కేవలము పాడుమొగము కాకుండఁ బంగనామముకూడఁ గొంత పడును.

వేశ్యమా—పోకపోయినయెడల తోకలితోఁ బొడుతును.

శ్రీ—మాటలతోఁ బనిలేదు. మాసంచి మాకిండు. పోయెదము.

వేశ్యమా—మీసంచి యెక్కడ?

విప్ర—మాధవా! ఇదివఱకు నీతలక్రిందఁ బెట్టికొనినది మాసంచికాదా?

వేశ్యమా—మాదిగా! నీకాలిజోడేదీ? (తీసికొని) నీసంచినామగనితల క్రింద, నామగని పాదరక్ష నీతలపైని—(నెత్తిపైఁ గొట్టుచున్నది)

విప్ర—రంగరంగరంగా! కావేరిరంగా! కస్తూరిరంగా! దయచేసితివా? తిరిగి నాకంటఁ బడితివా? నీకిప్పటికి నాయందుఁ గరుణ కలిగినదా? నాకష్టము లింకఁ దొలగినవా? నాయనా! తండ్రీ! రంగయ్యా! రంగయ్యా! ఓహో! ఎంతకాలమునకు నీ దివ్య దర్శనమిచ్చితివి! అపరాధుఁడను; దుర్మార్గుఁడను; భక్తవత్సలా! పరమపురుషా! దీనదయాళూ! సంసారోత్తారకా! నీలమే ఘాంగా! రంగా! రంగా!

(క్రిందఁ బడును.)

శ్రీ—స్వామీ! స్వామీ! ఏమి యిది!

వేశ్యమా—రంగరంగా యనుచు గావుకేకల వైచి యట్లయ్యవారి గాఁడు కొయ్యవారినాఁ డేమి ?

మాధ—నీచెప్పుదెబ్బతోఁ గపాలమోక్షమై, విటజన్మము వదలి భక్తజన్మము వచ్చినది.

వేశ్యమా—(అపవారించి) చచ్చునేమో ? నక్షత్రము మంచిదగునో కాదో ! అరఁగుక్రిందనుండి యీడ్చివేయుము.

శ్రీ—స్వామీ ! స్వామీ ! లేవరా ?

మాధ—(అపవారించి) మన మిక్కడ నుండక లోనికిఁ బోవుదము రమ్ము. ఈతఁడు చచ్చినయెడల మన కేమి ప్రమాదమో ? ఈ సంచిలోని సొత్తున కపేక్షించి యీతని జంపితి మందు రేమో? ఈసంచి వారిపైఁ బాఱవేయుదమా ?

వేశ్యమా—(అపవారించి) వాఁడు చచ్చిన సరే. నీవు చచ్చిన సరే. నే నందుల కొప్పుకొనను. రా ! లోనికి రా !

మాధ—(అప) చచ్చినయెడల శ్రీచూర్ణపరిపాలనమునకైనఁ బనికి వచ్చును. తిరుమణిపెట్టెయైనఁ బాఱవేయుము.

వేశ్యమా—(అపవారించి) ఇది చుట్టలు పెట్టుకొనుట కెంతసొగసుగ నున్నదనుకొన్నావు. రా ! లేకున్న నిన్నుఁ దన్నెదను.

(ఇద్దఱు నిష్క్రమింతురు)

విప్ర—అయ్యయ్యో ! అయ్యో ! మృదులమైన పాదమే. శిరీషపల్లవ సల్లలితమైన పాదమే—పరమమంగళరేఖాసంపూర్ణాతికోమలమైనపాదమే. అరుణారుణలలితలలితమైనపాదమే – శ్రీదేవీకర పల్లవపరామర్శనార్హమైన పాదమే ! శంఖచక్రచిహ్నితమైన పాదమే. ముద్దులు మూటగట్టుపాదమే—ప్రబలసంసారసముద్రోత్తారకసాధనమైన పాదమే—గంగామకరందస్యందనసుందరారవిందమైన పాదమే—అట్టిపాదమే—నాకుఁ బ్రాణపధ

మైనపాదమే. నాతండ్రీ! రంగయ్యా! లలితలలిత-సుకుమార-కోమల—మృదుల—పేశల—మంజులారుణ మైనయట్టిపాదమును— ఈనిర్భాగ్యుని— ఈపరమపాపాత్ముని - ఈచలితేంద్రియుని—దైన—మహాకఠినమైన యీూతలపై మోప— అహా! నొచ్చిన దేమో కదా! నాయనా! నాతండ్రీ! లోకనాథా! దాసరక్షా! దీనబంధూ! సహజారుణ మైనపాదము కందిపోయిన దేమో! అయ్యయ్యో! ఈమహాపరాధమును నే నెట్లు భరింతునోయి రంగా! రంగా! రంగా! (బిగ్గరగ నఱచుచు లేవఁబోయి గుండెలు కొట్టుకొని నేలఁ బడును.)

శ్రీ—అహా! ఈతనిభక్తి యాకస్మికముగా నుద్బోధ మైనది. మహాదృష్టము సంభవించెను.

గీ. ఐహికాపేక్ష దిగలాగి ♦ నప్పు డితని
భక్తి మెల్లఁగఁ గ్రుంకి యా ♦ పట్టు దైవ
కృపను వీడ హఠాత్తుగా ♦ నెగసెఁ బైకిఁ
గుంజగలాగి విడుచు చెట్టు ♦ కొమ్మఁబోలె.

విప్ర—గీ. బలిశిరంబునఁ దనపాద ♦ పద్మముంచి
యతని నిజభక్తుఁగాఁ జేసె ♦ నంబుజాక్షుఁ
డట్టిరంగయ్య కమ్మ ! నా ♦ యందు నెంత
కృపయొ! నన్గావ నట్లాద ♦ రించినాఁడు.

(శిరముపైఁ జేతులుంచుకొని) ఇదిగో! నీపాదపద్మము. మెత్తమెత్త నొత్తెదను. అహా! నాతండ్రీ! రంగా! రంగా! (తలనొత్తుకొనుచున్నాడు.) నాయనా! నీపాదమును గన్నుల కద్దుకొందును. (అట్లుచేయును.) బంగరుగజ్జలతో గలగలలాడి యొప్పులకుప్ప లగు నీపాదము లోకన్నన్! రాధ, పూర్వమున ముద్దుఁగొనినట్లు మదీయశిరోవతంసమైన నీపాదమును ముద్దుఁగొందును.

(తలయెత్తి. అయ్యయ్యో! అందకున్నది. (తలతిరిగిపైకెత్తును) అందదేమి? హా! రంగరంగా! (గుండెలుకొట్టుకొనును.)

శ్రీని—స్వామీ! మెడ నొప్పులు పెట్టును. మొగము వంచుఁడు. (తన చెయ్యి నతనిమోముపై వైచును.)

విప్ర—సెబాస్! అందినది! అందినది! (లెక్కలేకుండ శ్రీనివాసుని చేతిని ముద్దు పెట్టుకొనును) రంగరంగరంగా! ఇదిగో! శ్రీపాదము. నా చేతులఁ బెట్టితివి! దీనిని స్పృశించుటకే నాత్వక్కు-దీనిని బూజించుటకే నాతోఁటలోఁ బూలు! ఈతీర్థమును ద్రావుటకే నానోరు! దీనిని గాంచుటకే నాకుఁగనులు! దీని నాఘ్రాణించుటకే నాకు నాస! దీనిని వదలకుండఁ గట్టిగఁ బట్టుకొనుటకే నా కీ చేతులు! ఈశక్తి! రంగరంగరంగా! రంగ రంగా; రంగరంగరంగా; (మొగిరి గంతులు వైచును.)

శ్రీ—స్వామీ; నేను శిష్యుఁడనగు శ్రీనివాసుఁడను.

విప్ర—అదుగో! రాయి! అదుగో! రమణి! అదుగో! రంగఁడు!

శ్రీ—పిలిచిన వినఁబడకుండ నున్నది. దేహస్మృతి లేక యున్నది. ఆహా! భక్తిపారవశ్యము!

విప్ర—గీ. చపలచిత్తత భక్తి న ♦ ష్టతను బొందు
నన్నుఁ దన్ని ప్రోచితివి రం ♦ గన్న తండ్రి!
చలితశీలత జాయియౌ ♦ నలయహల్య
నోమి భక్తఁజేసినరఘు ♦ రామునట్లు.

అదుగో! విభీషణాళ్వారులు. అదిగో! కావేరి. అవిగో! గోపురములు. అవిగో! పసిడికుండలు. అవిగో! ధ్వజస్తంభములు. అవిగో! ముఖమండపములు. అదిగో! సువర్ణబలిపీఠము అదిగో! ఆలయము. అదిగో! ఘంటారవము. అదుగో! ద్వారపాలకులు. అదుగో! విష్వక్సేనాదులు. అదిగో! శేష

తల్పము! అదిగో! శ్రీదేవీపిరాట్టి. అదుగో! భూనీళాదేవులు. అవిగో! అవిగో! అవిగో! నివ్యాళులు. అదిగో! రంగనితిరుమొగము హాహాహా! (లెంపలు వైచుకొనును.) అవిగో! మంగళప్రహారతులకాంతులు! అదిగో! మజల నాతండ్రితిరుమొగము! ఆహా! ఏమిప్రసన్నముగ నున్నది! (లెంపలు వైచుకొనును.) అదిగో! మజల నాయొయ్యారిరంగని ముద్దులొలుకు వదనపుండరీకము. అదుగో! నారంగడు! నాభర్త! నానాథుఁడు! నాగురుఁడు! నాతల్లి! నాతండ్రి! నాతోడు! నాప్రభుఁడు! నాదైవము! నారంగనాథుఁడు! నారంగయ్యతండ్రి! నారంగమూర్తి! ఓఓఓ (పెద్దకేకలు వైచును.) దాసోస్మి! దాసోను దాసోస్మి! దాసానుదాసాధమోస్మి! రంగరంగరంగా!

(సాష్టాంగపడును.)

శ్రీ:—ఆహాహా! తిరిగి యెంతభక్తిపారవశ్యమునఁ బ్రకాశించుచున్నారు. గురూత్తమా! దాసోహం! దాసోహం! (ప్రదక్షిణముచేసి నమస్కరించును.)

గీ. ఇతఁ డితనిశిష్యుఁ డని వీటు ♦ లెత్తిపొడుతు
రేమొ యని మది జంకితి ♦ నింతకుమును
పితనిశిష్యుఁడ నని యిప్పు ♦ డెంచుటకు నె
తగను హా! నే నెచటను? భ ♦ క్తవరుఁ డెచట?

గీ. ఇతనిభక్తి కాంతాబలా ♦ త్కృతిని మెల్ల
సడలి, యాపట్టు వీడఁ ద ♦ త్క్షణమునందు
నట్టెబింకమై దాకొనెఁ ♦ బట్టి లాగి
విడుచునినుపబింకపుఁజుట్ట ♦ విధముగాఁగ!

గీ. జ్ఞానిముక్కుమూఁతలు సాని ♦ దానికంటె
కెదుటఁ గన్నుగీటులుగ భే ♦ దించిపోవు

భక్తుచేతితాళంపుఁజి ♦ ప్పలును వేశ్య
మెదుట గబ్బిగుబ్బ లయి హే ♦ మించిపోవు

గీ. భాగవతెఱుఁ గుష్టపవనము ♦ పోల్కి తెలియ
రాకయుండఁగ సాని దు ♦ ర్మహిమము మన
మనములను దూరి పరిశుద్ధి ♦ మన్నుఁ జేసి
నాశ మెఱుఁగనియాత్మకు ♦ నాశ మిచ్చు.

గీ. దానితోఁ బల్కుఁ బనిలేదు; ♦ దానిఁ గనఁగ
నక్కఱయె లేదు; మొద్దయి ♦ యద్ది యొద్ద
నున్నఁ జెడుట నిక్కము నల్లు ♦ లున్నమంచ
మువలనను మంచిదియుఁ జెడి ♦ పోవుఁ గాదె ?

విప్ర—సాష్టాంగస్థితినుండియు, నీతిరుముఖమండలదర్శన మవిచ్ఛిన్న ముగఁ జేయుటకుఁ గన్ను లిక్కడ నుంచలేకపోయితివా ? (తలను జూపును) రంగా! రంగ! తిరిగి లేవనక్కఱ లేకుండును గాదా ? మహాప్రభూ ! (లేచును) ఆహా ! మహాత్మా ! నీదివ్య వైభవదర్శన మపేక్షించి యిచటికే వేంచేయుభక్తులపాద పరాగము నాకుఁ బాదాదిశిరఃపర్యంత మంటి యెట్లు ప్రకా శించుచున్నదో భక్తపాదరేణువులచే నీ సన్నిధానమున నిట్లు పవిత్రుఁడనుగఁ జేయఁబడిన నేనింతటినుండి "భక్తాంఘ్రిరేణు" వను నామమును ధరింతును.

శ్రీ—గ్రామపౌరుషవ్యాపారాది జన్యనామములఁ ద్రోసి తత్తదీయసం బంధసూచకాభిధానముల ధరించువాఁడే నిజమగుభక్తుఁడు కదా! భక్తాంఘ్రిరేణు వనఁగ ద్రావిడమున "దొండరడిప్పొడి" యగును. అధోగతినుండి రంగకటాక్షమున హఠాత్తుగా మహోన్నతస్థితిగలిగిన యీతనిలోనిమార్పు నూతనజన్మము

వంటిదే కాన నూతననామముకూడ సర్వా మే. ఆహా! భక్తి మహిమము.

ఆ. వె. వేశ్యవీథి తేరు ♦ వీథి యయ్యెను; విటుల్
పరమభక్తులైరి; ♦ వారిపాద
రజము పూతమయ్యె ♦ రంగఁడాలయముతో
నిట గుడిసెలనడుమ ♦ నిలిచినాఁడు.

విప్ర—(చేతులెత్తుచు) అందవా? అందవా? తండ్రీ! తండ్రీ! (ఎగురుచు) అందవేమి? రంగా! రంగా! రంగా! తండ్రీ! తండ్రీ!

ఆ. వె. దాసు: డెకురలేక ♦ గాసిల రంగయ్య!
యీవు వంగి నన్ను ♦ నెత్తవలదె?
ఎగిరి కరము లెత్తి ♦ యెగఁబ్రాఁకుపుత్త్రికు
నిట్టి తండ్రి వంగి ♦ యెత్తుకొనఁడె?

(ఎగిరి, ఎగిరి) రంగరంగరంగా! (పడిపొరలుచున్నాఁడు.)

శ్రీ—ఈతనిభక్తి మునుపటిదానికంటె ద్విగుణముగ నున్నది. ఎందుచేతనో?

గీ. ఆకు డుల్చినఁగాని పు ♦ ష్పాంచితంబు
కాదు మల్లె; తలంగోయఁ ♦ గాని మొవ్వ
వేయ దరఁటి; చెప్పున రాచి ♦ విడువఁ గాని
దనియ మెదుగదు; భక్తి యీ ♦ దారి యేమొ?

గీ. అనిలదేవుఁడు రైరయ్యె ♦ మనకముందుఁ
బలఁచబడి చప్పఁబడు నిర ♦ భ్యంతరముగఁ
బొంగఁదలఁచు నబ్ధి; వెనుకఁ ♦ బోవుభక్తి
యగ్లెగయుటకు ముందు పె ♦ న్నాడు నేమొ?

ఆహా! భక్తపాదపరాగము దేహమునకు నెంత యంటుకొనిన నంతమంచిదని యీ మహాత్ముఁడు నేల దొరలుచున్నాఁడు.

గీ. గంధగజ మెక్కు-భూపతి ♦ ఘనుఁడు గాఁడు
 ప్రాణవాయువులను బిగ్గఁ ♦ బట్టి మింట
 నుండువాఁడు ఘనుండు కాఁ ♦ డొడలు తెలియ
 కిలను బొరలుచుండెడు భక్తుఁ ♦ డే ఘనుండు.

ఆహా! ఎంతవిస్మృతిగ నున్నాఁడు. మహాత్మా! లేచెదరా?
(లేవఁదీయుచున్నాఁడు.)

విప్ర—ఓహోహో! నాతండ్రీ! నాతండ్రీ! నిన్నుఁ జేరుటకు నాకుఁ జేయూఁత యిచ్చితివా? ఎగరలేక పడిపోయి నన్ను నీయొద్ద కెత్తితివా? రంగా! రంగా! రంగా! దేవరదాసుఁడను (శ్రీనివాసునకుఁ బ్రదక్షిణము సేయును.)

శ్రీ—ఆహా! నన్ను రంగనిగ భావించుచున్నాఁడు. నే నీతని వెనుకకుఁ బోవ నేమిచేయునో చూతును. (అట్లుపోవును.)

విప్ర—భక్తుఁ డగునాంజనేయునిఁ గౌఁగిలించిన యీ నీ తిరుహస్తములతో న న్నొకసారి స్పృశింపవా? ఏదీ! ఏదీ! (కౌఁగిలింపఁ బోయి పడును. తిరిగి లేచి) అదుగో! రంగఁడు! ఇదుగో; రంగఁడు! అదుగో! రంగఁడు! అదుగో! రంగఁడు! ఎక్కడఁ జూచిన రంగఁడే! ఎక్కడఁజూచిన రంగఁడే! నాయఱచేతులలో రంగఁడు! నావక్షస్థలమున రంగఁడు! (కన్నులు మూసికొని) అదుగో! నాలోఁగూడ రంగఁడు! వెలుపల నంత రంగఁడు! రంగనిలోనేను; నాలోరంగఁడున్నాఁడు. నే నిఁకఁ గన్నులు తెఱవను. నాలోనున్నరంగదేవు నాంతరదృష్టిచేఁ జూచుకొందును. (పడును.)

శ్రీ—ఇది భక్తి కవధి కాఁబోలు! ఈతనిభక్తిక్రమము, నేను నాకుఁ దోఁచినట్లు కనిపెట్టితిని. మొట్టమొదట నల్పజ్ఞానేంద్రియ మగు స్పర్శయందు భగవదనుభవ మారంభమై పులకాంకురాదులు కలిగినవి. అటుతరువాత జ్ఞానసంపత్తిచే నగ్రగణ్యమగునేత్రేం

ద్రియమునకుఁగూడఁ దదనుభవమువ్యాపించి శ్రీరంగదేవాలయ మెదుటఁ గానఁబడ దానిలో రంగనిఁ గాంచెను. తరువాత నాలయాది బహిస్సంబంధశూన్యముగనే నన్నె రంగనిగభావించెను. అటువైన లోకమంతయు రంగమయమై కంటికిఁ గానఁబడెను. తరువాత బాహ్యేంద్రియవ్యాపార మక్కఱలేకయే యంతరదృష్టిచే రంగని దనలోను వెలుపలను గాంచెను. ఆహా! వెఱ్ఱిలోఁగూడ నెంతక్రమమున్నది!

గీ. ప్రకృతిక్రమ మెఱ్ఱి తప్పదు ♦ క్రమము తప్ప
వెఱ్ఱి యందు రసత్వంబు ♦ వెఱ్ఱిలోన
ననుభవించువానికిఁ జూచు ♦ నతనికైనఁ
దత్క్రమ మతివేగమున బో ♦ ధంబు కాదు.

గీ. మనసు చెడుట వెఱ్ఱి యటంచు ♦ మనుజు లందు
రది యమితవృద్ధి నందుట ♦ యగును వెఱ్ఱి
జ్ఞానరాగంబులం దేది ♦ యైనఁ బొంగ
కుండ వెఱ్ఱిలే దావెఱ్ఱి ♦ యుండ మేలు.

గీ. నమ్మకముననో మెత్తఁద ♦ నముననో పర
కష్టజార్తినో యీావినో ♦ కరుణలోనో
కోలఁదియో గొప్ప దేవనో ♦ కొంతవెఱ్ఱి
గలుగువానికిఁ గాక స ♦ ద్గతియె లేదు.

గీ. మనసుభాగము లన్ని తూ ♦ చినవడుపున
గలిగి కొలబుఱ్ఱతోఁ దివి ♦ కొలిచి పరుని
కిచ్చి వేడి చల్వాయును గా ♦ కెనఁగునరుని
కచట నిచటను సద్గతి ♦ యరుదు సుమ్ము.

గీ. పరమపద మొందఁదలఁచిన ♦ ప్రతినరుండు
నిట్టిస్థితిని బొందక తీఱ ♦ దట్టుగాక

మెత్త లున్న కుర్చీకి నాని ♦ నింటితండ్రి
యని మొఱల్వెట్ట గళశోష ♦ మగు టె ఫలము.

గీ. ఇట్టిభక్తుఁడు దేవు నీ ♦ క్షించుఁ గనులు
మూసికొనియైనఁ; గనుపాఱ ♦ మేసి కనులు
మూసి ధ్యానించునరునకేఁ ♦ బొడుముకుండో?
గరిటెయో? కుక్కతోఁకయో? ♦ కానిపించు.

గీ. విగ్రహారాధనము, వర్ణ ♦ విభజనంబు,
లింగభేదంబు, సృష్టి శ్రీ. ♦ రంగభక్త
వరున కక్కఱలే వన్ని ♦ పట్ల దేవు
షాడఁ గనెడునాతనికి భేద ♦ బుద్ధియెట్లు.

గీ. ఇట్టిపరమప్రసన్నున ♦ కేట్టి కర్మ
ములు పనియె లేవు స్నానసం ♦ ధ్యలను మూసి
విస్మృతికొఱకు చెడఁద్రాగి ♦ వీరవైష్ణ
వప్రపన్నుల మనుకొంట ♦ వట్టితప్పు.

గీ. కర్మశూన్యత్వము ప్రపత్తిఁ ♦ గలుగవచ్చు
గర్మశూన్యతను బ్రపత్తి ♦ కలుగఁబోదు
కలితధీశక్తి భాగ్యంబు ♦ గలుగవచ్చు
గాని సంపదచే బుద్ధి ♦ గలుగఁగలదె?

గీ. భక్తి యాత్మలో నిండెడు ♦ వఱకు స్మరణ
నృత్యములు తప్ప వటుపైన ♦ నేమి లేవు
నీటిలో ముంచఁబడు కూజ ♦ నిండువఱకు
గుడుగుడనుఁగాని పిదప కి ♦ క్కురనునొక్కొ!

ఆహా! ఈమహాత్ముఁ డింక స్మృతిలేక యున్నాఁడు. స్వామీ! దేవా! తొండరడిప్పొడియాచార్యోత్తమా! ఆహా! ఇంకఁ బలుకకున్నాఁడు. ఈ విస్మృతి యెప్పటికి వదలునో? ఇంత

యొడలు తెలియక యుండుహానిని నేనెట్లు శ్రీరంగక్షేత్రము నకుఁ దీసికొనిపోవుదును? హా! ఏమిదిక్కు! దేవదేవి యేమై నదో తెలియదు. ఆహా! ఎంతదుర్మార్గురాలు! ఈతని నది యిట్లు భంగపఱచి యిట్లుపేక్షించుటకుఁ గారణ మేమో యత్యాగాహ్యమై యున్నది. ఆహా! రంగరంగరంగా! రంగ!

(నేపథ్యమున) ఎవరచ్చట! రంగనామస్మరణమును జేయుచున్నారు?

శ్రీ—నేను విప్రనారాయణభాగవతోత్తముని శిష్యుఁడను.

(నేపథ్యమున) ఆ మహాత్ముఁ డచ్చట నున్నాఁడా?

శ్రీ—ఉన్నాఁడు. నీ వెవఁడ వయ్యా?

(నేపథ్యమున) నిచుళాపురభూపాలుఁ డాతనిని దర్శించుటకు వచ్చుచున్నాఁడు.

శ్రీని—ఆహా! రాజుగారే! దయచేయుఁడు.

(రాజు ప్రవేశించును.)

రాజు—(ప్రదక్షిణముచేసి) విప్రనారాయణాచార్యోత్తమా! దాసోహం. దాసోహం. భక్తిపారవశ్యమున నిట్లుంటివా? అయ్యా! నే నీమహాత్ముని శ్రీరంగమునకుఁ దీసికొనిపోవ వచ్చితిని.

శ్రీ—ఈతఁ డిచ్చట నున్నట్లు ప్రభువుల కెట్లు తెలిసినది?

రాజు—నా కీదినమున జాముప్రొద్దెక్కుసరి కీలేఖ చేరినది. ఇది దేవదేవి యను నొకవేశ్య వ్రాసినది. చదివెదను వినుము. (చదువుచున్నాఁడు)

"అయ్యా!

విప్రనారాయణుఁడు నిశ్చలభక్తుఁ డని మాయక్కయు చలితేంద్రియుఁ డని నేనును వాదులాడు కొని తుద కాతని భ్రష్టుని జేసెదనని నే నామెతో బందెము నైచితిని. అట్లు భక్తిభంగుని గావించి యాతని మావీథికి

రప్పించితిని. కాని యాతనికి బ్రహ్మచర్యవ్రతము భంగము కాలేదు. ఆతని కిట్టి దురవస్థ నామూలమునఁ గలిగి నప్పటి నుండియు నాకేమో యమితమగు నాందోళనము మనసునఁ గలిగి, ప్రపంచమును రోసి, విరాగినినై దైవేచ్ఛచే భక్తిలేశాన్వితనై యెచ్చటికో యీ యుదయముననే పోవుచుంటిని. మీరు నన్ను వెదుకవలదు మీకు నేను గనఁబడను. కాని శ్రీరంగభక్తుఁడగుమహాత్ముఁడు మా వీథి నున్నాఁడు. ఆతనిని మీరు శ్రీరంగమునకు గౌరవపూర్వకముగఁ దీసికొని పోయి యాతనివసమునఁ బ్రవేశపెట్టుఁడు. ఆతనిని రంగఁడే సర్వవిధములఁ గాపాడునను నిశ్చయవిశ్వాసము కలిగినదాన నయ్యెను మీ కీమహాత్ముని సేవవలన బుణ్యము రాఁగల దని వ్రాసితిని."

తిరుక్కరంబనూరు. } చిత్తగించవలెను. దేవదేవి.

శ్రీ—(తనలో) ఇప్పటికి నాసందేహము తీఱినది. ఇంతకాలమునుండి గురుసేవఁ జేసిననాకుఁబూర్ణభక్తికలుగలేదుకాని, కుహనాభక్తి యొనర్చినదేవదేవి యిట్టి భక్తురాలయ్యెనుగదా ! అదృష్టము !

రాజు—ఈదేవదేవి యెవ్వతెయో ? ఈలేఖ యెంతసత్యమో యని నే నుపేక్షించి రేపు చూడవచ్చునని యెంచి యీరాత్రి నిదురింప నొక నాల్గుగడియలకిందట శ్రీరంగేశ్వరుఁడు స్వప్నమున నిట్లు సాయించెను.

శ్రీ—ఎట్లు? మహాత్మా!

రాజు—"మదీయభక్తాగ్రగణ్యుఁడగు విప్రనారాయణుఁడు తిరుక్కరంబనూర వేశ్యావీథి నున్నాఁడు. నీ విప్పుడేపోయి యాతనిని

మా పల్లకిలో నుంచి సమస్తవైభవములతోఁ దెల్లవాఱకుండ మాసన్నిధికిఁ దీసికొని రావలయును" అని.

శ్రీ—ఆహా! రంగనికటాక్షము.

రాజు—పల్లకి యట నున్నది. ఈతని నిమ్మళముగ లేవఁదీయుము.

శ్రీ—ఈతని కింక స్మృతి రాలేదు.

రాజు—శ్రీరంగేశ్వరుని నిర్మాల్యమగు చందన మీతని దేహమునకుఁ బూసి శ్రీపాదతీర్థము లోని కిచ్చినఁగాని స్మృతి రాదు. ఆలసింపకుము.

శ్రీ—చిత్తము. (లేవఁదీయును.)

రాజు—ఇప్పు డింక నిచ్చుటఁ గావలసిన దేమి?

శ్రీ—ఏమియు లేదు. ఐన నిట్లు కావలయును.

గీ. ధరణి యీతిబాధలు లేక ♦ తనరుఁగాక
ప్రజలయన్యోన్యవైరముల్ ♦ పాయుఁగాక
కవిత రాజపోషణమునఁ ♦ గ్రాలుఁగాక
నీతిపాలనమున రాజు ♦ నెగడుఁగాక.

రాజు—తథాస్తు. తథాస్తు.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది షష్ఠాంకము

సర్వమును సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ






గ్రంథకర్త:

కీర్తిశేషులైన మహాకవి

## శ్రీ పానుగంటి విజయ రాఘవరావుగారు

సకల గుణాభిరాముడు లోభి-వడ్డీలకోసం వేదవాక్యాలు సంపద కోసం సంఘ సంస్కారాలు - అసలీ ఫాయిదాల- వసూలుకోసం ఆప్త వాక్యాలు - కనకంకోసం ఘనకచేష్టలు, వృద్ధవివాహాలంటే ఉబలాటం స్త్రీవిద్యంటే చీదరింపూ, పేదవాళ్లంటే బెదరింపూ, కన్నకొడుకంటే కొఱలుకొఱలు, కన్నబిడ్డలంటే కంటగింపు, ఆశ్రితులంటే యేవగింపూ నౌకర్లని బెదరింపూ, అందరిమీదా అనుమానాస్త్రాలు, అతి తెలివి తేటలు, అభియోగాలు, అన్నీ మూర్తీభవించివున్న నాటకం లోభి. షోకేశాలంటే అతని కంటికి చవట పీనుగులు, సనాతన ధర్మం బుద్ధికి చవిటినేల, కరుణరసం అతనికి కంటికలికం, వితరణ గుణం అతనికి ప్రబల విరోధి, అనుమానం అతని సొమ్ము, అబద్ధాలు అతని ఆత్మ, అసత్య ప్రమాణాలు అతని పంచప్రాణాలు, ఖర్చు అతనికి కంఠపాశం, విద్య అతనికి ఉరిత్రాడు, లోకం తన కుపకారం చెయ్యాలి, తను లోకానికి అపకారం చెయ్యాలి. అందుకే అతడు అవతరించాడు.

అద్భుత సంఘటనలతో, ఆదర్శ సన్నివేశాల్తో ఆనందరసాన్ని ఒలికించే సంభాషణలతో, చక్కని వ్యవహారిక భాషలో వ్రాయబడిన సాంఘిక నాటకం. నాటక ప్రదర్శనాలకీ సినిమా చిత్రనిర్మాణానికీ అనుగుణ్యమైన నాటకరాజం. లోభి ప్రయత్నాలు ఫలప్రదమౌతాయో, తారుమారవుతాయో, ఒక ప్రతికొని వెంటనే చదవండి. పానుగంటి వారి రచనా సమర్థత ఈనాటకంలోకూడా ప్రతిభగాంచింది. కొలది ప్రతులు మాత్రమే ముద్రించినాము. త్వరపడుడు!

వెల 1—8—0.